# చతుర

డిసెంబరు 2016
రూ.15/-

# మేరునగ 'బుద్ధుడు'

వారేవ్వా!



ప్రపంచంలోని అతి పెద్ద బుద్ధ విగ్రహాలివి! శయనించి ఉన్న ఈ బుద్ధ విగ్రహం పొడవు మూడొందల అడుగులు! ఒక్క తల భాగమే అరవై అడుగులుంటుంది! ఈ విగ్రహాన్ని 1991లో నిర్మించారు. దీనిలోపల బుద్ధుడు, ఆయన శిష్యులు తొమ్మిది వేల మందివి ఒక్కో అడుగు ఎత్తు విగ్రహాలున్నాయి. దీని పక్కన మరో బుద్ధుడు మౌనంగా నిల్చుని ఈ ప్రపంచాన్ని చూస్తుంటాడు! ఈ విగ్రహం ఎత్తు మూడు వందల ఎనభై అడుగులు! లోపలి నుంచి ఎక్కి శిరస్సు భాగం నుండి చుట్టూ ప్రకృతి దృశ్యాలనూ చూడొచ్చు! మయన్మార్ దేశంలోని మొనివా నగరంలో చింద్విన్ నది ఒడ్డున కొండల మీద ఉన్నాయివి..

# మనసున ఉన్నది...

★ 'చతుర' నవంబరు సంచిక నటి కారుణ్యా ముఖచిత్రంతో చూడముచ్చటగా ఉంది. శీలా సుభద్రాదేవి నవలిక 'నీడల చెట్టు' మధ్యతరగతి జీవితాలకు ప్రతిబింబం. నవలిక 'మీర్జాసాహిబా' పంజాబీకి అనువాదం అయినా చాలా బాగుంది. 'వారెవ్వా!' అద్భుతంగా ఉంది. చతుర 'సమ్'గతులు ద్వారా చాలా విషయాలు తెలుసుకున్నాం. మధుమేహం గురించి తెలియజేసిన 'బతుకును చేదు చేసే తీపి' బాగుంది.

– **వై. హేమబిందు**, డోర్నకల్

★ ఈ నెల రెండు నవలికల ఎంపిక ఉత్తమంగా ఉంది. 'నీడల చెట్టు' నవలికలో నాలుగు దశకాల స్త్రీల చరిత్ర ఉంది. మన చుట్టూ తిరిగే పాత్రల్నే అద్భుతంగా చిత్రీకరించారు రచయిత్రి. శైలి బాగుంది. తాము ప్రేమించిన వారి ఆలోచనలకు, అభిప్రాయాలకు విలువిచ్చినప్పుడే ఆ ప్రేమకు సార్థకత ఏర్పడుతుందని తెలిపిన ప్రేమకావ్యం 'మీర్జాసాహిబా'.

– **ధప్పూరి శ్రీధరాచార్యులు**,
సీతారాంబాగ్, హైదరాబాదు

★ ప్రఖ్యాత జానపద నవలిక 'మీర్జాసాహిబా'ను 'చతుర'లో చదివి ఎంతో ఆనందించాను. అనువాదం సాఫీగా, సరళంగా సాగింది. భాష రసవత్తరంగా ఉండి హాయిగా, ఆసక్తిగా చదివేట్టు చేసింది. బొమ్మలు కథను మరింత రంగుల మయం చేశాయి. నవలిక చదువుతున్నంత సేపూ ఓ కమ్మని అనుభూతి కలిగింది. సంపాదక బృందానికి కృతజ్ఞతలు.

– **డా. టి. సంపత్‌కుమార్**, ఢిల్లీ

★ స్త్రీ అంతరంగాన్ని ఆవిష్కరింపజేసిన నవలిక 'నీడల చెట్టు'. అతి సాధారణంగా మొదలై అసాధారణంగా ముగిసింది. ప్రతి పాత్రనూ వాస్తవం ప్రతిబింబించేలా తీర్చిదిద్దిన నైపుణ్యం ప్రతి పంక్తిలోనూ తొణికిసలాడింది. 'చతుర' అందించిన ప్రేమ కానుక 'మీర్జాసాహిబా'! మార్క్వెజ్ నవల 'ది ఆటం ఆఫ్ ది పేట్రియార్క్' నియంతల స్వభావాన్ని నడివీధిలో నిలబెట్టి ఎండగట్టిన తీరు అద్భుతం. విలక్షణ మనస్తత్వాలతో కూడిన 'కాలాతీతవ్యక్తులు'పై సమీక్ష, 'బతుకును చేదు చేసే తీపి' శీర్షిక బాగున్నాయి.

– **పిశపాటి శైలజాజానకి**,
నవులూరు, గుంటూరు

★ 'నీడల చెట్టు' నవలిక జీవితానికి దగ్గరగా ఉంది. ఆద్యంతం ఆసక్తిగా చదివించింది. పంజాబీ జానపద నవలిక 'మీర్జాసాహిబా' అద్భుతంగా ఉంది. 'కొత్తగాలి' కవితలు, 'అక్షరం', చతుర'సమ్'గతులు బాగున్నాయి.

– **రత్నాకరం రఘునందన**, అనంతపురం

★ పంజాబీ అపూర్వ ప్రేమగాథ 'మీర్జాసాహిబా' కమ్మని విందులాగుంది. సాహిబా గత స్మృతులే కథనంగా మారి అపూర్వ ప్రేమకథనూ, ప్రేమికుల కర్తవ్యాన్నీ మనసుకు హత్తుకునేలా అనుభవాల వెన్నను చిలికించాయి. డబ్బు, అందం, తెలివితేటలకు మంచితనం కలిస్తేనే జీవితం నందనవనం అవుతుందని తెలియజెప్పిందీ నవలిక.

– **గరిమెళ్ల అలేఖ్య**, కాకినాడ

★ ఇరువైపులా అందమైన చిత్రాలతో చతుర ముచ్చటగా ఉంది. 'వారెవ్వా!'లోని 'ప్రకృతికి ప్రతీక' చాలా బాగుంది. నవలికలు 'నీడల చెట్టు', 'మీర్జాసాహిబా' ఒకదాన్ని మించి మరొకటి ఉన్నాయి.

– **కరణం శివానందరావు**, కర్నూలు

★ 'నీడల చెట్టు' నవలిక రమ్యంగా ఉంది. చదువుతున్నంతసేపూ దృశ్యకావ్యాన్ని తలపించింది. 'మీర్జాసాహిబా' చాలా బాగుంది. అలరించిన ప్రేమకథ ఇది.

– **వెలగా రాజేశ్వరరావు**

★ 'నీడల చెట్టు' నవలికలో నియంత తండ్రికి పిల్లలు ఎదురు తిరిగి, రెక్కలు రాగానే ఎవరి గూడు వారు ధైర్యంగా ఏర్పరచుకోవడం బాగుంది. 'నవలావలోకనం'లో 'కాలాతీతవ్యక్తులు' నవలపై సమీక్ష చక్కని శైలితో సాగింది. చతుర'సమ్'గతులు విజ్ఞానదాయకం.

– **ఎన్.వి. రమణి**, హైదరాబాదు

సంపుటి -39,
సంచిక - 11
467వ సంచిక,
పేజీలు : 132, డిసెంబరు 2016

# చతుర



'వన్యప్రాణుల సంరక్షణ పేరుతో సర్కారువారు అటవీ భూముల్ని సేకరించి ఆనక వాటిని సిమెంట్, బాక్సైట్ లాంటి పరిశ్రమలకు కట్టబెడుతున్నారు. ముడి ఖనిజాలు తవ్వి, ఆదివాసి ప్రాంతాలను బొందల గడ్డలుగా మార్చేస్తున్నారు. పైగా ఈ పర్యావరణ విధ్వంసానికి అభివృద్ధి అనే అందమైన పేరు. ఈ కుట్ర ఇంతటితో ఆగదు. మనిషి శ్రమ రుచి మరిగిన మానవపులి అందరిమీద దాడి చేస్తుంది. ఈ దగాకోరు పద్ధతుల్ని వ్యతిరేకించి పోరాడక తప్పదు. న్యాయమైన పోరాటానికి మద్దతు తెలుపాలని కోరుతున్నా..' అంటూ మహా ఉద్వేగంగా మాట్లాడాడు పౌరహక్కుల నాయకుడు. ఆ పిలుపు అందుకున్న ప్రజలు ఎలా స్పందించారు? వ్యక్తుల తత్వాల్ని, వ్యవస్థ తీరుతెన్నుల్నీ అత్యంత సహజంగా మలచిన ప్రముఖ రచయిత **అల్లం రాజయ్య** నవలిక **టైగర్‌జోన్** పేజీ నెం.. 06



★ 'అత్తయ్యా! మీ కూతురికి అబార్షన్ అయింది. టికెట్లు తీసి వివరాలు సెల్‌ఫోనుకు పంపించా. వెంటనే బయలుదేరి రండి' అని చెప్పిన అల్లుడితో 'మీ అమ్మగారిని పిలుచుకో నాయనా! ఇక్కడ నా కొడుక్కి నేను చాలా అవసరం' అని ఫోను పెట్టేసింది ఆ అత్తగారు! ఇంతకీ కూతురి అవసరం కాదని కొడుకు దగ్గరే ఉండిపోవడానికి కారణమేంటి? ఆమెకు కూతురంటే ఇష్టం లేదా? **అరిపిరాల సువర్ణ** నవలిక **తరాలు.. అంతరాలు** పేజీ నెం.. 65

★ రెండో కవరు : వారెవ్వా!
★ చివరి కవరు : బేబీ శ్రీమహి
★ పుస్తకాలంకరణ : రాజు యాట

e-mail: vipula.chatura@eenadu.net /
vipula.chatura@gmail.com
Toll Free No: 18004258888 (Hyd)

జగన్‌రావు పెద్దన్నను టార్గెట్ చేసుకుని
దాడికి దిగారు నక్సలైట్లు..
అతను దొరకలేదు, కానీ ఆ దాడిని కళ్లారా చూసిన
జగన్‌రావు తండ్రి గుండె ఆగి చనిపోయాడు!
నెల తిరక్కముందే తండ్రి మాసికం రోజున మళ్లీ అతన్ని
చంపేందుకు ఇంట్లోకి చొరబడ్డారు..
ఈసారీ జగన్ పెద్దన్న దొరకలేదు.. ఈ గొడవలకు అసలు
సంబంధం లేని అతని ఇద్దరు తమ్ముళ్లతో పాటు అడ్డు వచ్చిన
మరొకర్ని చంపారు..! ఆ తర్వాతేమైంది? ఇంతకీ నక్సలైట్లకు
అసలు వ్యక్తి దొరికాడా? వర్తమాన ఆదివాసీ సమస్యలకు
అద్దంపడుతూ ఆద్యంతం ఉత్కంఠగా సాగే నవలిక
**టైగర్ జోన్** చతుర డిసెంబరు కానుక!

# టైగర్ జోన్

బొమ్మలు : సీతు

స్కా ర్పియో వాహనం నాలుగురోడ్ల కూడలిలో హఠాత్తుగా ఆగిపో యింది. ఎదురుగా రోడ్డుమీద ఇంకా చాలా రకాల వాహనాలు అంతకుముందే ఆగి వున్నాయి. రకరకాల మనుష్యులు గడబిడగా మాట్లాడుకుంటూ నిప్పు తొక్కిన కోతుల్లా అటిటు తిరుగుతూ కన్పించారు. ఒక యువకుల గుంపు, అందులో మహిళలు కూడా ఉన్నారు. కొందరు స్కార్పియో ముందు నిలబడి ఏదో అడుగుతున్నారు. డ్రైవర్ శ్రీను కిందికి దిగి వాళ్ళకేదో చెబుతున్నాడు. శ్రీను ఆ గుంపుతో పాటు ముందుకు వెళ్ళి పది నిమిషాల తరువాత వాహనం వద్దకు తిరిగి వచ్చాడు.

హఠాత్తుగా ఆ అడవిదారిలో, అంత మందిలో విచిత్రమైన పరిస్థితిలో చిక్కుకు పోవడంవల్ల విద్యాసాగర్ రావుకు అదోలా ఉంది! అనుకోకుండా కలిసివచ్చి అడవితో, అడవిలోని గనులతో ముడివడివున్న పరి శ్రమలోకి కొత్తగా అడుగుపెట్టడం వలన అతనికింకా ఇలాంటి ప్రయాణాలు, మను షులు అలవాటు కాలేదు.

చూస్తుండగానే వెనుక బస్సులు, లారీలు ఇతర వాహనాలు కనుచూపు మేర దాక ఆగిపోయి కనిపించాయి. అద్దాలు మూసు కొని, స్కార్పియోలో కూర్చుండటం విసుగొ స్తోంది. నిమిషాల్లోనే అక్కడ ఇసుక వేస్తే రాలనంత జనం పోగయ్యారు. నినాదాలు, పాటలు - మైకులో ఎవరో ఏదో మాట్లా డుతున్నారు. వేల మాటలు కలగల్సిపోయి వింత ధ్వనులతో ఆ ప్రదేశం ఉద్విగ్న వాతావరణంలోకి మారిపోయింది.

అంతలోనే డ్రైవర్ "టైగర్ జోన్‌కు వ్యతి రేకంగా ఇక్కడ ధర్నా జరుగుతోంది. మనం మధ్యలో ఇరుక్కుపోయినం సార్, ముంగటికి ఎనుకకు ఎటూ కదలలేం సార్" లోపలికి తొంగిచూస్తూ చెప్పాడు.

డ్రైవర్ పక్క సీట్లో కూర్చున్న మేనేజర్ హెచ్.ఆర్.ఎ (హ్యూమన్ రీ సోర్సెస్ అండ్ అడ్మినిస్ట్రేషన్) శివశంకర్ చిన్న పాటి ఉత్సుకతతో కారుడోర్ తెరిచి కిందికి దిగాడు. అయిదు నిమిషాలు ఎవరితోనో సెల్ ఫోనులో మాట్లాడిండు.

లోపల కూర్చున్న సిమెంటు కంపెనీ మేనేజింగ్ డైరెక్టర్ విద్యాసాగర్ రావుకు జనం మధ్యలో చిక్కుకున్న అలాంటి క్లిష్ట పరిస్థితిలో ఏం చేయాలో తోచలేదు. కారులో నుండి కిందికి దిగాలో వద్దో అంతకన్నా తెలియలేదు.

డ్రైవర్ శ్రీను మళ్ళీ బండెక్కి అతి కష్టం మీద ఎడమవేపు రోడ్డు మీదికి కారు తిప్పి, అక్కడున్న గుడిసె హోటల్ దగ్గర రోడ్డుకు పక్కగా ఆపాడు.

శివశంకర్ యం.డి. దగ్గరికి వచ్చి లోప లికి తల పెట్టి "మినిమం గంటైనా ప ట్టొచ్చు సార్. కలెక్టర్ పి.ఎ.కు ఫోన్ చేసి చెప్పాను సార్. ఇప్పుడు పదయ్యింది. మనకు మధ్యాహ్నాం పన్నెండు గంటలకు అపాయింట్‌మెంట్.. ఎందుకైనా మంచి దని సాయంత్రం మూడు గంటలకు మార్చమన్నాను సార్"

అదేం పట్టించుకోకుండానే విద్యాసాగర్ రావు "ముందే పరిస్థితి తెలుసుకోవద్దా? నీ ప్లానింగ్ ఇట్లా ఏడ్చింది. ముందు ఇక్క డి నుండి బయట పడేదెలాగో చూడు. ఈ న్యూసెన్స్‌లో చిరాగ్గా ఉంది, ముందు శీను గాడిని కారు అద్దాలు దించమని చెప్పు" గుర గురలాడుతూ కోపంగా అన్నాడు.

శివశంకర్ డ్రైవర్ సీట్లో కూర్చున్న శ్రీనుకు చెప్పాడు. విద్యాసాగర్ రావు ఏమ నుకున్నాడో ఏమో? "అద్దాలు పూర్తిగా దించకు కొద్దిగా.." అన్నాడు.

"సార్! ముందుకైతే బండి నడవదు. రోడ్డుమీద వందలమంది బైఠాయించిండ్లు" అన్నాడు శ్రీను అద్దాలు కొంచెం దించి.

"గుంపు సైకాలజీ తోడ్ పోడ్ అన్న ట్టుంది. ధర్నా గురించి ఏ మాత్రం

మనకు తెలియదు. ఇట్లాంటి సమయంలో మనం ఇరుక్కపోయినం. ముందుకు పోతే, అల్లాంటి ప్రయత్నం చేస్తే మన వెహికల్‌ను డామేజ్ చేస్తరు. వెనుక వైపు మనం వచ్చిన దిక్కు అస్సలు కదలలేం. కిలోమీటరో అంతకన్న ఎక్కువనో ట్రాఫిక్ జామైంది. మనం ఉన్న రోడ్డు చూడండి.. ఇది గోదావరి దాకా పోతుంది. అక్కడికి రోడ్డు ఆఖరు. ఇక్కడా గుంపులు గుంపులుగా గూడేల నుండి గోండోళ్ళు ఇంకా వస్తున్నరు. ఇప్పుడైతే మంది అటు పోని య్యరు" అన్నాడు శివశంకర్.

కారు మీద ఎడమ వైపు ఉన్న పొడవాటి టేకు చెట్ల నీడ పడుతోంది. తమకు ఎడమదిక్కు గుడిసె హోటల్ దగ్గర గుంపుగా మంది పోగై ఏదో బిగ్గరగా మాట్లాడుతున్నారు. ఎదురుగా ఉత్తరం వేపు మక్కజొన్న పెరండ్ల మీదుగా అడవిలోకి రోడ్డు, సుదూరంగా ముదురాకుపచ్చ రంగులో కొండలు.. బహుశా ఆ అడవి ఆవల, కొండలకావల తమ గనులున్నాయి. రోడ్డు పక్క నుండి ఒక చిన్న బాట అడవిలోకి విస్తరించింది. మెయిన్ రోడ్డు మీద కుడివైపు ఫారెస్ట్ చెక్ పోస్టున్నట్లున్నది. ఖాకీ బట్టలు వేసుకున్న ఫారెస్టు గార్డు ఎర్రపిల్ల లోపల టేబుల్ ముందు కూర్చున్నది. ఇంకొక ఫారెస్టు గార్డు ఏమి చేయాలో తోచక నిలుచున్నాడు. ఆగి ఉన్న బస్సుల మధ్య చెక్ పోస్ట్ డివైడర్ కొంచెం కన్పిస్తోంది. స్కార్పియో వెహికల్ పక్కనే అడవినానుకొని పడమటివైపు ఒక పెద్ద సైన్ బోర్డు ఉన్నది. ఆ బోర్డులో ఒక పులి పడుకొని, ఒక పులి నిలబడి ఉన్నాయి. కింద 'వన్య ప్రాణుల సంరక్షణకు తోడ్పడండి' అని ఉన్నది. పక్కకున్న డివైడర్ మీద 'కవ్వాల్ అభయారణ్యం, హెవీ వెహికల్స్‌కు ప్రవేశం లేదు' అని రాసి వున్నది.

రాలిన ఎండుటాకులు పరపర శబ్దం చేస్తుండగా మంది అసుబిసుగా నడుస్తు

> **కొత్తగాలి...**
>
> **కొడుకు కసాయి**
> **కోడలు లడాయి**
> **కూతురు పరాయి**
> **వృద్ధులకేది దారి?!**
>
> – వెల్మల రాంరెడ్డి,
> పూడూరు, కరీంనగర్ జిల్లా

న్నారు. డ్రైవర్ శ్రీను బండి దిగి మందిలో కలిసిపోయాడు. ఇలాంటి ఉద్రిక్త వాతావరణం అతనికి అలవాటున్నట్లే ఉన్నది.

ఆగిపోయిన బస్సుల్లో, లారీల్లో నుండి దిగిన వాళ్ళు - అందులో ఎక్కువగా కింది తరగతివాళ్ళు ముందు సుదూరంగా విస్తరించిన మనుషుల గుంపు దగ్గరికి, ధర్నా దగ్గరికి చేరిపోయారు. అక్కడ జరిగే సాంస్కృతిక కార్యక్రమాల్లో కలిసిపోయారు. డ్రైవర్లు, కండక్టర్లు, క్లీనర్లు బస్సుల్లో కూర్చుండిపోయారు. మహిళలు, పిల్లలు, ముసలి, ముతక, మధ్య తరగతి, పై తరగతి ప్రయాణీకులు ఏమి చేయాలో తోచక అటుఇటు తిరుగుతున్నారు.

"మా ధర్నా వల్ల ఇబ్బందులు ఎదుర్కొంటున్న ప్రజలకు విజ్ఞప్తి.. అనేక పనుల మీద ఈ రూట్లో ప్రయాణం చేస్తున్న ప్రజలు మమ్మల్ని మన్నించాలి. ఇట్లా మీకు కష్టం కలిగినందుకు విచారిస్తున్నాం. మేం తప్పని పరిస్థితులలో ధర్నా చేపట్టాం. పరీక్షలకు, ఇంటర్వ్యూలకు, దవాఖాన్లకు పోయే వాళ్లుంటే- మా కార్యకర్తలు ఆగి ఉన్న వాహనాల మధ్య తిరుగుతున్నారు, విచారించి పంపిస్తారు. అలాంటి వారి కోసం ముందు రెండు బస్సులు ఉంచాం. మిగతా వాళ్ళు ఉద్యోగస్తులు, వ్యాపారులు, విద్యార్థులు, రైతులు,

మేధావులు తదితర ప్రజానీకం మాకు సహకరించాలె - మా గోడేందో మీరు వినాలె" ఒక పొడుగాటి వ్యక్తి మైకులో అనౌన్స్ చేస్తున్నాడు.

తలలకు ఆకుపచ్చ పట్టి కట్టుకున్న కొంతమంది వాలంటీర్లు - వాహనాల మధ్య తిరుగుతూ అత్యవసరాలున్న ప్రయాణీకులను వెంట తీసుకొనిపోతు న్నారు. శివశంకర్‌కు ధర్నాలు, పికెటింగ్‌లు, సమ్మెలు సందర్భంగా ఇట్లాంటి మందితో కలవడం అలవాటే. పైగా ఇలాంటి వాతావరణంలో అతనికి కొత్త శక్తేదో వచ్చినట్టుంది. అయితే ఇక్కడున్న మందితో అస్సలు కలవలేని తన యజమానితో- ఉద్రిక్త వాతావరణంలో, బర్నింగ్ ప్లేస్‌లో ఎట్లా వ్యవహరించాలో తెలియడం లేదు. పైగా తమది వీళ్ళ ప్రత్యర్థి శిబిరం. నీళ్ళల్లో మునిగిపోయే ఈత రానివాని పక్కనున్నట్లుంది. తన ఉద్యోగంలో ఇంతవరకు రెండు విరు ద్ధ శక్తులను విడివిడిగా ఎవరి జాగాల్లో వారిని కలవడం, చర్చించడం వేరు. ఒకే దగ్గర మోహరించి, ఎదురుబొదురుగా ఉన్నప్పుడు కలవడం.. అలాంటి రియాక్షన్స్‌ను బ్యాలన్స్ చేయడం అదీ ఊపిరి సలుపని వేగంలో.. తోచడం లేదు. అయినా తనకెందుకు? అందరిలా తను.

కారులో కూర్చున్న విద్యాసాగర్ రావుకు ఊపిరాడనట్టుగా ఉంది. వీళ్ళిద్దరు ఎక్కడ చచ్చారో తెలియదు. తమ వెహికల్ నిలిచి ఉన్న దారి గుండా నినాదాలు చేస్తూ కొత్త గుంపులు వచ్చి చేరుతున్నాయి. వాళ్ళంతా నల్లటి స్కార్పియోను అనుమానంగా చూసి ముందుకు కదులుతున్నారు.. అరెస్టయిన వ్యక్తిని చూసినట్లుగా లోపల కూర్చున్న తనను చూస్తున్నారు. కారు అద్దాలు పూర్తిగా తెరుచుకుంటే ఫ్రెష్ అడవి గాలి అయినా వచ్చేది. కాని తను అట్లా చేయకూడదు. ఎడమవైపు అడవిలోని టేకు వృక్షాలు నిటారుగా ఆకాశంలోకి నిలుచున్నాయి. అప్పటిదాకా మంద్రంగా వినిపిస్తున్న లొల్లి పెద్దదై చెవులు బద్ద లయ్యే విధంగా విన్పిస్తోంది. ఆదిలాబాద్‌కు పోయే రోడ్డు మందితో, నినాదాలతో మారుమోగుతోంది. అదే రోడ్డు ముందు వేపు జన్నారం వైపు నుండి కూడా మనుషులు గుంపులు, గుంపులుగా వచ్చి చేరుతున్నారు. ప్రయాణీకులు కాకుండా బహుశా మూడు, నాలుగువేల మంది ఉంటారేమో? శివశంకర్ తరచు ఈ రూట్‌లో తిరుగుతుంటాడు. ధర్నా గురించి ముందుగా తెలియదా?

తనకు మందిని చూస్తే చిరాకు. పైగా ఇలాంటి అడవి మనుషులను, పని పాట లోల్లను చూస్తే ఎలర్జీ.. బయటకు దిగి అలాంటి మందిలో కలవలేడు. అయినా లోపల కూర్చోవడం, అదీ ఆగివున్న వెహికల్‌లో దొంగలాగా.. దారుణంగా ఉన్నది. దిగాలో వద్దో తెలియదు. చుట్టూ చూశాడు, శివశంకర్ కన్పించలేదు.

రోడ్డుకు కుడిపక్క కొంచెం దూరంలో హోటల్ గుడిసె ముందు శ్రీను పందిరి కింద ఉన్న ఒక స్త్రీతో మాట్లాడుతున్నాడు. కుడిచెయ్యి బయటపెట్టి రమ్మన్నట్లు చెయ్యూపాడు విద్యాసాగర్ రావు.

వాడికి కన్పించిందో, లేదో? ఇలాంటి విచిత్ర పరిసరాలలో, అడవిలో, కోపోద్రిక్తులైన మందిలో తనకు ఎట్లా మెసులుకోవాలో తెలియనట్టే ఉన్నది.

శ్రీను యం.డి. దగ్గరికి పరిగెత్తుకొచ్చి "సార్!" అన్నాడు.

'సార్‌ను పిలూ!" అన్నాడు అసహనంగా.

శ్రీను పరిగెత్తుకెళ్ళి శివశంకర్‌ను పిలుచుకొచ్చాడు.

"వాట్ మిస్టర్ శివశంకర్ ఈ న్యూసెన్సు? చెత్త ప్లానింగ్!" విద్యాసాగర్ కోపంగా అన్నాడు.

అక్షరం

ఓ మనిషి నడవడిక గురించి
తెలుసుకోవాలనుకుంటే అతనికి
అధికారమిచ్చి చూడండి

– అబ్రహాం లింకన్



"సార్! మీరు కారులో కంటే - పక్క హోటల్లో కుర్చీలో కూర్చోండి సార్! పరిస్థితి చూస్తే బాగాలేదు" గొంతులో నమ్రత తెచ్చిపెట్టుకొని - శివశంకర్ అన్నాడు.

'అంటే ఇంతమందిలో తనొక్కడే ఇక్కడి గుంపుకు పడనివాడని అర్థమా? ఇంతకూ వీడు తనను గౌరవిస్తున్నట్టా? లేక..' ఆలోచనలో పడ్డాడు యం.డి.

ఇంతలో శ్రీను కారు డోరు తీశాడు.

యం.డి. కందగడ్డ ముఖంతో కారు దిగి, నడవడం చేతకాని వానిలాగా నిలబడి.. హోటల్ గుడిసె దగ్గరికి విధిలేక నడిచాడు. ఆ తరువాత ఏం చేయాలో అతనికి తోచలేదు. దిక్కులు చూస్తూ నిలుచున్నాడు. శ్రీను యం.డి. వెనుకే వచ్చి గుడిసె హోటల్ దగ్గరికి వెళ్ళాడు.

"దేవక్క లోపట కుర్చీ ఉన్నదా?" శ్రీను అడిగాడు.

"ఉండాలే లోపలికచ్చి తీస్కపో" అన్నది ఒక స్త్రీ కంఠం.

శ్రీను గుడిసె లోపలికి వెళ్ళి ఒక ప్లాస్టిక్ కుర్చీ తెచ్చి హోటల్ పందిరికి కొంచెం ఎడంగా, పచ్చిరిక చెట్టు నీడకు మంది రాని జాగా చూసి వేశాడు. గుడ్డతో కుర్చీ తుడిచాడు. యం.డి. చిరాగ్గా కూర్చున్నాడు. తర్వాత శ్రీను స్కార్పియో వద్దకు వెళ్ళి నీళ్ల బాటిల్ తెచ్చి, గ్లాసులో పోసి యిచ్చాడు. విద్యాసాగర్ నీళ్ళు తాగాడు.

శ్రీను ఫ్లాస్కులో కాఫీ తెచ్చాడు. విద్యాసాగర్ ఆ వాతావరణం చూసి వద్దన్నాడు.

మరో రెండు నిమిషాలకు గాని అతనికి అక్కడి వాతావరణం మెదడుకెక్కలేదు.

తూర్పుకేసి పచ్చగా నవనవలాడుతున్న వరి పొలాలు. పొలాలల్లో జలజల పారుతున్న కాలువ నీళ్ల చప్పుడు.. బహుశా కడెం ప్రాజెక్టు ఆయకట్టులాగున్నది. మెయిన్ రోడ్డుకు ఆవలివైపు ముదురు ఆకుపచ్చ మక్కజొన్న పెరండ్లు.. అడవి అక్కడి నుండే మొదలవుతుంది. ఉత్తర, దక్షిణాలుగా వ్యాపించిన దట్టమైన అడవి.

హోటల్ గుడిసెను చూశాడు. నాలుగు రోడ్ల కూడలిలో ఎడంగా వేసిన గడ్డి గుడిసె మీద సొర, చిక్కుడు తీగలు పాకి ఉన్నాయి. గుడిసె మీద నవనవలాడే సొరకాయలు చాలా ఉన్నాయి. గుడిసె ముందు పందిరికింద కంక బొంగులతో తయారుచేసిన బెంచీలు.. గుడిసె ఉత్తరం వేపు బంతి చెట్లు విరగపూస్తున్నాయి.

సుదూరంగా ఉత్తరంవేపు నీలం కొండలు.. కొండలమీద, పొలాలమీద, చెట్ల కొనల మీద మార్చి ఉదయపు ఎండ పారాడుతోంది. చిత్రమైన రంగుల మేళవింపులో చలనశీలమైన ప్రకృతి చిత్రం.. దానికి తోడు పొలాల మీదుగా వీచే గాలి చల్లదనం.

ఎవరో బక్కపలుచని మధ్య వయస్కుడు హోటల్ దగ్గరికి వచ్చి "దేవీ! మీరు కరపత్రాలు పంచుండ్లి" అన్నాడు. అతని ముఖం తనకు తెలియని ఏదో తీవ్రమైన ఉద్విగ్నతలో ఉన్నది.

కుర్చీలో కూర్చున్న విద్యాసాగర్ రావుకేసి అతను అనుమానంగా చూసిండు.

"అడవిల పుట్టినం.." రెండు చేతులతో సుదీర్ఘంగా వ్యాపించిన కొండల వరుసకేసి

## కొత్తగాలి...

**నేటి కష్టం**
**రేపటి సుఖం!**
**నేటి సుఖం**
**రేపటి కష్టం!**

– మా.శ్రీ. రాజు,
పాల్వంచ, ఖమ్మం జిల్లా

చూయించి - బక్కపలుచటి వ్యక్తి తడితో మెరిసే కళ్ళతో - "గీ అడవిల ఏ బండెక్కడున్నదో? ఏ చెట్టు ఎక్కడున్నదో? లొద్దులు, దొనలు - అన్నీటి లోతు పాతులు తెలిసినోళ్ళం! గీ అడవి మా తల్లి - అడవికి నొయ్యకుండ అడవిల తిరుగుతం. అడవి మా జీవునం. జీవరాసులు, మేము చెట్టుచేమతో కలిసి బతుకుతం. గిప్పుడు పులుల కోసం బయటికి అడివిడిసి పొమ్మంటే - ఏడికి పోతం? ఏడ బతుకతం? ఇదంతా దొంగ నాటకం. అడవిల కట్టె - భూమి లోపటి రాయి దోసుకుపోవటానికి నాటకం. లంగ సర్కారు, జూటా సర్కారు. పులి ఉంటే మాతోనే ఉంటది. ఒకటో, రెండో పులుల కోసం వందలమందిని సంపుతరా? అరె మనుషులను బతకనిత్తరు గాని. పులుల కోసం అడివిల నుంచి మమ్ముల బయిటికి తరుముతరట! పులులు లెవ్వు, మన్ను లెవ్వు. ఎవడడ్డమొత్తడో రానియ్యి. అడ్డంగ నరుకుతం.." అన్నాడు.

ఆ మాటకు విద్యాసాగర్‌రావుకు చివ్వున రక్తం చిమ్మినట్టుగా అనిపించింది. తనకే చెబుతున్నాడా? ఎట్లా రియాక్ట్ కావాలి? తమలాంటి వాళ్ళకు ఎదురెదురు బాహాబాహి యుద్ధాలు తెలియవు. కానీ ఇక్కడ తన ప్రత్యర్థి ఎదురుగా నిలబడి సవాలు విసురుతుండు. ప్రతిగా తను జవాబు చెప్పలేడు. శివశంకర్‌గాడు ఏడ సచ్చిండో?

బక్కపలుచటి వ్యక్తి దేవి దగ్గర కరపత్రాలు తీసుకొని మందిలో కలిసిపోయిండు.

కళ్ళు, చెవులు పనిచెయ్యకుంటే బావుండు ననుకున్నాడు విద్యాసాగర్.

ఎవరో పెడీపెడీన నినాదాలు ఇస్తున్నారు. వేల కంఠాలు ఆ నినాదాన్ని అందుకుంటున్నాయి. అడవిలో ఒక చిత్రమైన హోరు, అలజడి..

"పోరాడుదాం! పోరాడుదాం!"

"టైగర్ జోన్‌కు వ్యతిరేకంగా పోరాడుదాం"

"పోరాడుదాం! పోరాడుదాం"

"జల్ - జంగల్ - జమీన్ కోసం పోరాడుదాం"

"మనిషి ప్రాణం వద్దా!"

"పులి ప్రాణం ముద్దా!"

"టైగర్ జోన్ వెంటనే"

"రద్దు చేయ్యాలి!"

డప్పులు, డోళ్ళు, కొమ్ములు ఇంకా పేరు తెలియని ఆదివాసి సంగీత వాయిద్యాలు మోగుతున్నాయి. అంతకంతకూ మీటింగులో ఉద్వేగం పెరుగుతోంది. పాటలు, డ్యాన్సులు, మధ్య మధ్య నాయకుల ఉపన్యాసాలు సాగుతున్నాయి.

పందిరి కింద చాయ్ కోసం బ్లోయర్ తిప్పుతున్న దేవి, ఇనుప బకెట్టులో బుగుబుగలాడే నిప్పును - మరుగుతున్న ఛాయ్ గంజును చూసి - పందిరి కింది నుండి బయటకు వచ్చి విచిత్రమైన ఉద్విగ్నతతో ముని పాదాల మీద నిలబడి పిడికిలెత్తి "కల్లే సర్కార్ తోడింగే.." అని నినాదమిచ్చింది. ఆ చుట్టుపక్కల నిలుచున్న వాళ్ళంతా "తోడింగే" అన్నారు. అక్కడా వేడి పెరుగుతోంది. కిలోమీటరు పొడువున్న వాహనాల మధ్యలో కూడా ఇలాంటి నినాదాలు మారుమోగాయి. నినాదాలు కింది దాకా వెళ్ళిపోయాయి.

ఆ నినాదాలు మందికి ఉత్సాహాన్ని, ఉద్విగ్నతను కలిగిస్తే, విద్యాసాగర్‌రావుకు కంపరం పెంచుతున్నాయి.

మౌనంగా, మర్యాదస్తులుగా రాజ్యానికి, చట్టాలకు విధేయులుగా నటించే మనుష లంతా ఇట్లా గుమి కూడినప్పుడు బయట పడతారా? ఇంతమంది చట్ట వ్యతిరేకులు - ప్రభుత్వ వ్యతిరేకులా! విద్యాసాగర్‌రావు మనసులో చిత్ర విచిత్రమైన ఆలోచనలు కలుగుతున్నాయి.

విద్యార్థిగా ఉన్నప్పుడు, తను చదువు కున్న కాలేజీలో ఇలాంటి మీటింగులనేకం చూశాడు. కింది కులాల పిల్లలు ముఖ్యంగా షెడ్యూల్డు క్యాస్టు, బ్యాక్‌వర్డు క్లాసు పిల్లలు మీటింగుల్లో లీనమై తిరిగే వారు. రాడికల్ విద్యార్థి సంఘం, పి.డి. యస్.యు.లు బలంగా ఉండేవి. తమ లాంటి పై కులాల పిల్లలు వాళ్లకు వ్యతిరే కంగా విద్యార్థి పరిషత్తులో తిరిగేవారు. ఎవరికి వారు రహస్య మీటింగులు పె ట్టుకొని అప్పుడప్పుడు కొట్టుకునేవారు. కాని తను ఎందులోనూ పెద్దగా లీనం కాలేదు. పుట్టుక రీత్యా తను అగ్రకులంలో ఎలాంటి ఆర్థిక వనరులు లేని కుటుంబంలో, అదీ పల్లెటూరిలో పుట్టాడు. ఉద్యమాలు, మీటింగులు కింది కులాలవే అనుకు న్నాడు. కానీ కులం రీత్యా తాను పైవా ళ్ళతో మానసికంగా మమేకమై ఉన్నాడు. అయినా కొట్లాడటానికి లోపల భయం. వాళ్లందరికన్నా అధికుడినని నిరూపించుకో వడానికి ఒంటరిగా, కసిగా చదవడం అల వాటు చేసుకున్నాడు. నిచ్చెన మెట్ల కుల వ్యవస్థలో అర్థికంగా కింది మెట్టువాడే అయినా చదువు సహాయంతో పై మెట్టుకెదగాలనే తపన. పైగా తన చదువు చూసి, పైకొస్తాడని తెలంగాణాలో అత్యంత పేరుమోసిన భూస్వామి కుటుంబం తమ అల్లుణ్ణి చేసుకున్నది. అనతి కాలంలోనే వాళ్ళ అలవాట్లతో కల వక తప్పలేదు. తనను ఏ పామూ మింగ కుండా నిచ్చెన పైమెట్టుకు ఎక్కగలిగాడు.

కొత్తగాలి...

**అ, ఆ లు నేర్వకపోయినా**
**అమ్మకు, ఆలికి మధ్య**
**తేడా తెలిస్తే చాలు**
**మృగాడిగా**
**మారకుండా ఉండటానికి!**

*- టి. హేమలత,*
*మచిలీపట్నం, కృష్ణా జిల్లా*

తనకు సరిపడని అక్కడ నెలకొన్న ఉద్విగ్న భావావేశానికి ఎడంగా ఉండేం దుకు ఆ అడవిలో, అంతమందిలో తనె క్కడ దాక్కోవాలి? విచిత్రంగా తను దొరికిపోయినందుకు అసహనంగా కుర్చీలో కదిలి - తెచ్చిపెట్టుకున్న గాంభీర్యంతో.. కంపరం, కోపం కన్పించకుండా ముఖం తిప్పుకొని కూర్చున్నాడు.

మళ్ళీ ఒకసారి పంట పొలాల మీదుగా నీలపు కొండలను చూసి చూసి విసుగొ చ్చింది విద్యాసాగర్ రావుకు.

తన పక్కనే ఉన్న దేవి ఇచ్చిన నినాదం లోపల కసి రేపుతోంది. అహం దెబ్బతిని అట్లా కూచోవడం దుర్భరంగా ఉన్నది.

బుసబుస కోపం పొంగి తగ్గిపోయింది. తల తిప్పుకున్నాడు. మళ్ళీ వెనువెంటనే తల తిప్పి దేవిని దీక్షగా చూశాడు. బాప్‌రే! ఆడవారి ఒంటి మెరుపు, విరుపు - కృత్రిమత్వం లేని అలవాటైన, నటనలేని, అడవిలో పురి విప్పిన నెమలిలాంటి అపు రూప రూపం కదలిక. లోలోపల తనలో ఏదో పొగలుగా లేచి నిప్పులాగా గుప్పు మంది. అరుపులు, కేకలు, నినాదాలు, పాటలు, లయబద్ధంగా వినిపించే డప్పులు, డోళ్ళ చప్పుడు - అంత ఉద్విగ్న వాతావర ణంలో, అడవిలో క్రమంగా వేడెక్కుతున్న

మార్చినెల బంగారు రంగు ఎండపొడ రోడ్డు మీద, మనుషుల మీద - కనుచూపుమేర వ్యాపించి ఉన్న వేసంగి వరి పంట పొలాల మీద, కొండవాలు చెట్లమీద అంత కన్నా దేవి ఒంటిమీద ఎండ పొడ మెరుస్తోంది.. బహుశా మట్టి, ఎండపొడ కలిపితే వచ్చే ఒంటి రంగు దేవి ఒంటి రంగు మైకం కమ్మిస్తోంది.

ఇలాంటి పరిస్థితుల్లో మనుషుల్లో బయటి ముసుగులు తొలగిపోయి సహజ నైజాలు బయటకొస్తాయి. ముఖ్యంగా అధికార దర్పంగల పురుషులకు.

విద్యాసాగర్‌రావు ముఖంలో మారుతున్న రంగులు చూసింది దేవి. ఆడవాళ్ళు - అందులో ఆదివాసీలు శరీర భాషను త్వరగా పసికడుతారు.

"చాయ్ తాగుతావా? " అన్నది దేవి. తనెప్పుడూ వినని విచిత్రమైన అరమరికలు లేని కంఠస్వరంతో. ఆమెలోని ఆత్మ విశ్వాసం ఆ కంఠస్వరంలో మోగింది. బిడియపడకుండా పువ్వు విచ్చుకున్నంత సహజంగా నవ్వింది. పరిమళమేదో తనను కమ్ముకుంటోంది. అడవి మీదుగా, పొలాల మీదుగా వీచే గాలి మోసుకొచ్చిన గంధమా అది?

ఆ ఏకవచన సంబోధన తనలో పొగలు రేపింది. మంది నుండి దూరమై తనలో తను ముడుచుకుపోయి - ఎటూ తేల్చుకోకుండానే - తను మందిలో నుండి ఎప్పుడో తప్పిపోయి ఒంటరిగా, ముడుచుకుపోయి ఉండటం అలవాటయ్యి - ఈ కదలికకు తత్తరపడ్డాడు. 'అవసరాలకతీతమైన స్వార్థం లేని మానవ సంబంధాలు, భావావేశాలుంటాయా? ' తనకు నమ్మబుద్ధి కావడంలేదు.

అచ్చమైన మనిషిలాగా నడిచివచ్చి చాయ్ గ్లాసు, ఒక కరపత్రం అందించింది. 'తనకు కరపత్రం యివ్వడానికేనా ఇదంతా? ' అని అనుకునేసరికి తెరిపిన పడ్డాడు విద్యాసాగర్.

చేతులు వణుకుతుండగా చాయ్ అందుకున్నాడు. తనకు యిష్టంలేని కరపత్రాన్ని అందుకున్నాడు. కాలుమీద కాలు వేసుకొని కూర్చున్నవాడు, కాలుతీసి సీదాగా కూర్చున్నాడు. చాయ్ ఉన్న గాజు గ్లాసు కాలుతోంది. ఖరీదైన చాయ్ కప్పు గుర్తొచ్చింది. చాయ్ చాలా రుచిగా ఉంది. ఇంత తీరుబడిగా, అపురూపంగా ఈ మధ్యలో చాయ్ తాగినట్టు గుర్తుకు రావడంలేదు.

దేవి ఎట్లా వచ్చిందో, అట్లాగే వెళ్ళి పందిరి కింద నిలుచున్నది. కరపత్రాలు పంచాలని ఆత్రుత పడుతున్నది. ఆమె చూపు ఎక్కడో ఉన్నది.

విద్యాసాగర్‌రావు ఇంకా ట్రాన్స్‌లోనే ఉన్నాడు. ఆ నడక, ఆ మనిషి వాసన, బహుశా తనకు తెలియని అనేక అడవి పూల గాఢ గంధమేమో? చెట్లు, పక్షులు, జంతువులు, మనుషులు కలగలిస్తే వ్యాపించే వాసనేమో? తను వివశుడై - ఫాంటసీలోకి పోతున్నాడా?

చాయ్ తాగుతూ ఎడమ చేతితో కరపత్రం చూశాడు. అక్షరాలు అలుక్కుపోయాయి - ముఖ్యంగా ఆ భాష, చెప్పిన తీరు తనకు అర్థం కావడంలేదు. అందులో తనకు నాలుగు మాటలే అర్థమయ్యాయి.

- కవ్వాల్ అభయారణ్యం పేర ఆదివాసీలను అడవిలో నుండి వెళ్ళగొట్టే చర్యను ఆపాలి.

- అటవీ హక్కుల చట్టం అమలులో గ్రామసభలకే పూర్తి అధికారం కల్పించాలి.

- ఆదివాసీ ప్రాంతాలలో స్వయం నిర్ణయాధికారం ఆదివాసులకే ఉండాలి.

- ఆదివాసీ ప్రాంతాలలోకి ఆదివాసీ జీవన విధ్వంసం, పర్యావరణం కలుషితం చేసే కంపెనీలు రాకుండా నిషేధించాలి.

అదిరిపడ్డాడు. కింద సుమారు పది ప్రజా సంఘాల పేర్లున్నాయి. అంటే తమ లాంటి వారి మీద ప్రకటించిన యుద్ధ

## కొత్తగాలి...

**చీమ శిఖరం చేరింది**
**పాములా పాకి కాదు!**
**ఓపికను మోసుకుంటూ!**

– మాయకుంట్ల నారాయణ రెడ్డి,
అబిడ్స్, హైదరాబాద్

ర్యాలీలో తను సాక్షిగా, అనుకోకుండా ఇట్లా చిక్కడం చిత్రంగా ఉంది. ఇదే ఒకప్పుడైతే ఈ ప్రాంతాలు ఒకరినొకరు నరుక్కోవడం - లూటీలు - ఆఖరుకు తమకు సాంఘీక బహిష్కారం. పల్లెలన్నీ సుమారు ఇరవై సంవత్సరాలు మండిపోయాయి.. పోలీసుల అండదండలతో ఉక్కుపాదంతో అలాంటి ఉద్యమాలను తొక్కేసిన తరువాత మళ్ళీ తమలాంటి వారు భయం లేకుండా, పోలీసు ఎస్కార్టు లేకుండా ఇట్లా ప్రయాణాలు చేయగలుగుతున్నారు. ఆ ఉద్రిక్తత తగ్గిం ది. తను తమ శత్రువు గుంపువాడని వీ ళ్ళకి తెలిస్తే- ముఖ్యంగా దేవికి తెలిస్తే..?

అప్పటికే ఒక చిన్న గుంపుతో దేవి భర్త భీంరావ్ అక్కడికి వచ్చిండు. అతను ఆదివాసి నాయకునిలాగున్నడు. కళ్ళల్లో వింత తేజం! నలుపుగా ఉన్నా కూడా ఉక్కులాంటి దేహం - నాణ్యమైన ఉక్కుతో అతి నైపుణ్యంతో తయారు చేసినట్టున్న ఆదివాసి రింగుల జుట్టు.. పోత పోసిన మనిషిలాగున్నడు.

అత్యంత వేగంగా, ఆత్మీయంగా వచ్చిన వారందరికీ చాయ్ పోసి యిచ్చింది దేవి. భీంరావ్ అందరికీ మట్టి కుండలో నుంచి మంచినీళ్ళు ముంచి యిచ్చాడు.

అక్కడికి వందగజాల దూరంలో మీటింగ్ జరుగుతున్న చోట ఎవరో పాడుతున్నారు. చాలామంది కోరస్ ఇస్తున్నారు.

'పురుటినొప్పుల తల్లికన్నా అడవితల్లి
బాధ్యతల్లో తండ్రికంటే
అడవితల్లి పాత్ర పెద్దది
అర్ధ రాతిరి శత్రువు వస్తే
ఎండిన ఆకుల అలికిడి చేస్తది
పాదు శబ్దం కంట్ల పడితే
పక్షితోని కబురు పంపుతది
ఒక్కరా ఇద్దరా లెక్కకే అందరు
అమరులు ఎందరోనమ్మా..
ఒకటనా, రెండనా ఎన్నెన్ని
ఘోరాలు భరియించెనే అడివమ్మా..'

ఏం పాటలివి? వీళ్ళకి ఈ మాటలెక్కడ దొరుకుతాయి? విచిత్రంగా కింది కులాల వాళ్ళే పాటలు పాడుతూ ఎగురుతుంటారు. ఆదివాసులు ఇంత బాగా పాడగలరా? - విద్యాసాగర్‌రావుకు ఆ పాట అల్లకల్లోలంగా ఉన్నట్టనిపించింది.

వెదురుబొంగు బెంచీల మీద కొందరు కూర్చుండి టీ తాగుతున్నారు. కొందరు నిలబడి మాట్లాడుకుంటున్నారు.

"సర్కారుకు తలకాయ లేదు" అన్నాడొక చప్పిడి ముక్కతను.

వీళ్ళ యాస, మాట్లాడే పద్ధతి అదో విధంగా ఉందనుకున్నాడు విద్యాసాగర్.

"లేదంటావా! ఎందుకు లేదు చెప్పు? " అడిగాడు భీంరావ్.

"నీకు ఎరుకైతే చెప్పు" అన్నది దేవి నవ్వుతూ.

అది పరిహాసమా? మొగునితోని తను కలువడమా?

"సర్కారుకు పెద్ద తలకాయున్నది. మనకూ వున్నయి గాని గందులో గుజ్జు లేదు" అన్నాడు భీంరావ్ చేతులు వెడల్పుగా సాచి.

"నీ తీర్గనే.." దేవి పరాచికంగా అంది.

"బాతాల్ బాగ చేస్తవుగాని - ఎవలినన్న తీస్కొని అగో రోడ్డు మీద ఆగిన బస్సులు, లారీలోల్లకు కిందిదాకా పోయి కరపత్రాలు

యిచ్చిరండ్లి" భీంరావ్ అన్నాడు దేవి చేతి లోని చాయ్‌లు అందుకొని అందరికీ యిస్తూ.

"నేను చాయ్‌లు చేసి పొయ్యనేపడ్తి. మొగోళ్లు చాన మందున్నరు పోతే కాదా!"

"మాకు మీటింగ్ కాడ పనున్నది"

"ఆ పనేందో నేనే చేస్త తియ్. నాకా పని రాదా? "

"సరె మరి - ఆ పని చెయ్యి. అరె దాదలు జెట్‌న కానియ్యండ్లి - అన్మంత రావు మీరు కరపత్రాలు పంచుండ్లి" అన్నాడు భీంరావ్.

"లేపోతేంది? మనం సర్కారుకు ఏమన్న పగోల్లమా? ఎన్నడు లేంది మన మీద కోతుకం బెట్టుకొని సతాయించబట్టె - అరె సర్కారంటే తల్లిలాంటిదంటరు. పులిని పెంచుకొను గింత జంగల్ల జాగే లేదా? భూమి, అడవి పుట్టిన కాన్నుంచి పులులు మనతోటుంటలేవా? వాళ్ల జాగాలకు మనం బోతిమా? వాళ్ల జోలికి పోతిమా? తెరువుకు బోతిమా? " ఒక నడీడు ఆదివాసి చిరాకుపడుతూ.

"ఇంగో - గదంత కాదు గాని - మన కొమురంభీము చెప్పినట్టు జల్ - జంగల్ - జమీన్ మనదా? కాదా? " భీంరావ్ మధ్యలో నిలబడి అడిగాడు.

దేవి కరపత్రాల కట్ట గుడిసె లోపలి నుండి తెచ్చి యిచ్చింది. ఆ గుంపులో హన్మంతరావు, మరి కొందరు వాటిని తీసుకొని రోడ్డు మీద ఆగి వున్న బస్సుల దగ్గరికి - కయ్యర బియ్యర మాట్లాడుకుంటున్న జనం దగ్గరికి వెళ్లారు.

"మనదే - మనదే" అన్నారెవరో ఉద్వేగంగా.

"జల్ - జంగల్ - జమీన్ మనదే అయితే గిదంత బైసెందుకు? జంగల్ పుట్టినప్పటినుంచి - జంగల్ల మనమున్నం. మనతోపాటు నూర్ల తీర్ల పిట్టలు, పాములు - అడవి పందులు, జింకలు,

**కొత్తగాలి...**

**రక్తం చిందిన సీమే**
**రక్త (ఎర్ర) చందనాన్ని**
**అపురూప కాన్కగా**
**అందిస్తోంది నేడు!**

– వి.యం. కృష్ణ,
ఇ.సి.ఐ.ఎల్., హైదరాబాద్

బర్రెలు, నక్కలు, కుందేళ్లు, పులులు, జిట్టపులులు, గుడ్డేలుగులు, నీల్‌గాయిలు కొండ గొర్రెలు బతుకుతున్నయా లేదా? "

"ఔను మనతో ఎప్పటినుంచో ఉన్నయ్, ఉంటయ్"

"మరైతే మల్ల గీ టైగర్ జోనెందుకు? గదీంట్ల నుంచి మందిని, నలుభై గూడేలు తీసేసుడెందుకు? " అన్నారెవరో.

"గదే సర్కారు పెద్ద తలకాయలకు పుట్టిన దుర్బుద్ధి"

"అరె మనకు అడవంటె పెరుసపేన్కు. మనం అడవి బిడ్డలం గదా! అపకారం జేస్తమా? చేస్తే అడవి లోపలి జీవాలు బతికేటియా? " ఎవరిదో గొంతు గురగుర.

"పెద్ద తలకాయల ఉపాయం- అడివిల నుండి మనలను ఎల్లగొట్టి - ఆశగొట్టు మనిషి పులులు చేరుకుంటయి.. టేకు, పెద్దేకు సంద్ర, జిట్రేగు, మామిడి, కంక లాంటి చెట్లను నరుక్కొని అమ్ముకుంటయి. అడవి కడుపులున్న రాళ్లు, మట్టి తవ్వకపోతయి. అడివిల పులి ఆకలయినప్పుడు - తనకెంత కావాల్నో గంతే తింటది. కాని గీ మనిషి పులికి భూమండలమంతా - అడవులు, మన్ను, బండలు తిన్నా ఆకలి తీరది"

విద్యాసాగర్ రావుకు చివ్వన ముఖంలో నెత్తురు చిమ్ముకొచ్చింది. తన లోపలి

బీభత్స రూపాన్ని భీంరావు అనే ఆదివాసి గుర్తు పట్టినందుకు! అతని మీద పడి పిడి గుద్దులు గుద్దగలిగితే.. తనకు ఆ పని సాధ్యమవుతుందా?

వాతావరణం మారిపోయింది. భీంరావు ముఖం మాడిపోయింది. బహుశా జరగ బోయే బీభత్సం తాలూకు నీడలేమో?

"ఎహె తియ్! అడవి నెవలెత్తుకపో తరు? ఎత్తుకపోయి ఎం జేత్తరు? " వాతా వరణం తేలిక చేస్తూ అంతా ఉత్తదే అన్నట్టు దేవి అని, అందరి ముఖాలు చూసి మళ్లీ తనే "గుట్టలెత్తుకపోవుడు నర మానవులతోనైతదా? " అన్నది. అది మానవమాత్రులకు సాధ్యం కాదు అన్న స్థిరమైన గొంతుతో.

మీటింగు దగ్గర సప్పుడు - దేవి తిప్పు తున్న బ్లోయర్ చప్పుడు.

"ఔ మల్ల!" అన్నడు ఒక నడీడు గోండా యన మీటింగు దగ్గరికి పోతూ అంత కంటే విశ్వాసంగా.

"గీ అడవి మీదిగాదు. గందులో పంటలు దీయద్దు అని నైజాం సర్కారు అంటెనేగదా! కొమురంభీము అన్ని జాగల్ల అందరినీ అడిగి మొరబెట్టుకొని కచ్చీర్ల ఫిరాదు జేసుకొని వినకపోతే గదా! జోడెన్ గాట్ ల తుడుం గొట్టి, బాండేలు బట్టి ఎను కట లడాయి జేసిండు"

"ఔ మల్ల! కొట్లాడిండు గాని, ఏం ఫాయిదా? గూడేలని పొరుకపోడు జేసింది గదా నిజాం కల్లే సర్కార్" అన్నారెవరో..

"అయినా ఊకున్నర? ఎహె తియ్యి. అడవిల పుట్టినోల్లను అడవిని ముట్టకంటే ఊకుంటరా? మల్ల గదే లొల్లి.. కొమురం భీము జాగల పొరకల సార్లొచ్చిరి-"

"వత్తేంభాగ్గెం? ఇందర్‌వెల్లిన నూరు మందిని సంపలేదా? "

"అరె సస్తరు. అయినా ఊకోరు. గిది లఢాయి. ఊకుంటె బతుకరు. మన బొందిల జీవునం ఉన్నంతకాలం - మనం మనం పుట్టిన కాన్నే - మన జాగల్నే బతు కాలంటే లఢాయి తప్పదు. ఒకడు సత్తె నూరు మంది పుట్టుకత్తరు. గోండోల్లు మునుపటి తీర్గ లేరు. ఎన్నో కేసుల సుట్టు ఇదివరకె తిరిగి తిరిగి సత్తన్నం. మల్ల ఇగో టైగర్ జోనంట. గిదోటి తెచ్చింది సర్కార్" దేవి మాట్లాడుతూ పందిరి కిందికి నడిచింది.

వీళ్ళ మీద కేసులున్నాయా? తనలాగే వీళ్లు కూడా అనేక కోర్టు కేసులంటూ తిరు గుతున్నారా?

"ఎహె గిట్ల రోడ్డు బందు జేత్తె ఏమ త్తది? " అన్నాడొకడు.

"ఏమత్తది సర్కారుకు తెలుత్తది. మనం కూడా కొట్లాడ్తమని పట్టెదార్లకు, షావుకా ర్లకు తెలుత్తది. కొట్లాట మనకోసం మనం ఎట్లు చేసుకునుడో తెలుత్తది" భీంరావ్.

ఇంత గొడవ, ఇన్ని విషయాలు, చరిత్ర అడవిలోని గోండోల్లకు తెలుసని విద్యాసా గర్ రావుకు తెలియదు.. 'శివ శంకర్ ఏడ సచ్చిండో? శీనుగాడు ఏడ సచ్చిండో? తను ఇక్కడ ఇరుక్కపోయాడు' మనసు మరోసారి మూల్గింది.

వాళ్ళ మాటలు వింటుంటే కంపరమెత్తు తోంది. వినకూడదనుకుంటూనే వినాల్సివ స్తోంది. అడవులు ఆదివాసులవి. పల్లెలు రైతులు, రైతు కూలీలవి. ఫ్యాక్టరీలు కార్మి కులవి. భూములు, జాగాలు, పెట్టుబడి మాటేమిటి? తనకేమో అవుతోంది. దేశా నికి స్వాతంత్ర్యం తెచ్చి ప్రణాళికలు పెట్టి, ప్రాజెక్టులు కట్టి ఇన్ని రంగాల్లో దేశాన్ని ముందుకు తీసుకుపోతే, అభివృద్ధి చేస్తే ఈ అడవిలో మనుషులు ఇదంతా మాక క్కరలేదంటారా? తను వారికి జవాబు చెప్పగలడా? కొమురంభీము ఒక మూర్ఖుడు. అంత పెద్ద నైజాంతో వెనుకా ముందు ఆలోచన లేకుండా కొట్లాటకి దిగి చచ్చిండు. వాడు చావడమే కాదు, వాడితో పాటు మరికొంత మంది చావుకు కారకుడ




# పెద్ద అవయవం.. చర్మం!

మనిషి అవయవాల్లో అతి పెద్దది చర్మం! మనల్ని రక్షించే చర్మం గురించిన విశేషాలు..

★ ప్రతి మనిషి చర్మం మీద లక్షల కొద్దీ బాక్టీరియా క్రిములు ఉంటాయి. మైక్రోస్కోప్ లోనే కనబడతాయవి. అయితే అవి కొన్ని మేలు చేసేవే.



★ చర్మ ఆరోగ్యానికి సూర్యరశ్మి అవసరం. కానీ అది ఎక్కువ అయితే సూర్యరశ్మిలోని అల్ట్రావైలెట్ కిరణాలు చర్మానికి శాశ్వత నష్టాన్ని కలిగిస్తాయి.

★ మొటిమ అంటే చర్మ రంధ్రంలోంచి బయటికి రాకుండా పేరుకుపోయిన పదార్థమే.

★ ముక్కు మీద వచ్చే బ్లాక్ హెడ్స్ సెబమ్ అనే నూనె, మృతకణాలు పేరుకోవడం వల్ల వస్తాయి.

★ వయసు పెరిగే కొద్దీ చర్మంలోని సాగే గుణం తగ్గిపోవడమే ముడతలకి కారణం.

★ చర్మ ఆరోగ్యానికి తరచూ మాయిశ్చరైజర్లు రాయడం, జిడ్డుని తొలగించే మాస్క్‌లను వేసుకోవడం వంటివి చేయాలి.

★ చర్మం మీది తెలుపు, నలుపు మచ్చలు సాధారణంగా టీనేజర్స్‌లో కనిపిస్తాయి. పెద్ద వాళ్లకు కూడా అరుదుగా వస్తుంటాయి.

★ చర్మం మీద కనబడే ఎర్రటి మచ్చలకి లివర్ స్పాట్స్ అని పేరు. మెలటోనిన్ ఉత్పత్తి తగ్గడం వల్ల వస్తుంటాయవి. వీటిలో కొన్ని క్యాన్సర్‌కు దారి తీసే ప్రమాదం ఉంది.

★ చర్మం రంగు శరీరం ఉత్పత్తి చేసే పిగ్మెంట్ మెలనిన్ మీద ఆధారపడి ఉంటుంది. దాని ఉత్పత్తి ఎక్కువైతే నలుపు రంగులో, తక్కువైతే తెలుపు రంగులో ఉంటారు.

★ మనిషి శరీరంపై అత్యంత దళసరి చర్మం అరచేతులు, అరిపాదాలపై ఉంటుంది. అక్కడ ఒకటిన్నర మిల్లీమీటర్లు మందం ఉంటుంది.

య్యిండు.

అనాగరికులైన మీ ప్రాంతాల్లో పరిశ్రమలు పెట్టి - పనులు కల్పించి రోడ్లు వేసి, పాఠశాలలు కట్టి - ఉద్యోగాలు కల్పిస్తోంది ప్రభుత్వమని తను చెప్పగలడా? అభివృద్ధి చేస్తున్నది మేమేనని చెప్పగలడా?

ఇంతకూ తమ ఫ్యాక్టరీలో - గనులల్లో ఆదివాసీలెవరైనా ఉద్యోగం చేస్తున్నారా? శివశంకర్‌ను అడగాలి. వీళ్ళు ఉద్యోగాలు చేయగలరా? ఒకవేళ ఉద్యోగాల్లో ఉన్నా అక్కడ చిచ్చు పుట్టియ్యగలరు.

"అదే - అప్పటి నుండి ఇప్పటి దాకా ఇగో గీ బాటలు అడవిల నుంచి పడ్డాంక ఎక్కడి నుండో దొంగల గుంపొచ్చి - మనలను, అడవిని దోస్క పోతండ్లు - దీన్నా పకుంటె - మనకు చిప్పే గతి' భీంరావు నల్లటి పాములా ఉన్న రోడ్డుకేసి కోపంగా చూశాడు. అందరికీ చూయించాడు.

కొంపదీసి వీళ్ళంతా కలిసి ఈ రోడ్లన్నీ తవ్వేస్తారేమో? కల్వర్టులు, బ్రిడ్జీలు కూల్చేస్తారేమో? అనిపించింది విద్యాసాగర్‌కు.

"కొట్లాట మన నుంచి ఏడయితది? " ఇందాకటి గోండు రైతు విరక్తిగా అన్నాడు. అతను అడవిలోపలి నుండి పది కిలో

మీటర్లు నడిచి ఈ ధర్నాకు వచ్చిండు. టైగర్ జోన్ మాట వినంగానే నలభై గూడేలల్లో కల్లోలం వ్యాపించింది.

"దీన్ని ఆపుండ్లి అని" ఎవరికి చెప్పాలో తెలియదు. సర్కారు! తమ బాగోగులు పట్టించుకోని సర్కారు. తమ మానాన తాము అడవిలో ఆకులో, అలములో తిని బతుకుతుంటే తాపకోసారి కెలుకుతోంది. నిద్రలు లేకుంట చేస్తంది. అగులు బుగులు చేస్తంది. సర్పంచ్‌లు, రాజకీయ నాయకులు పెద్ద పెద్దోల్లతోని గూడి వాళ్ళ సోపతి బట్టి- చెడిపోయి తాక్కుంట పట్నాలల్ల తిరుగుతండ్లు" ఎవడో గొణిగాడు.

"అన్నలేడబోయిండ్లో, ఇటు తొంగన్న సూత్తలేరు" అన్నారెవరో!

'అదన్నమాట వీళ్ళ పొగరు. వీళ్ళందర్ని జైల్లో వేస్తే తప్ప తీవ్రవాదం తగ్గదు. నక్సలైట్లు రకరకాల పేర్లతోటి - అడవిలో అమాయకులైన ఆదివాసుల మెదళ్లు ఖరాబు చేసి, వాళ్ళను కష్టాలపాలు చేసి - ఇంద్రవెల్లి లాంటి ఘటనలకు పాల్పడి ఇల్లీగల్ వెపన్సుతో బెదిరించి..' ఇలాంటి ఆలోచనలతో విద్యాసాగర్ రావుకు కొంత రిలీఫ్‌గా అన్పించింది. కరపత్రంలో ప్రచురించిన ప్రజా సంఘాలన్నీ నక్సలైట్ల కవరు సంఘాలేమోనని అనుమానం కల్గింది.

"నా ఎరుకల ఇగో అటు ఉత్తరాన, ఇటు తూర్పున భూములన్నీ మాయే.. ఎక్కడనుంచొచ్చిండ్లో - గుర్రాల మీదొచ్చి డబ్బున్న అన్ని కులాలోళ్లు మీతోటట్టు బతుకతమని వచ్చి - నూర్ల ఎకరాలు గుంజుకున్నరు. మాకు సదువు సాత్రం రాదు" అన్నాడు ఒక ముసలి రైతు.

"ఆడేం పొరపుచ్చిండు. వాడున్నడా తియ్, మనల్ని వాడు అదిరిచ్చి, బెదిరిచ్చి దోసుకుంటే - ఆళ్ళను అడ్డంగా నరక లేదా? " అన్నాడు మరొకడు.

"మన భూములు మనకైతే రాలే గద. ఇగోమల్ల మిగిలిన భూములు అడువులు గుంజుకునే ఉపాయం చెయ్యవట్టిరి.." ఒక ఆదివాసి రైతు కోపంగా అక్కడి నుండి లేచిపోయాడు.

విద్యాసాగర్ రావు ఉలిక్కిపడి అడవి అంచునే గల పచ్చటి పంట పొలాలకేసి చూశాడు. ఈ భూములకు ఇంత రక్త చరిత్ర ఉన్నదా? ఇక్కడికి మూడు కిలోమీటర్ల దూరంలో తమ బంధువులపై నక్సలైట్లు దాడి చేసి మగవాళ్ళందరినీ నరికిన విషాద ఘటన గుర్తొచ్చి ఒళ్ళు గగుర్పొడిచింది.




**చు**ట్టు పక్కల అడవి అంచు మైదాన ప్రాంతంలోని ఊళ్ళన్ని ఒకప్పుడు దొరలవే. వందల ఎకరాల విలువైన ఆదివాసుల భూములు దొరలు ఆక్రమించి ఏలారు. ఆదివాసులు లోతట్టు అడవుల్లోకి వెళ్ళిపోయారు. రైతు కూలి సంఘాలు వచ్చి, సాంఘిక బహిష్కారం తరువాత ఇప్పుడు వాళ్ళంతా పట్నాలు చేరి, రాజకీయాలు, వ్యాపారాలు చేసుకుంటున్నారు. నిజానికి అలాంటి గొడవలు జరగకపోతే ఈ చీకటి పల్లెల్లోనే దొరలు మిగిలిపోయే వాళ్ళు. ఉద్యమాల వలన జనాలకు కొంత ఊపిరి సలిపింది గాని - ఆర్థికంగా, అన్ని రకాల ముందుకుపోయింది దొరలే.

భీంరావు బ్యాచ్ హోటల్ పందిరి కింది నుండి హడావిడిగా వెళ్ళిపోయింది.

విద్యాసాగర్‌రావు రిలీఫ్ ఫీలయ్యాడు. అక్కడ అనివార్యంగా, ఆ ధర్నా

మూలంగా ఆగిపోయిన వాహనాల్లో నుండి దిగిన జనం, చుట్టుపక్కల ఊళ్ళ నుండి ధర్నా కోసం వచ్చిన జనం.. వాళ్ళకు మద్దతుగా వచ్చిన ప్రజా సంఘాల కార్యకర్తలు, నాయకులు - టైగర్ జోన్ ప్రకటించిన నలభై గూడేల ఆదివాసులు గుంపులు గుంపులుగా చేరి గత, వర్తమానాల అడవి చరిత్ర గురించి - అందులో జరిగిన రక్త సిక్త ఘట్టాల గురించి మాట్లాడుకుంటున్నారు.

బహుశా అక్కడి రోడ్డు వాళ్ళకు ఒక విద్యాలయమైంది. తర్ఫీదునిచ్చే శిక్షణాలయమైంది.

ఇంతలోనే సిగల్లో అడవిపూలు తురుముకొని యువతుల గుంపు వచ్చింది. ఒకరు గోండీలో ఏదో పాడితే అందరూ కోరస్ యిస్తున్నారు. ఒకరి చేతులు ఒకరు పట్టుకొని నాలుగురోడ్ల కూడలిలో కాసేపు ఆడారు. దేవి కూడా వెళ్ళి వాళ్ళతో కలిసి ఆడి పాడింది.

ఆ తరువాత హోటల్ దగ్గర నీళ్ళు తాగి అందరూ మీటింగు దగ్గరికి వెళ్ళిపోయారు. దేవి మళ్ళీ తన హోటల్ దగ్గర చేరిపోయింది.

ధర్నా దగ్గర మీటింగులో పాటలు ఆగిపోయాయి. పౌర హక్కుల నాయకుడు మాట్లాడుతున్నాడు.

అతను ఏ ఉద్వేగమూ లేకుండా ఉపన్యాసం మొదలుపెట్టాడు. "మీ అందరికీ తప్పనిసరైన ఎన్నో పనులున్నా కూడా ఇక్కడ ఇట్లా ఆపి అడవిలోని ఆదివాసుల గోడు విన్పిస్తున్నందుకు మొదట మన్నించాలె. ఎవరికి అపకారం చెయ్యని - అడవుల్లో లోలోపల తమ బతుకేదో తాము బతుకుతున్న ఆదివాసీల కోసం ప్రభుత్వం ఎన్నో చట్టాలు చేసింది. ఈ చట్టాలన్నీ ఆదివాసులు గతంలో చేసిన ఎన్నో పోరాటాల ఫలితమే. కాని విచిత్రంగా ఆ చట్టాల అమలు గురించి ప్రభుత్వం, దాని అధికారులు ఏనాడూ పట్టించుకోలేదు. ఆదివాసి ప్రాంతాలలో స్వయంపాలనా వ్యవస్థను అమలు పరచడం కోసం పంచాయితీరాజ్ సవరణ పెసా చట్టం తెచ్చింది. ఆ యాక్ట్ ప్రకారం ఆదివాసి ప్రాంతాలలోని భూములకు సంబంధించి ఆదివాసీయేతరులకు ఎలాంటి హక్కూ లేదు. అటవీ హక్కుల చట్టం అమలులో గ్రామ సభలకే పూర్తి అధికారాలు కల్పించాలి. ఆదివాసుల ప్రమేయం లేకుండా వారి ప్రాంతాలలోకి కంపెనీలు రాకుండా నిషేధించాలి.

ఈ నిబంధనలన్నీ చట్టాలలో ఉన్నాయి. ఇవేవీ అమలు జరుగలేదు. అడ్డు అదుపు లేకుండా ఆదివాసి ప్రాంతాల్లోని సకల సంపదలు అగ్గువకు ఒక్కొక్కసారి దొంగతనంగా తరలిపోతున్నాయి. దోపిడీకి గురౌతున్నాయి. అనాది నుండి భూముల ఆక్రమణ కొనసాగుతూనే ఉన్నది. విషజ్వరాలతో ఏటా వందల సంఖ్యలో చనిపోతున్నా, కనీసం వైద్యం, మంచినీటి సౌకర్యం కల్పించని ప్రభుత్వాలు - ప్రతిసారీ ఆదివాసుల మీదికి దాడికి దిగుతున్నాయి.

ఆదివాసులు విధిలేక ఇగో ఈ రోడ్డు మీదికొచ్చి మీకందరికీ చెప్పుకుంటున్నారు.

ఇవన్నీ కాకుండా - ఇదిగో మనం మీటింగు పెట్టిన ఈ ప్రాంతం నుండి కన్పించే సహ్యాద్రి పర్వతాల అడవిని - గ్రామసభల అంగీకారం లేకుండా - ప్రజలకు తెలియజేయకుండా కవ్వాల్ టైగర్ జోన్‌గా ప్రకటించారు. ఈ జోన్‌లో కవ్వాల్, అలీనగర్, దొంగపల్లి, గోండుగూడ లాంటి నలభై రెండు గూడేలు, సుమారు వెయ్యి కుటుంబాలు - ఈ అడవిలో లేని పులుల కోసం బలైపోతాయి. అసలే భూములకు పట్టాల్లేని- లెక్కకు తేలని కుటుంబాలకు, నిర్వాసితులకు కుటుంబానికి పది లక్షలు డబ్బు ఇస్తా

రట. ఆ డబ్బు ఆ కుటుంబాలకు చేరక ముందే రాజకీయ నాయకులు, అధికారులు పంచుకుంటారు. డబ్బుకన్న ముఖ్యమైంది - అడవితో ముడిపడి ఉన్న ఆదివాసీల జీవితం. వాళ్ళకు అలివి అయిన ప్రాంతం వొదిలి - మోసకారి బయటి ప్రపంచంలో ఎట్లా బతుకుతరు? ఈ విషయం ప్రభుత్వం ఎందుకు పట్టించుకోదు? ఈ గ్రామాలల్లో అతి పురాతనమైన ఆదివాసీ తెగలు రాజ్ గోండ్స్, నాయకపోడ్సు, కొలామ్, పర్ధాన్లు, తోటీలు, లంబాడాలు బతుకుతున్నారు. వీళ్ళంతా ఎక్కువగా కూలీలు. కండగల భూములన్నీ ఏలిన వారి సహకారంతో ఇదివరకే దొరలు, భూస్వాములు కబ్జా చేశారు. వాళ్ళ పశువులు, ఆవులు, ఎడ్లు, పందులు, మేకలు, కోళ్ళు ఎత్తుకు పోయారు. అడవి నుండి విలు వైన టేకు కర్ర అమ్ముకొని కోట్లు సంపాదించి దొరల య్యిండ్లు.



వైద్యం, మంచినీరు, చదువు లేక - దరిద్రం, ఆకలి, పోషకాహార లోపంతో అడవిలో ఆదివాసీలు బతుకుతున్నారు. రెండు కాళ్ళ పులులైన షావుకార్లు, భూస్వాములు, దొరలు, అటవీ అధికారులు, రెవెన్యూ సిబ్బంది - ముఖ్యంగా పోలీసులు - రకరకాల దోపిడీ దొంగ పులుల నుండి ఆదివాసులకు రక్షణ లేదు. అడవిలోని పులుల కోసం ఆదివాసులను క్రూరమైన మైదాన ప్రాంతపు మానవ పులుల మధ్య వేస్తారట - నిజానికి ఆదివాసులు వ్యక్తులుగా, సమూహాలుగా ప్రకృతి ఆరాధకులు.. వాళ్ళు చెట్లను, జంతువులను పూజిస్తారు. పులులు అన్ని జంతువులతో పాటు మునుపూ ఉన్నాయి. ఇప్పుడూ ఉంటాయి. వాళ్ళతో పులులకే ముప్పు లేదు. వాళ్ళ ఆదివాసీ జీవితంలో పులులు ఒక భాగం. అయితే సర్కారు ఎవరి కోసం ఈ టైగర్ జోన్ తెచ్చింది?

అటవీ భూములను.. వన్యప్రాణుల సంరక్షణ, పులుల సంరక్షణ, జాతీయ పార్కులు లాంటి ముద్దు పేర్లతో సేకరించి, తర్వాత వాటిని అటవీ భూముల రిజర్వేషన్ చట్టాల నుంచి తప్పించి - గనులు, సిమెంట్, బాక్సైట్ లాంటి పరిశ్రమలకు కట్టబెడుతోంది సర్కారు. ప్రపంచీకరణ తరువాత ముడి ఖనిజాన్ని తవ్వి - ఆదివాసి ప్రాంతాలను బొందల గడ్డలుగా మార్చి ప్రభుత్వాలు దళారులుగా మారి విదేశాలకు ఎగుమతి చేస్తున్నారు. ప్రభుత్వాలది మనుషులను నాశనంచేసి పులులను రక్షించే మనస్తత్వం. విచిత్రంగా ఈ పర్యావరణ, మానవ విధ్వంసానికి అభివృద్ధి పేరు పెడుతున్నారు. తోటి



మానవులైన ఆదివాసుల్ని భయభ్రాంతులను చెయ్యడానికి, అడవిలో నుండి పారిపోవడానికి క్రూర జంతువులను, విషపు పాములను అధికారులు అడవిలో తెచ్చి వొదులుతున్నారు.

ఇది ఆదివాసులతో మాత్రమే ఆగదు. ఎన్ని చెడ్డ పనులైనా చేసి స్వంత ఆస్తి సంపాదించాలనే సమాజాలల్లో మానవులు క్రూర జంతువులుగా మారి బలహీనులను పీక్కు తింటారు. మనిషి శ్రమ రుచి మరిగిన మానవ పులి మనందరి మీదా దాడి చేస్తుంది.

తోటి మానవులుగా ఈ అన్యాయాన్ని ఎదిరించాలని ఇక్కడ కూడిన ప్రజలందరికీ విజ్ఞప్తి చేస్తున్నాం. ఇలాంటి దగాకోరు పద్ధతులకు వ్యతిరేకంగా ప్రజలు అనివార్యంగా పోరాడగలరని తెలియజేస్తున్నాను. అధికారులు, పత్రికా విలేఖర్లు, మేధావులు, ప్రజాస్వామిక వాదులు ఈ న్యాయమైన పోరాటానికి మద్దతు తెలుపాలని కోరుతున్నాం. టైగర్ జోన్ ఎత్తివేయాలని డిమాండ్ చేస్తున్నాను.."

పెద్ద పెట్టున చప్పట్లు మోగాయి.

విద్యాసాగర్‌రావుకు తను నగ్నంగా అంతమంది ముందు నిలుచున్నట్లుగా ఉన్నది. ముఖానికి చెమట పట్టింది. 'ఇక్కడ జమగూడిన వాళ్ళందరు దొంగలు, వారివన్నీ మాయమాటలు' అని పెద్దగా అరవాలనిపిచ్చింది. అన్ని తీవ్రవాద ప్రజా సంఘాలతో పాటు పౌరహక్కుల సంఘాన్ని ప్రభుత్వం ఎందుకు నిషేధించలేదో అతనికి అర్థం కాలేదు. ఇలాంటి కకావికలైన మానసిక స్థితిని తప్పించుకోవడానికి- ఆ ధర్నా మాటల ఒరవడి నుండి విడివడి దేవికేసి చూశాడు. అంతకన్నా చేయగలిగిందేమీ లే దు. అందరిలాగా నడిచి మీటింగులో నిలబడజాలడు. రోడ్డు మీద నడువజాలడు.

దేవి ముఖంలో తనకు తెలియని, అర్థం కాని తేజస్సు. తనలో ఉక్రోషాన్ని, కోపాన్ని నింపిన మాటలు ఆమెలో విశ్వాసాన్ని, ధైర్యాన్ని నింపాయా? ఆమె ముఖంపై తేజస్సును చూడలేక అడవి లాంటి మార్మికమైన, అందమైన శరీరాన్ని ముఖ్యంగా కటి భాగాన్ని చూశాడు. వింత కలవరం ఒళ్ళంతా పాకింది. అక్కడి నుండి ఆమె తలకేసి చూశాడు. ఆమె తలలో తనకు పేరు తెలియని ఎర్రని పూలు.. చూపు మరల్చుకొని పచ్చని పొలాలను - పొలాల మీదుగా ఎగురుతున్న కొంగలను చూశాడు. తనెందుకు విచలితుడౌతున్నాడో అర్థం కావడంలేదు. తనే ఇట్లా అవుతున్నాడా? ఎవర్ికైనా ఇట్లాగే ఉంటుందా? లోపలొక మనిషి. బయటకు కన్పించే మరో మనిషి వేర్వేరు. ప్రతి మనిషిలో ఈ ఈడిపస్ కాంప్లెక్స్ ఉంటుంది. పురుషుడు స్త్రీ లోని ఏ భాగాన్ని చూసినా రెచ్చిపోతాడు.

సౌందర్య పిపాస, సున్నితమైన స్పందనలు కోల్పోయి చాలా కాలమయినట్టనిపించింది. లోలోపల మానవ సహజమైన నిప్పు చల్లారినోడు తను. నలుభై నాలుగేండ్లకే చుట్టుముట్టిన సమస్యల్లో- ముఖ్యంగా డబ్బు కట్టల్లో ఇరుక్కుపోయినవాడు తను. కోపం స్థానే తనలో ఏదో కలుగుతోంది.

విద్యాసాగర్‌రావుకు కొద్ది దూరంలో కంకబొంగుల బెంచీ మీద కూర్చున్న శివశంకర్ తన లోలోపలి భావ ప్రకంపనలను గమనిస్తున్నాడని తెలియదు. శివశంకర్ కాసేపు మందిలో తిరిగాడు. యజమాని ఒంటరిగా ఉన్నాడని హోటల్ గుడిసె దగ్గరికి వచ్చి చేసేదిలేక కూర్చున్నాడు.

గజ్జి కుక్కలాగా లోలోపలికి ముడుచుకుపోయి, మనుషుల నుండి వారి సహజ, అద్భుత వ్యక్తీకరణల నుండి తనకు తెలియకుండానే కూరుకపోయినవాడి అపసవ్య వ్యక్తీకరణ తన యజమాని ముఖంలో! అదీ ఇలాంటి సందర్భంలో.. తనకు దిక్కు

మాలిన దేహ భాష తెలియకపోతే బాగుండేది. ట్రాన్సులో ఉన్న విద్యాసాగర్‌రావును తదేకంగా చూసిండు శివశంకర్. కాంతి హీనమైన కళ్ళు - అడ్డదిడ్డపు ఒడ్డూ, పొడుగు ఒళ్ళు - మనిషి ఆలోచనలు, ఆచరణకు, బతికే బతుక్కు నిలువుటద్దం కదా శరీరం!

అనుకోకుండా రోడ్డు మీద ఫ్రీజ్ అయిపోయిన అంతమంది - ఆ అడవిలో - ఎండలో - వృక్షాల నీడల కింద ఏకమై - మమేకమై మెరిసిపోతూ లోపట బయట కదలబారుతూ వుంటే - ఎటూ కదలలేని వాడు తన యజమాని. ప్రతిస్పందనలు ఫ్రీజ్ అయినవాడు. మాటలు - పాటల ప్రవాహాలలో కలువలేని వాడు. సత్యాశోధన, జిజ్ఞాస చచ్చినవాడు. ఈ చావు మనుషులకు ఎక్కడ, ఎప్పుడు ఆరంభమౌతుంది? 'అయితే ఇలాంటి మృత కళేబరాలతోనా నా ఉద్యోగం?' మానవ వనరుల అభివృద్ధి, నిర్వహణ మేనేజర్ శివశంకర్ ఆలోచిస్తున్నాడు. అదివరకే కొంతకొంత అర్థమైనా విద్యాసాగర్ రావు గురించి, అతని లోపలి ఆలోచనల గురించి ఇప్పుడే తెలుస్తోంది.

డ్రైవర్ శ్రీను మందిలో కలిసిపోయాడు. ఆ పాటలు, మాటలు అతన్ని ఉత్తేజపరుస్తున్నాయి. 'శ్రీను ఈ లాజిక్కు, తర్కం నేర్చుకుంటే - అది ఫ్యాక్టరీలోకి ప్రవహిస్తే.. ఏమో అంతటా వ్యాపించేది. ఇప్పటికే తెలిసి ఉంటుంది. గత ముప్పయి అయిదేండ్లుగా ఈ గడ్డమీద పోటెత్తిన ఉద్యమాలు మనుషులకు అనేక విషయాలు నేర్పాయి' శివశంకర్ శ్రీను గురించి అనుకున్నాడు.

విద్యాసాగర్‌రావుకు తన భార్య గుర్తొచ్చింది. ఆమె రూపం, ఒళ్ళు గుర్తొచ్చింది. 'అది ఆమె ఎంచుకున్నది కాదు. తాము ఎంచుకున్న జీవన సరళి ఫలితం అది' అని ఆయనకు తెలియదు. తెలిసే అవకాశం కూడా లేదు.

## కొత్తగాలి...

**చివరి ఊపిరి పోయేది**
**ఉచ్ఛ్వాసతోనా? నిశ్వాసతోనా?**
**కార్పొరేట్ ఆసుపత్రుల్లోని**
**ఆక్సిజన్ మాస్కులకే తెలియాలి!**

– కె.వి. సుబ్రహ్మణ్యం,
సింహాచలం

మనుషుల ఇష్టాయిష్టాల స్థాయి దాటిన జీవితం. ఇందులో ముందుకు పోవడమే ఉంటుంది. పడిపోవడం ఉంటుంది. కానీ తమంత తాము వెనక్కి తిరిగే అవకాశం లేదు. తన ఒంటికేసి చూసుకున్నాడు. అక్కడ తిరుగుతున్న ఆదివాసులను పరీక్షగా చూశాడు. వికారమైన ఆలోచనలతో కడుపులో లోపినట్టుగా అయ్యింది. భార్య గుర్తుకు రావడంతో ముఖం వికారంగా మారిపోయింది.

తనకేసి చూసుకున్నాడు. తన శరీరం వజవజలాడుతున్నట్టనిపించింది. టక్ చేసిన ఫుల్ షర్ట్ లేత నీలం రంగు, కొంచెం ముదురు నీలం ప్యాంటు - తళతళలాడే బూట్లు.. పైకి డాంబికంగానే ఉన్నట్టనిపించింది.

ఇట్లాంటి విచిత్రమైన వాతావరణంలో - డబ్బు సంపాదనలో, యాజమాన్య పద్ధతులల్లో ఎంతో నైపుణ్యం, పట్టుదల - తెలంగాణలోని యువ పారిశ్రామికవేత్తలకు ఆదర్శవంతమైన అగ్రకుల పారిశ్రామికవేత్త - అడవిలోని ఒక స్వచ్ఛమైన గోండు యువతి ముందు ఎంత బికారో? లోలోపల ఎంత బలహీనుడో?' శివశంకర్‌కు అర్థమౌతోంది.

తన యజమాని చూపులు అతి నిక్కష్టంగా ఉన్నాయి. విచిత్రంగా ఆకలితో

ఉన్న పులి చూపుల్లా ఉన్నాయి. అది భరించలేక శివశంకర్ దూరంగా స్కార్పియో దగ్గరికి నడిచి నిలుచున్నాడు.

ఆడ మగకు సంబంధించిన అతి పురాతన, అంతులేని ఆటనో - యుద్ధమో మొదలయ్యింది. బహుశ విద్యాసాగర్ రావు ఇక్కడి వాతావరణం, మాటల వలన గాయపడిన ఫలితమేమో?

దేవికి తన సహజ ఆదివాసి మహిళ ఇంగితజ్ఞానం పనిచేస్తోంది. అది ప్రకృతిలో - ఏ రక్షణా లేని అడవిలో - మృగాల్లాంటి పురుషులతో తలపడి, నిలబడి చేసిన సమాన స్థాయి యుద్ధాల జ్ఞానమది. పూల పరిమళంతో - చెట్ల గాలితో - పక్షులతో జంతువులతో నేర్చుకున్న తెలివి ఆమెది.

దేహం తప్ప - ఆడ, ఆ మాటకొస్తే మనుషుల అంతరంగం తెలియని మొరటు మృగం చూపులు.. తనకు అర్థమౌతున్నాయి. కళ్ళలోకి చూస్తే - పిరికి, దైన్యం చూపులు. ఆదివాసులు కళ్ళు చూసి మనుషుల అంతరంగం పసికడతారు. దేవి విద్యాసాగర్‌రావును, లోలోపలి మృగాన్ని పసిగట్టింది.

టైగర్ జోన్‌కు వ్యతిరేకంగా తమ జాతి వాళ్ళందరూ చేస్తున్న ధర్నాలో - యుద్ధం లాంటిదేదో ఈ నీచ నికృష్ట మనిషితో చేయాలనే తలంపుతో తనకు తెలియకుండానే నెమలిలాగా వయ్యారంగా నడిచి వచ్చి విద్యాసాగర్‌రావు కుర్చీ పక్క వంగి ఖాళీ టీ గ్లాసు తీసుకెళ్ళింది దేవి.

విద్యాసాగర్‌లో మంట గుప్పుమంది. పెదిమలు వణుకుతున్నాయి. తను వివశుడౌతున్నాడు. గోండు స్త్రీ ముందు ఓడిపోతున్నాడు. తను దేవికన్నా హుందాగా - పొగరుగా - లెక్కలేనట్టుగా నడిచి తను తాగిన టీకి డబ్బులివ్వాలని అనుకున్నాడు. తన జేబులో నుండి పర్సు తీసి వంద రూపాయల నోటు బయటకు తీశాడు.

శివశంకర్‌కు ఆసక్తి పెరిగింది. స్కార్పియో దగ్గరి నుండి తిరిగి వచ్చి ఇందాకటి కంక బొంగుల బెంచీమీద కూర్చుండి 'గురుడికి ఒక్క చొంగ కారడమే తరువాయి' అనుకున్నాడు మనసులో.

విద్యాసాగర్ రావు అసహజంగా కుర్చీలో నుండి లేచి దేవి దగ్గరికి నడిచాడు. దేవి సూటిగా కళ్ళలోకి చూసింది. విద్యాసాగర్ రావు ఆ చూపు తట్టుకోలేక అటెటో చూస్తున్నట్టు నటించాడు. నోరెండిపోయింది. పెగలలేదు. దేవి విద్యాసాగర్ రావు పట్టుకున్న వంద రూపాయల నోటునన్నా చూడలేదు. అద్భుతమైన సంయమనంతో, కళ్ళు దించుకొని చాయ్ కోసం బ్లోయర్ తిప్పుతోంది. దాని చప్పుడు తన గొంతులో గురగుర లాడినట్లుగానే ఉన్నది. అక్కడ తడబడకుండా నిలబడడం తన చేత కాలేదు. ఆమె ముఖం మీద కుడివేపు వెంట్రుకల పాయ కత్తిలా వేలాడుతోంది. కళ్ళు బైర్లు కమ్ముతుండగా నటించడం చేతకాక నోటు పర్సులో పెట్టుకొని మళ్ళీ వెనక్కి వెళ్ళి కుర్చీలో కూర్చున్నాడు. అతని ముఖం పాలిపోయింది.

ఆ అడవిలో - డబ్బు నికృష్టమైన, పేలవమైన మాధ్యమమని అతనికి అర్థమయ్యింది. తన లోపల అన్ని రకాల సృజనాత్మక శక్తులూ చచ్చుబడి పోయాయని అర్థమయ్యింది. జ్ఞానేంద్రియాలు సహజ లక్షణం కోల్పోయినట్టనిపించింది.

ఆడ - మగకు సంబంధించిన అతి పురాతన, అంతుచిక్కని ఈ యుద్ధం.. బహుశా మాతృస్వామిక వ్యవస్థ - పితృస్వామిక వ్యవస్థగా, క్రూరమైన రాజ్యంగా రూపాంతరం చెందినంత పురాతనమైనది. ఇలాంటి యుద్ధాలలో ఎవరు గెలుస్తారు? స్త్రీల మీద అత్యాచారాలకు మూలం ఎన్నటికీ గెలువజాలని మహిళల శ్రమైక జీవన అపురూప ఆత్మిక సౌందర్యం. ముఖ్యంగా దేవిలాంటి ఆదివాసి అపురూప

లావణ్యం.. తనెప్పుడో చూసిన అకీరాకురు సోవా 'రాషోమాన్' గుర్తొచ్చింది. ఆ సిని మాలో అడవి దొంగ, ఇతను అడవిలోని ఖనిజాల దొంగ - దేవి అడవి. దేవి లాంటి యువతిని అడవి దొంగ చెరిచి చంపుతాడు. ఆమె బోధిసత్వునిలాగా కని పించిందట. తనను విచారిస్తున్న జడ్జితో దొంగ చెప్పిన మాటలు 'మనుషులను చంపడానికి మీకు ఖడ్గాలు అవసరం లేదు. అధికారంతో, ధన బలంతో చంపుతారు. కొన్నిసార్లు వాళ్ళ కోసమే అనే సాకుతో చంపుతారు. మీరు హత్యలు చేసిన ప్రతి సారి రక్తం ప్రవహించదు' బాప్‌రే! తనకు ఏదో ఔతోంది - అనుకున్నాడు శివశంకర్ మనుసులో.

"శంకర్!" విద్యాసాగర్‌రావు అసంద ర్భంగా, అధికార కంఠస్వరంతో పిలిచాడు.

ఆ అడవిలో తన అధికారం ప్రదర్శించ గలిగింది అతని ఒక్కని మీదనే - అది ఇప్పుడు అతనికి అనివార్యం కూడా. ఓటమి ప్రతిచర్య మొరటు అధికారంగా బయటపడుతుంది.

"సర్!" శివశంకర్ వినయం నటిస్తూ వ చ్చి అతని పక్క నిలుచున్నాడు.

విద్యాసాగర్‌రావు శివశంకర్‌ను ఎందుకు పిలిచాడో మరచిపోయాడు. కొద్దిసేపటికి తేరుకొని టీకి డబ్బులిచ్చేయమని శివశం క్‌కు చెప్పాలనుకున్నాడు.

ఆ విషయం గ్రహించినట్టు శివశంకర్ టీ డబ్బులు దేవికి యిచ్చి, మళ్ళీ వచ్చి అతని పక్కన నిలుచున్నాడు.

"మన ఫైలులో అన్ని ప్రొసీజర్స్ కరె క్టుగా ఉన్నయా? "

"లేకపోతే ఫైలు కదలదు కద సర్!" అనాలనుకున్నాడు. కానీ మౌనంగా నిలు చున్నాడు శివశంకర్.

"మీరందరుండంగ కలెక్టర్ నన్నెందుకు కలవాలనుకున్నట్టు? వాడొక రోగ్ ఉన్న ట్టున్నది" విద్యాసాగర్‌రావుకు కలెక్టర్ మీద పట్టరాని కోపం వచ్చింది. ఈ ధర్నాను

## 'చతుర'లో నా తొలి నవలిక



### అల్లం రాజయ్య

కరీంనగర్ జిల్లాలోని గాజుల పల్లి స్వగ్రామం. మాది వ్యవసాయ కుటుంబం. తల్లిదండ్రులు అల్లం నర్సయ్య, బుచ్చమ్మ. ఎమ్.సి.సి. సిమెంటు కంపెనీలో పర్సనల్ మేనేజర్‌గా పనిచేసి 2012లో పదవీ విర మణ చేశాను. సహచరి గజ్జెల శోభారాణి, ఉపాధ్యాయురాలిగా పదవీ విరమణ చేసింది. 'కొలిమంటుకున్నది, ఊరు, అగ్ని కణం, కొమురంభీం, వసంతగీతం' నా నవ లలు. వందకు పైగా కథలు రాశాను. మనిషి లోపలి విధ్వంసం, మధ్యవర్తులు, మహాదేవుని కల వంటివి ఇంగ్లీషు, హిందీ, మరాఠీ, తమిళం, బెంగాలీ భాషల్లోకి అనువా దమయ్యాయి. కొన్ని కథలు, కొమురంభీం నవల రేడియోలో ప్రసారమయ్యాయి.

**చిరునామా:**
**అల్లం రాజయ్య**
ఇంటి నెం. 12-285/1
కిరణ్ సదనం,
గౌతమి నగర్
మంచిర్యాల - 504209

చెదరగొట్టజాలని పోలీసుల మీద కోపం వచ్చింది.

"బహుశా.." శివశంకర్ మాట పూర్తి కాకుండానే.

"నో పెటీ రీజన్స్ - మీకు వేలకు వేలు

జీతాలు, అలవెన్సులు ఎందుకిస్తున్నట్టు? "

'మేం చేసే ఉద్యోగానికి మీరిచ్చే తుచ్ఛ జీతం ఏపాటికి?' మనుసులో అనుకున్నాడు శివశంకర్.

"ప్రజాభిప్రాయ సేకరణకు - మండలా ఫీసు క్లియరెన్సు, ఫారెస్టు ఆఫీసు క్లియరెన్సు.. అన్నీ కలిపి ఇప్పటికే ఇరవై లక్షలు దాటినయ్. చిన్న మైనింగు లీజు - అదీ ఇదివరకే ఉన్నది రెనివల్ కోసం.. ఇంత డిలే.. ఇండిపెండెంట్‌గా శాంక్షన్ చేయించజాలనోనివి నువ్వేం హెచ్చార్ మేనేజర్‌వి? మన పక్క ఫ్యాక్టరీ యం.డి. కలెక్టర్ దగ్గరికి వస్తాడా? నాన్సెన్స్!" తను కోపం పట్టలేక మాట్లాడిండు కాని, ఇక్కడ, ఈ సందర్భంలో మాట్లాడకూడదు. ఎవరైనా విన్నారేమోనని చుట్టూ చూశాడు. ఎవరి గోలలో వాళ్ళున్నారు.

"కలెక్టరుకు మీరు లోకల్ అని తెలుసు సర్. అదిగాక వాళ్ళు థర్డ్ పార్టీకి కాంట్రాక్టుకు యిచ్చారు" శివశంకర్ గుసగుసగా..

విద్యాసాగర్ కోపంతో ముఖం తిప్పుకొని ఎటో చూస్తున్నాడు. ఇదివరకు రూల్స్ రెగ్యులేషన్సు జనాలకు తెలిసేది కాదు. బయట ఎంత టెన్షన్‌గా ఉందో? పబ్లిక్ ఎంత అలర్టుగా ఉందో? ఈ ధర్నా చూసన్నా వీడికి అర్థం కాదు. డబ్బు, అధికారం మాత్రమే తెలుసు. పైగా కొత్తగా ఇండస్ట్రీకి వచ్చిన ఫ్యూడల్ దొరలకు ఇండస్ట్రియల్ కల్చర్ తెలియదు. తాము పబ్లిక్ హియరింగు కోసం ఎంత నాటకమాడినారో? వీనికి తెలియదు. శివశంకర్‌కు పబ్లిక్ హియరింగు గుర్తొచ్చింది.

ముందు వారం రోజులు ఆ వూరులో మద్యం ఏరులై పారింది. మేక మాంసం ఇంటింటికి పంపారు. గోండు బంగ్లా (అధికార్ల కోసం వేసిన గుడిసె) ముందు ప్రజాభిప్రాయ సేకరణ. 'మైనింగ్ ఏరియాలో పట్టా భూములు లేవు. ఫల పుష్పాదులకు గాని, పశుపక్ష్యాదులకు గాని, పంటలకు గాని ఏ మాత్రం నష్టం జరుగకుండా' రెవెన్యూ ఇన్‌స్పెక్టర్ ఆదరాబాదరాగా చదివిన తెలుగు మాటలు అక్కడున్న వాళ్ళకు ఎవరికీ అర్థం కాలేదు. గోండి భాషలో కావాలనే తాము చెప్పించలేదు. తాము తెచ్చిన గూండాలు - లోకల్ ఏజెంట్లు చింతచెట్ల కింద, విప్పచెట్ల కింద నిలబడి ప్రజల్లో ఎంపిక చేసిన, అదివరకే లంచాలిచ్చిన వాళ్ళను మీటింగు దగ్గరికి తోలారు.

అప్పటికే తాగున్న యమ్మార్వో "మీకందరికీ సమ్మతమేనా?" అని అడిగాడు తెలుగులో. ఆ ఒక్క మాటను గోండీలో చెప్పించారు. 'ఏది సమ్మతమో?' అక్కడ ఎవరికీ అర్థం కాలేదు. అసలు రెవెన్యూ ఇన్‌స్పెక్టర్ చెప్పిందేమిటో కూడా తెలియలేదు. గోండులు, కొలాములు, పరధానులు తమ భూములు రెవెన్యూ రికార్డుల గురించి, పట్టాల గురించి, రేషన్ డీలర్ అక్రమాల గురించి గోండీలో అరిచి యమ్మార్వోకు చెప్పారు.

ఒక గంట గోలగోలగా నడిచింది. నక్సలైట్లు ఉన్న కాలంలోనైతే ఒకప్పుడు ఆ గూడెంలో అట్లాంటి మీటింగు పెట్టడమే దుర్లభం.

"మీ క్వారీ మా వూరి బందుకున్నది. దుమ్ము రేగుతుంది. పంటలన్ని దుంపనాశినం, మీరు బత్తి బెట్టినప్పుడల్లా ఆ సప్పుడుకు మా గుడిసెలన్ని కదులుతున్నయి. గోడలు నెర్రెలు పాత్తన్నయి. మా గూడెంలో బాయిలన్ని లోతుకు పోయినయ్. సంతకాలు పెడితె మాకేమస్తది?" అన్నాడు హైస్కూల్ దాకా చదివిన ఒక గోండు యువకుడు.

"మేము కట్టిన రాయల్టీలో ఇరవై శాతం లోకల్ బాడీలకు వస్తుంది. అది మీకే చెందుతుంది" తమ అసిస్టెంట్ మేనేజరు చెప్పాడు.

"అరె బయ్ ఈడ బతుకు వశమైతలేదంటే మళ్ళ పైసలంటవ్?"

## కౌబాయ్ సినిమాలిష్టం

చతుర సమగతులు

ప్రపంచ ప్రసిద్ధ నాయకులలో జోసెఫ్ స్టాలిన్ ఒకరు. రష్యాని కమ్యూనిస్టు దేశంగా తీర్చిదిద్దిన ఆ ప్రముఖుడి గురించి..

★ జోసెఫ్ స్టాలిన్ అసలు పేరు జుగ్ ఇష్ విల్లీ. స్టాలిన్ అనే పేరుని ఆయనే పెట్టుకున్నాడు. రష్యన్ భాషలో దాని అర్థం ఉక్కు.




★ స్టాలిన్‌కి అమెరికన్ వెస్ట్రన్ (కౌబోయ్) చిత్రాలంటే ఇష్టం.

★ స్టాలిన్ ఎత్తు ఐదు అడుగుల నాలుగు అంగుళాలు మాత్రమే! ఓ చెయ్యి మరోదాని కంటే పొట్టి! మొహం మీద మచ్చలు ఉండేవి.

★ స్టాలిన్ రెండు కోట్లమంది మరణానికి కారణమయ్యాడు. తన ప్రాణ రక్షణ కోసం లక్షలమందిని శత్రువులు అనే అనుమానంతో చంపించాడు.

★ నాజీలు స్టాలిన్ కొడుకు యాకోల్‌ని బంధించి, డబ్బిస్తే కానీ వదలం అన్నప్పటికీ ఆయన ఇవ్వలేదు. యాకోల్ నాజీల జైల్లోనే మరణించాడు.

★ స్టాలిన్ పుస్తకాల పురుగు. ఆఫీస్‌లో, ఇంట్లో, సమ్మర్ హౌస్‌లో మార్క్సిజం, ఫిలాసఫీ, హిస్టరీ, ఎకానమీలకు సంబంధించిన పుస్తకాలు చదివేవాడు. కాల్పనిక సాహిత్యాన్ని ద్వేషించాడు.

★ స్టాలిన్ రష్యాలో వేల పార్కులను నిర్మించాడు.

★ టైమ్స్ మేగజైన్ 1940లో ఒకసారి, 1943లో మరోసారి జోసెఫ్ స్టాలిన్‌ని 'మేన్ ఆఫ్ ది ఇయర్'గా ఎన్నుకుంది.

★ స్టాలిన్ మరణించిన రోజున ఇజ్రాయిల్ దేశం జాతీయ సంతాప దినంగా ప్రకటించింది.

"ఆ ఫైసలన్ని ఇప్పటి దాకా ఏమయినయ్? " మరో ప్రశ్న వేశాడు ఇందాకటి యువకుడు.

"మీ సర్పంచ్‌నడుగండి" తను.

గుప్పున గోల లేచింది. ఆడవాళ్ళు పెద్దగా అరుస్తున్నారు.

అక్కడే ఉన్న సర్పంచ్ "నాకేడ తెలుస్తది? పంచాయత్ కారోబార్ నడుగాలె" అన్నాడు.

పెద్దగా గోల లేచింది. చెట్ల కింద గూండాలు మీటింగు దగ్గరికి వచ్చి అక్కడక్కడ నిలుచున్నారు.

కారోబార్ కోసం వెతికారు. కారోబార్ ఆ మీటింగుకు కావాలనే రాలేదు. అప్పటికే ఇన్‌స్పెక్టర్ కొంతమంది తొత్తులైన సెలెక్టెడ్ వ్యక్తులతో సంతకాలు తీసుకున్నాడు. ఒక గుంపు కోపంగా అక్కడినుండి లేచి వెళ్లిపోయింది. ఒక గుంపు వేలి ముద్రలేసింది. తాము తయారుచేసిన ప్రజాభిప్రాయ సేకరణ రిపోర్టు, సంతకాలు వేరే. అక్కడ జరిగింది ఒక తతంగం. ఆఖరులో ఆ అడవిలోకి ఎగపోసుకుంటూ వచ్చిన ప్రెస్సువాళ్ళకు తలా పదివేలు..! అట్లా తయారయిన బోగస్ రిపోర్టు మీద పకడ్బందీ సంతకాలు - యం.ఆర్.ఓ.కు లక్ష - ఆర్.డి.వో.కు లక్షన్నర.. వాళ్ళందరు రాయాల్సిన రిపోర్టులన్నీ తానే డ్రాఫ్టింగ్ తయారు చేయించి - సంతకాల కోసం రెవెన్యూ అధికార్ల చుట్టూ తిరిగి, అక్కడి నుండి ట్రైబల్ డిపార్టుమెంటుకు - అక్కడ రెండు లక్షలు.. ఫారెస్ట్ డిపార్టుమెంట్‌లో మూడు లక్షలు! కలెక్టరాఫీసులో

## కొత్తగాలి...

**ప్రేమంటే**
**పంచుకునేది!**
**చంపుకునేది**
**కానే కాదు!**

– జి.జి.కె. రావు,
శ్రీకాకుళం

జాయింటు కలెక్టరుకు ఇంగ్లీషు అర్థం కాదు. ఫారెస్టు యాక్టుతో సహా అన్ని యాక్టులూ తెలుగులో యిచ్చి - రిపోర్టుల న్నీ తామే డ్రాఫ్ట తయారుచేసి రెండు లక్షలు యిచ్చి - కలెక్టర్ పి.యే. నుండి కలెక్టరుకు ఫైలు పెట్టేసరికి కాళ్ళరిగిపో యాయి. మిగతా కంపెనీలు కలెక్టర్‌కు చాలా యిస్తాయి. ఇతగానికి అన్నీ తక్కు వలో కావాలి. పైగా తమ మీద నమ్మకం లేదు. ఇప్పటికి నాలుగు నెలల నుండి రోజూ ఈ అడవి దారిలో కలెక్టర్ దగ్గరికి చక్కర్లు - వీడికి ఒక్కరోజుకే ఇంత ఎలర్జీ కలుగుతోంది. ప్రమోషన్ మీద ఎదిగి వచ్చిన కలెక్టరుకు ఇగో - అతనికి పర్సనల్ మేనేజర్ స్థాయి సరిపోదు - "మీ కంపెనీ మట్టితో కోట్లు సంపాదిస్తది.. అడివిల ఆదివాసీ గూడేలను నాశనం చేసింది. అయినా నాకేమస్తది? " అన్నాడు. నచ్చ జెప్పబోతే తనతో డైరెక్టుగా డీల్ చేయద ల్చుకోలేదు. ఎక్కువ మొత్తం కావాలి. ఫేస్ టు ఫేస్ కావాలి. తనలాంటి వారి దగ్గర బయట పడదల్చుకోలేదు. ఇన్ని లెవల్స్, ఇంత పని, కో ఆర్డినేషన్ - ఇన్ని చేసినా వీడితో మాటలు పడటం. తుచ్ఛ ఉద్యోగం..!

విద్యాసాగర్ రావుకు శివశంకర్ మౌనం అర్థం కాలేదు. అతనిలో ఇన్ని రకాల ఆలో చలున్నాయని అతనికి తెలియదు.

"ఫో..! ఇక్కడి నుండి బయటపడే మార్గం చూడు - కంపరంగా ఉంది. జన్నారం ఎస్సైకి ఫోన్ చెయ్యి"

శివశంకర్ గుడిసె హోటల్‌కు కొంచెం ఎడంగా, పొలాల దగ్గరికి నడిచి సెల్‌ఫో న్‌ను కలిపాడు.

అయిదు నిమిషాల తరువాత విద్యాసా గర్ దాకా వచ్చి లోగొంతుతో.. "సార్! ఫోన్ రింగవుతుంది గాని ఎత్తుత లేదు. లక్సెట్టిపేట సి.ఐ. ఇంకో పావుగంటలో ఇక్కడికి చేరుకుంటున్నాడు సర్" అన్నాడు శివశంకర్.

విద్యాసాగర్ రావు కుర్చీలో నుండి లేచి నిలబడి చుట్టూ పరికించి చూసి "ఇక్కడి నుండి బయటపడే మార్గం చూడు" చిరాకుగా అన్నాడు.

తర్వాత కొంచెం దూరంగా పొలాలకేసి నడిచి తమ బంధువైన డి.యస్.పి.కి ఫోన్ చేశాడు. డి.యస్.పి. ఫోనెత్తాడు.

తను ధర్నాలో చిక్కుకున్నట్లు చెప్పాడు విద్యాసాగర్ రావు.

"ధర్నాలో మీరు చిక్కుకుపోయారా? వెరీ డేంజర్! ఇప్పుడిప్పుడే రోడ్ క్లియర్ కాదు. మీరు అక్కడి నుండి తక్షణం బయ లుదేరి - దక్షిణం వైపు రోడ్డు క్లియర్‌గుం టది. మన బంధువుల ఇంటికి వెళ్ళండి. రోడ్డు క్లియర్ కాగానే ఇన్‌ఫాం చేస్త"

'వీడు తనను తానే భరించే స్థితిలో లేడు' అనుకొని అక్కడి నుండి శివశంకర్ కదిలాడు.

విద్యాసాగర్ ఎటూ తేల్చుకోలేక మళ్ళీ వచ్చి కుర్చీలో కూర్చున్నాడు.

'వీడిట్లా ఎక్కడికి పోతున్నట్టు? డి. యస్.పి. చెప్పిన విషయం చెప్పాలా వద్దా? ' విద్యాసాగర్ రావు మీమాంసలో ఉండగానే శివశంకర్ వెళ్ళిపోయాడు.

హోటల్ దగ్గర హడావిడిగా తిరుగు తున్న దేవికి ఈ మాటలు సరిగా అర్థంకా లేదు కాని - ఇక్కడ కూర్చుండి తనను

తినేసేటట్టు చూస్తున్న వీడెవడో మామూలోడు కాడు. పైగా పోలీసుల గురించి మాట్లాడుతున్నాడు అనుకున్నది.

"ఆc! గింత మందిల ఎవడేం జేస్తడు తియ్" అనుకున్నది.




శివశంకర్ అడవిలో తారు రోడ్డు మీద పక్క కాలిబాట మీదుగా కొంచెం దూరం నడిచాడు. రోడ్డు మీద ఆడ, మగ మనుషుల గుంపు - నినాదాలు ఇస్తూ పాటలు పాడుతున్నారు.

టేకు చెట్లు ఆకాశంలోకి పెరిగున్నాయి. ఆ చెట్ల కింద చిక్కగా అల్లుకున్న కంకపొదలు, అక్కడక్కడ విప్ప, బిలుగు, తునికి చెట్లు, చెట్లను అల్లుకున్న పచ్చటి తీగ పొదలు, అడవి వాసన - మనుషుల వాసన కలగల్సి - అడవి దారిలో కోలాహలం. మధ్యలో డ్రైవర్ శ్రీను కలిశాడు.

"పోలీసులు వచ్చిండ్లు సార్! మీటింగు కాడ లోకల్ లీడర్లున్నరు. హక్కుల సంఘాల వాళ్ళు ఎం.ఎల్.ఎ.తో మాట్లాడినారట. సర్కిల్ వచ్చేదాక నిలబడి చూస్తున్నారు సార్! మీరేమైనా యస్సైతో మాట్లాడ్తరా సార్? " అన్నాడు శ్రీను.

"వద్దు గరంగరంగున్నది పరిస్థితి" గుసగుసగా చెప్పాడు శివశంకర్.

శివశంకర్ మళ్ళీ వెనక్కి వచ్చి - స్కార్పియో దగ్గర నిలబడ్డడు. ఫోన్ రింగయ్యింది. ఎత్తిండు.

డి. యస్. పి.

"సర్! నేను పర్సనల్ మేనేజర్ శివశంకర్! మేము ధర్నాలో చిక్కుకపోయినం.. మా మేనేజింగ్ డైరెక్టర్.."

"ఏమన్న ప్రొటెక్షన్ కావాలా? అక్కడ మీ పరిస్థితి ఎట్లా ఉంది? "

"నో - నో - ఎవరికి తెలియదు. మమ్ములనెవరూ గుర్తు పట్టలేదు సార్"

"ఎందుకైనా మంచిది, మీ సారును ధర్నా దగ్గరి నుంచి దూరంగా - సౌత్ సైడు రోడ్డు బ్లాక్ కాలేదు కద, విలేజి దిక్కు తీసుకుపో. అవసరమైతే మా యస్సై హెల్ప్ తీసుకో"

"థాంక్యూ సర్!" ఫోన్ కట్టయ్యింది.

వెంటనే అంతను విద్యాసాగర్ రావు దగ్గరికి వచ్చి "సర్! నేను డి. యస్. పి. తో మాట్లాడిన - మనం ఇక్కడుండటం మంచిది గాదంటున్నడు, ఒక గంట గోదావరి సైడు విలేజీకి పోదాం సర్" అన్నాడు గుసగుసగా..

విద్యాసాగర్ రావు ఆ మాట విన్పించుకున్నట్టు లేదు.

శివశంకర్ కొంచెం దూరంలోని కంక బొంగుల బెంచీమీద కూర్చున్నాడు. మళ్ళీ చెప్పాలి. శ్రీను ఎక్కడికి పోయాడో? ఏక కాలంలో రెండు విరుద్ధ పాత్రలు పోషించడం వెలపరంగా ఉన్నది. ఈ తతంగంలో మొత్తం తమ డిపార్టుమెంట్ ఎంత ఇన్వాల్వ్ అయ్యిందో ఎవడికి తెలుస్తుంది? ప్రకృతి వనరులు దోచుకొని, శ్రమశక్తిని దోచుకొని - కోట్లు, కోట్లు సంపాదించే యాజమాన్యాలకు - ఇలాంటి మానవ వనరుల యంత్రాంగం లేకపోతే - సృష్టించుకుంటారు. చివరకు యంత్రాంగానిదేం వుండదంటారు. అంతా తమ తెలివి తేటలనుకుంటారు.

విద్యాసాగర్ ముఖం మాత్రం కసితో బిగుసుకపోయింది.

దేవి అక్కడి ధర్నాలో లీనమౌతూనే -

చాయ్ గ్లాసులన్నీ జమచేసి శుభ్రంగా కడిగి తెచ్చింది. అన్నీ చిన్న టేబుల్ మీద కళాత్మకంగా అమర్చింది. ఆమె కదలికలు, రియాక్షన్ తనకు అర్థం కావడం లేదు.. తన ఉనికినే పట్టించుకోవడం లేదు. లెక్క చేయకుండా ఆ నడకేంది? అందంగా అపురూపంగా కన్పిస్తున్న ఆమె ప్రతి కద లిక, దేహం.. వింత హొయలు, తేజస్సు, కోపమా? కసా? తిరస్కారమా? తను అనవరంగా ఎక్సైట్ అవుతున్నాడు. బ్యాలెన్సు కోల్పోతున్నాడు. కూరుకపోతు న్నాడు - తను అనివార్యంగా పరిష్కరిం చాల్సిన - ఆలోచించి నిర్ణయాలు తీసుకో వాల్సిన అనేకం వొదిలిపెట్టి.. ఒక ఆది వాసీ స్త్రీ గురించి ఇంతలా ఆలోచిస్తు న్నాడు. వివశుడౌతున్నాడు.

"సర్! మనం ఇక్కడ ఉండటం క్షేమం కాదని డి.యస్.పి. చెప్పారు. వెనక్కి, ముందుకు పోరాదు, ధర్నా ముగిసేదాకా పక్క విలేజికి పోదాం" శివశంకర్..

"వద్దు.." విద్యాసాగర్ రావు.

మరేమనాలో తెలియక శివశంకర్ అ లాగే నిలుచున్నాడు.

కలెక్టరుకు అహం..! తను స్వయంగా రిక్వెస్ట్ ముఖం పెట్టి వాడి ఆఫీసుకు పోవాలి. ఎక్కువ మొత్తం ఇవ్వాలి. అసలు ఈ వ్యవహారం తాము స్వయంగా చెయ్యడమే అనుభవ రాహిత్యం. కొంత ఎమౌంట్ మిగులుతుందని తనే మొదలు పెట్టాడు. థర్డు పార్టీకి కన్సల్టింగు యిస్తే సరిపోయేది. లీజు సర్టిఫికెట్ ఇప్పటికే వచ్చేది. టైమ్ వేస్టయ్యింది. ఖర్చు పెరి గింది. శివశంకర్ లాంటి వాళ్ళను ఇన్ వాల్వ్ చెయ్యడం వలన కాంప్లికేట య్యింది. ఏదో ఎదురు తిరుగుతోంది - కొంచెం ధైర్యం చేసి దేవికేసి చూసిండు వి ద్యాసాగర్. మెదడు పుంజుకొని పని చేస్తోంది.

దేవి మీటింగుకేసి చూస్తోంది..

శివశంకర్ ఆ ఇద్దరికేసి చూశాడు. అత నికి వాళ్ళిద్దరి మనోభావాలు తెలియడం లేదు.

ప్రకృతిని, ప్రకృతిలో భాగమైన స్త్రీని కైవసం చేసుకోవాలనే అతి పురాతన స్వంత ఆస్తి రాజ్య కాంక్ష అతని ముఖంలో - అచ్చం అడవిని స్వంతం చేసుకోవాలనే కాంక్ష లాంటిదే.

'బహుశ దాని పతాకస్థాయి - ప్రకృతి విధ్వంసంగా వ్యక్తమౌతుందా? మనిషికి, చేపకు కుళ్ళడం మెదడుతో ఆరంభమౌ తుందట. కొంపదీసి అడవిలో ఎన్నో ఏండ్లుగా బతికే ఆదివాసులను కకావికలం చేసి - పులుల సంరక్షణ - టైగర్ జోన్ అనేది ఆ వ్యూహంలోని భాగమా? పులి దేనికి సంకేతం? పెట్టుబడి పల్లెలు, పట్నాలు చుట్టుముట్టి ఆక్రమించి ఇప్పుడు అడవుల్లోకి విస్తరించి అది ఆదివాసుల మీద యుద్ధంగా వ్యక్తమౌతోందా? సువిశా లమైన అమెరికాలో స్థానిక ఆదివాసులను, సముద్ర తీర ప్రాంతంలోని స్థానిక మత్స్య కారులను సమూలంగా నిర్మూలించిన యుద్ధ సంస్కృతి - వ్యాపార సంస్కృతి ఇప్పుడు ఆసియా అంతటా విస్తరిస్తోందా? అది ఆదివాసుల మీద యుద్ధంగా వ్యక్త మౌతోందా? బాపురే! ఇలాంటి మానవ ప్రవర్తన శాఖోపశాఖల మీద - తను ఢిల్లీ లోని మానవ అభివృద్ధి శాఖకు ఒక పేపరు ప్రజంటు చేస్తే! సమాజం మును పటి కన్నా లోలోపల మైక్రో లెవెల్లో యుద్ధంలో తలపడుతోంది. బహుశా కొన్ని కోట్లమందిని సంహారం చేసిన రెండు ప్రపంచ యుద్ధాలు - అనేక దేశా లను వల్లకాడుగా మార్చి కొన్ని కోట్ల మందిని చంపి పెట్టుబడిని స్థిరీకరించుకు న్నాయి.. సముద్రంలో మంచుకొండలాగా లోలోపల విధ్వంసమైన పెట్టుబడిదారు లకు, సంపదలు సృష్టించే మానవులకు బయటకు కన్పించని యుద్ధరంగం మను

షల్లో విస్తరిస్తోంది. అందుకే - దేశ వ్యాప్తంగా మహిళల మీద, చిన్న పిల్లల మీద - ముఖ్యంగా - సువిశాలంగా విస్త రించిన అడవి మీద, అడవుల్లోని ఆదివాసి మహిళల మీద దాడులు జరుగుతు న్నాయి. యుద్ధరంగం మారుతోంది. అటు యిటూ మనుషులు సమీకృతమవుతు న్నారు. అందుకే ప్రజా ప్రతినిధులు సాయుధ గార్డులతో తప్ప బతుకలేరు. రేపు ఇండస్ట్రియలిస్టులకు, తన లాంటి స్టాఫ్‌కు సాయుధ గార్డులు కావాలేమో? రేపెందుకు? ఈశాన్య రాష్ట్రాలల్లో, బీహార్, జార్ఖండ్, చత్తీస్‌ఘడ్‌లో ఫ్యాక్టరీలు సాయుధ గార్డులతో నడుస్తున్నాయి.

శివశంకర్‌కు నలుభై అయిదేండ్లు - దళిత కులం - అనేక అవమానాలు, ఒడి దుడుకులు ఎదుర్కొని ఈ ఉద్యోగంలోకి వచ్చాడు - యూనివర్సిటీలో చదువుకున్న ప్పుడు లెఫ్ట్ విద్యార్థి సంఘాల సహ చర్యం.. పల్లె నుండి రెక్కాడితెనే డొక్కా డని స్థితి నుండి - చదువు మాధ్యమంతో ఇంత దూరం ప్రయాణం..! ఫ్యాక్టరీలో కీలకమైన అధికారిగా పని చేస్తూ కూడా ఫ్యూడల్ అధికారాన్ని, అహంకారాన్ని, కులాధిక్యతను భరించాలి. భరించడమే కాదు, కార్మికులను ఉత్పత్తిలో భాగం చేయాలి - యజమానికి లాభాల పంట పండించాలి. ఒక రకంగా అతనిది దళారి ఉద్యోగం!

తన లోపల జరుగుతున్న వివేచనతో - తెలివితో - దేవికేసి చూశాడు. మిరిమిట్లు గొలిపే కాంతి గల తడితో మెరిసే ఆమె కళ్ళు - బహుశా ఇక్కడ జరుగుతున్న దంతా ఆ కళ్ళల్లో ప్రతిఫలిస్తున్నదేమో? బహుశా అడవి మార్మికమైన, అందమైన ప్రొడక్టు దేవి. అది ఆమె సహజ స్వభావం. ఇతరులకు నచ్చే విధంగా ఎప్ప టికప్పుడు పంథా మార్చుతూ తనలాగా ఉండలేదు. తను తనలాగే ఉంటుంది కాని మరొకలా ఉండలేదు. అదే ఆమె

## కొత్తగాలి... 

**అప్పుడు**
**చెక్ బౌన్సయ్యేది!**
**ఇప్పుడు**
**కార్డు బౌన్సవుతోంది!!**

*- నీహారిక దూసి,*
*బెంగళూరు*

సౌందర్యం. అనేక కష్టాలల్లో నిలబెట్టు కున్న వ్యక్తిత్వ సౌందర్యమది. ఔను అడవి, సమస్త ప్రకృతి మరొకలా ఉండ లేవు.

ఇక్కడ కూర్చున్న తన యజమాని - డబ్బు, అధికారం గలవాడు. తుపాను గాలిలో వొనికినట్టు విచలితుడయ్యాడు - ఇతనూ తనలాగే పేదరికంలో పుట్టాడు. తేడా అల్లా తను అంటరానివాడు - అతను పైకులస్తుడు. కులహంకారంతో - కసితో చదివి - జీవితాన్ని గెలుచుకోవడం కోసం, మంది మీద ఆధిపత్యం కోసం, పరుగెత్తి, పరుగెత్తి - అసలు జీవితాన్నే కోల్పోవడం ఒక విషాదం. నిచ్చెనమెట్ల కుల వలయా లల్లో అగ్రకులపు అహంకారం, లేమి ఛాయలు వదలని సలపరం - అప్పటికే ఆధిపత్యంలో ఉన్న కుటుంబాలతో ఉన్న సంబంధం, తద్వారా వచ్చిన పెత్తనం, తన లేమి కుటుంబం మీద బంధువుల చిన్న చూపు. అందిన అధికారాన్ని, డబ్బును అనుభవించజాలని విషా దం మరోవేపు.. ఒక్కొక్కసారి వ్యక్తిగత విజయంగా కన్పించే బ్యూరోక్రాటు జీవితం - ఒక అందమైన మోసం, దగా.. ఈ విషయం అర్థం కాదు. అర్థమైనా వ్యక్తిగత ఇష్టాయి ష్టాలతో ముడిపడి ఉండేది కాదు.

శివశంకర్ దేవి నుంచి దృష్టి మరల్చు

కొని విద్యాసాగర్‌కేసి చూశాడు. బాప్‌రే! అతని గాజు కళ్ళు పులి కళ్ళలాగా వెలుగుతున్నాయి. అతనొక పొంచి ఉన్న పులిలా కన్పించాడు. ఇక్కడ జరుగుతున్న



ధర్నా లో మనుషుల్లో కలిసిపోయిన పులులు ఇలాంటి వాళ్ళు ఇంకెంతమంది ఉన్నారో?

తను, తన చుట్టూ ఇలాంటి విధ్వంసమైన మనుషులు - వాళ్ళతో పెనుగులాట - శివశంకర్ విద్యాసాగర్ మీది నుండి సుదూరంగా నిలిచి ఉన్న వాహనాల కేసి రోడ్డు మీదికి దృష్టి సారించాడు. అర్ధాంతరంగా నిలిచిపోయిన ఈ మానవ ప్రవాహంలో - టైగర్ జోన్ గురించి ఎన్నెన్ని విచారాలు జరుగుతున్నాయో? దేహ భాషలో ఎందరెందరు మాట్లాడుకుంటున్నారో? పరిసరాలను బట్టి - పరిసరాలల్లోని కదలికల, చలనాల వేగాన్ని బట్టి, మనుషుల సంస్కారాన్ని బట్టి, అనుభవాన్ని అనుసరించి, దృక్పథాన్ననుసరించి, పాజిటివిటి, నెగెటివిటి రియాక్షన్స్ ఉంటాయి. అందులో వ్యక్తులు విడిగా ఉన్నప్పుడు ఒకలా, సమూహంలో ఉన్నప్పుడు మరొకలా రియాక్ట్ అవుతారు. ఇట్లాంటి అంతులేని ఆలోచనల్లో శివశంకర్ ఉండగానే -

దేవి భర్త భీంరావ్ ఎగపోసుకుంటూ పరుగెత్తుకొని వచ్చి - "దేవీ! నువ్వు పాడాలట దా!" అన్నాడు.

"హే - గీ ఓటల్లో నాకేడ పాడత్తది? " అన్నది దేవి.

నీ నకురాలు నాకు తెలుసు - బతిలాడిచ్చుకుంటవన్నట్టు చెయ్యి పట్టుకొన్నాడు. దేవి నడుముకు చెక్కుకున్న చీర కొంగు తీసి - వెంట్రుకలు సరిచేసుకొని - విద్యాసాగర్ కేసి ఒక చూపు విసిరి - ఆ పక్కనే బెంచీ మీద కూర్చున్న గోండతనికి "జర సూడుండ్లని" మార్దవమైన కంఠంతో చెప్పింది.

లేడి పిల్లలాగా - కొండవాగు లాగా

ఇక్కడే ఈ అడవిలో దేవిలాగా బతుకా లంటే - ఎందుకూ పనికిరాని వాడిననే ఫీలింగు కలిగింది.

విద్యాసాగర్ రావు ఫోను మోగింది! పేరు చూడగానే ముఖంలో చిరాకు. అది తన భార్య ఫోను.

"చెప్పు.." అయోమయంగా.

"హలో- ఎక్కడున్నవ్ - గొంతేంటి అంత డ్రైగా! టిఫిన్ తిన్నావా? "

"ఆ తిన్న" పొడిగా.

"ఏం టిఫిన్? " కొంచెం అధికార స్వరంతో..

విద్యాసాగర్ రావుకు సమయానికి గుర్తుకురాలేదు. ఆయన మెదడు పూర్తిగా గజిబిజైపోయింది.

"ఏంది? బంగ్లాలలో కుక్ రాలేదా? బేరర్లు వచ్చిండ్లా? ఇంతకూ గార్డెన్ మాలీలు బంగ్లాలకు వచ్చిండ్లా? "

"అది నన్నడుగాలా? సెక్యూరిటీ గార్డ్సుకు ఫోన్ చెయ్యి. అయినా సిటీలో ఉన్న నీకు ఈ వివరాలన్నీ అవసరమా? అవన్నీ డిపార్ట్‌మెంట్స్ చూసుకుంటాయి!"

"చెత్త డిపార్ట్‌మెంట్స్ - పేరుకే అవన్నీ. గెస్టవుజు ఎంత రోతగా పెట్టిండ్లు. అసలు మీ పర్సనల్ డిపార్ట్‌మెంట్ పని చేస్తందా? ఉత్త పుణ్యానికే జీతాలు తీసుకొని నీ చుట్టూ తిరుగుతరా? శివశంకర్ ఉత్త రోగ్! వాన్ని ఇంటికి పంపించెయ్"

"శివశంకర్ ప్లేసులో నిన్ను అడ్మినిస్ట్రేషన్‌లో వేస్తలే"

"సంబుడం - ఇప్పటికే సస్తున్న ఇంట్లోనే - ఆఫీసులో నీ కింద పని చేయడమా? ఇంతకూ తిన్నవా, లేదా? బి.పి., షుగర్




భీంరావ్ చేతిలో చెయ్యేసి మీటింగు దగ్గరికి పరుగెత్తింది.

శివశంకర్‌కు తనున్న స్థితి నుండి బయట పడ్డట్టనిపించింది.

విద్యాసాగర్ రావుకు అవమానమన్పించింది. తన స్థితిమీద తనకే అసహ్యమేసింది. శివశంకర్‌మీద, కలెక్టరు మీద పట్టరాని కోపం కలిగింది. ఇన్ని రకాల ఫార్మాలిటీస్ పెట్టినందుకు ప్రభుత్వం మీద కోపం కలిగింది.. ఉద్యమకారులు ఉన్న పళంగా తన ఆస్తులన్నీ గుంజుకుంటే -

టాబిలెట్స్ వేసుకున్నవా? "

'దీనికి ఎక్కడలేని ఆరాటం' విద్యాసాగర్ రావు మనసులో అనుకున్నాడు.

"ఆ వినోద్ గాడు రాలేదా? వాన్ని గెస్ట హుజుకు పంపు అక్కడి రాజును బంగ్లాకు తెచ్చుకో"

"సరే!"

"ఏంది సరే! ఎప్పుడూ బిజీయే. ఆ లొల్లేంది? ఎక్కడున్నవ్? "

"ఆదివాసుల ధర్నాలో"

"జోక్ చేస్తుండ్లా - మీరేంది ధర్నాలో? "

"టైగర్ జోన్‌కు వ్యతిరేకంగా ధర్నా- మేము అందులో చిక్కుకున్నం"

"ప్లేసు ఎక్కడ? "

"ఆ ప్లేసంటే - ఇంకా జన్నారం ఇక్కడికి పన్నెండు కిలోమీటర్లు"

"మీ మేనేజరుకు బుద్ధుందా? అసలే అది నక్సలైట్లు తిరిగే డేంజర్ ప్లేసు"

"నువ్వు ఫోను పెట్టేయ్" విసుగ్గా.

"ఉండు నేను కనుక్కుంట. సేఫే కదా! ఇంతకూ అదేం ప్లేసు అన్నవ్? "

"కవ్వాల్ ఫారెస్టు స్టార్టింగు పాయింటు.. ఫారెస్టు చెక్ పోస్టు"

కాసేపు మౌనం..

విద్యాసాగర్ ఫోన్ కట్ చేశాడు.

మళ్లీ రెండు నిమిషాలలో ఫోన్ రింగ యింది. "అంత బోర్ కొట్టానా! ఫోనెం దుకు పెట్టేసినవ్? ఇంతకూ పిల్లలతో పొద్దున మాట్లాడినవ? వాళ్లకు మనీ ట్రాన్స్‌ఫర్.."

"నేను చూస్తాలే"

"అది ఇండియా కాదు లాస్ ఏంజల్స్ - మనీ లేకపోతే కాలు బయట పెట్టరాదు.. ఇంతకూ మాట్లాడినవా? లేదా? "

విద్యాసాగర్ రావు ముఖం కోపంతో బిగుసుకుపోయింది.

"పర్సనల్ పనులేవి పట్టవు. సరే! టీవీలో స్క్రోలింగు వస్తోంది. భారీ ట్రాఫిక్ జాం"

"ఔను"

"మీకేమన్న పిచ్చి పట్టిందా? అంత గడ బిడలో ఎందుకున్నరు? "

ఫోన్ పెట్టేశాడు విద్యాసాగర్ రావు. అసలే ఊపిరాడక చస్తుంటే, భార్య ఇంట రాగేషన్.. 'ఈ ఫాలోయింగేమిటి? ఎక్క డికి పోయినా? ఒకటే నస..'

మళ్లీ ఫోన్ మోగింది.

ఎత్తలేదు.

మళ్లీ మోగింది.

కట్ చేశాడు.

మూడోసారి ఎత్తాడు.

"మీకసలు కామన్ సెన్సుందా? ఎక్క డికి పోతాయి లేకిడి అలవాట్లు - ఫోన్ కట్ చెయ్యకు - విను- ఆ పక్కూరులోనే మా కాక ఉంటడు"

"తెలుసు"

"ఏం తెలుసు? వరుసకు కాక - దూరం చుట్టం. మీలాగే పరమ పిసినారి. ఆ పల్లె టూర్లో చచ్చీ చెడి పంటలు పండించి సంవ త్సరానికొక కిలో బంగారం బ్యాంకు లాకర్లో పెడతాడట. అది సరే - ఇంకో పది నిమిషాల్లో మీ దగ్గరికి కాక వస్తడు. వారితో పాటు మీరెల్లండి- మీ పర్సనల్ గాన్ని అక్కడే ఉండి - లైన్ క్లియర్ కాగానే ఇన్‌ఫార్మ్ చేయమనండి.. విన్పిస్తోందా? "

"ఓకే"

ఫోను కట్టయ్యింది.

విద్యాసాగర్ ముఖం జేవురించింది. 'ఈ ఫోను ఎవడు కనిపెట్టాడో? సగం కన్నా ఎక్కువ టైం సోదికే సరిపోతుంది. ఇన్ని మాటలవసరమా? అబ్బో డబ్బు నెట్ వర్క్ చాలా పెద్దది'

తన పిసినారితనం మీద విసుక్కునే భార్య.. ఇంత సంపాదన, షేర్లు, కార్లు, ఇన్ని వందల మందికి జీవనోపాధి - ఫ్యాక్టరీకి యజమానినైన - తన సంపాదన కాదా ఇది?! ఇంత సంపాదనను తను అనుభవించలేడా? తను వీటన్నింటిని

తినలేడా? తను మంచినీళ్లు కూడా స్వయంగా తాగలేడు. ఎవరో తెచ్చి చేతి కిస్తే తప్ప తాగలేడు. ఇందాక ఈ ఆది వాసి పిల్ల తన అవిటి తనాన్ని గుర్తుపట్టి- తనకు చాయ్ తెచ్చి ఇచ్చి మళ్లీ గ్లాసు తీసుకపోయిందా? చాయ్ కావాల్సిన వాళ్లు దేవి దగ్గరి దాకా వెళ్లి ఆమె దగ్గరే తీసుకుంటున్నారు. వాళ్లకు దేవి దూరం లేదు. తనకు మనుషులకు చాలా దూరం.

"ఇప్పుడు మిట్టపెల్లి సురేందరన్నకై గట్టిన మన ఆదిలాబాద్ పాట మన దేవి బృందం పాడుతరు" మైకులో ఎవరో ఎనౌన్స్ చేశారు.

"ఆదిలాబాదు జిల్లారా

అది ఎర్రనీ అడవి మల్లెరా.." దేవి గొంతు మోగుతోంది.

విద్యాసాగర్ రావుకు వంద గజాల దూరంలో పాడుతోంది. మీటింగు దగ్గర అడవిలోని చెట్లు ఒక తుపాను చెలరేగి నట్లు ఊగుతున్నాయి. అది పాకిస్తాన్ కొండ సానువుల్లో గొడ్లగాసే రేష్మా కంఠమా! కాదు అలాంటి విషాదపు జీర గొంతుక కాదు. అది ఓషధుల చెట్లు, చిల్ల, తునికి, తవిసి, వేపల గాలితో - గిరి పర్వతాలతో, కొండ వాగులతో, కుంటారి, పొచ్చెర లాంటి జలపాతాలతో నిండిన ఆదిలాబాదు అడవి ఆలపించే గొంతుక - విషాదపు జీర లేని గొంతుక, ఓటమి, విజయాల కతీతమైన కంఠస్వరం.. అలలు అలలుగా అక్కడ అనివార్యంగా జమైన వందలాది మనుషులను తాకుతోంది. లోలోపల ముట్టుకుంటోంది.

గుబగుబ కళ్లల్లో నీళ్లు నిండగ శివశంకర్, తడబడే అడుగులతో గిడుసబారిన యజమానిని ఆ పాత హోటల్ గుడిసె దగ్గరే ఒదిలి, ఎవరి అనుమతి అక్కర లేకుండానే ఆ పాట దిక్కు నడిచాడు.

పదాల, స్వరాల సంయోగ ఫలితమది.

ఆ కంఠ స్వరానికి శరీరంలోని మొత్తం రక్తం ఇంకిపోయినట్లుగా కుంగిపోయి

## నవంబరు - 2016
## చతుర ప్రవేశిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ అయిదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.



1. **అల్లాడి లక్ష్మి**
   - ప్రశాంతినగర్, తిరుపతి
2. **వక్కలంక విజయలక్ష్మి**
   - కృష్ణరాజపురం, విజయనగరం
3. **కస్తూరి వెంకుబాబు**
   - బ్రాడీపేట, గుంటూరు
4. **పి. చంద్రిక**
   - గాంధీచౌక్, ఖమ్మం
5. **శివలెంక భ్రమర**
   - అహ్మద్‌నగర్, హైదరాబాద్

### సరైన జవాబులు

| | |
|---|---|
| 1. కౌసల్య | 6. మీర్జా |
| 2. టి.బి. | 7. షామిర్ |
| 3. టీచరు | 8. షహజాదీ |
| 4. రమణ్రావు | 9. నవంబరు 14 |
| 5. ప్రభాకర్ | 10. డా. పి. శ్రీదేవి |

కూర్చున్నాడు విద్యాసాగర్ రావు. శరీరంలో సన్నగా వణుకు ప్రారంభమయ్యింది. ఇలాంటి కరంటు తీగ లాంటి మనిషితోనా తను తలపడ్డది?

ఎర్రని అడవి మల్లె ధగధగలాడుతూ - జగిత్యాల తాలూకాలో తమ దగ్గరి బంధువుల గడీ లూటీ చేసి, తమ బంధువైన దొరను హత్య చేసిన రైతులు - కూలీలు కళ్లల్లో మెదిలారు. అంతెందుకు తను కూర్చున్న దగ్గరికి సరిగ్గా మూడు మైళ్ల

## కొత్తగాలి...

**మనసు**
**అనురాగాల గూడు!**
**శరీరం**
**అనేక రోగాల గోడు!!**

– పి.వి. రమణకుమార్,
చిలకలూరి పేట, గుంటూరు జిల్లా

దూరంలో తమ కులం వారివి మూడు హత్యలు జరిగి మొత్తం కుటుంబం - ఒకప్పుడు ఈ జిల్లాలోనే ఎదురులేని కుటుంబం కుప్పకూలింది. 'ఇప్పుడు తన కోసం వచ్చే కాక' ఆ శకలాలల్లో ఒంటరిగా మిగిలిపోయినవాడు.

అనేక యుద్ధాల తరువాత అటు ఇటు హత్యలు, వందల కేసుల తరువాత తాము కొత్త అవతారమెత్తి - పారిశ్రామికవేత్తలుగా సజ్జనులుగా భాష, వేషం మార్చుకున్నా కూడా - ఎర్రమల్లెలు చుట్టూ పూసి గుబాళిస్తున్నాయి. వాటి పరిమళం అనుకోకుండా ఇక్కడ ఇప్పుడు తనకు అనుభవంలోకి వస్తోంది.

ఇక్కడ పేరుకు టైగర్ జోన్‌కు వ్యతిరేకంగా ధర్నా జరుగుతున్నా కూడా - అడవిలోపలి సమస్త సాధు జంతువుల గానమిది.. ఇక్కడ చిక్కుకుపోయిన ఇంతమందిలో తనొక్కడే వీళ్లకు శత్రువా? ఏమో ఇక్కడ ఆగిపోయిన అనేక వాహనాల్లో తనలాగా ఎంత మందున్నారో? తనకు తెలుసు శివశంకర్, శ్రీను వాళ్ల మనుషులే - విద్యాసాగర్ రావుకు మొదటిసారిగా ఒళ్లు జలదరించింది.

శివశంకర్ గాడు ఎట్లా అన్ని వడపోతలు దాటుకొని తమ లోపలికి చొచ్చుకు వచ్చాడో తెలియదు. బోర్డులో వీనికి మద్దతెవరున్నారు? సమయం, సందర్భం చూసి ఎలిమినేట్ చేయాలి! అసలు ఈ నలభై సంవత్సరాల కాలంలో యూనివర్శిటీల్లో చదివిన దళిత, బి.సి. కులాల వాళ్లంతా తమకు వ్యతిరేకమే. వాళ్లు మెజారిటీగా ఉన్నవాళ్లు - మైనార్టీగా ఉన్న తమ మీదికి ఎప్పటికైనా దాడికి వస్తారు.

'ఇప్పుడు వీళ్లందరు కలిసి - తనమీద దాడి చేసి చంపితే దిక్కెవ్వరు? విద్యాసాగర్ రావుకు ఒళ్లంతా చెమట పట్టింది. అంతా ఫ్రీజయ్యింది. ముందుకు దారి లేదు. వెనక్కు దారి లేదు. తన జీవితం లాగే అంతా ఫ్రీజ్. ధర్నాలో ఇరుక్కుపోయింది. వచ్చే కాక కోసం ఎదురు చూస్తున్నాడు. తను భ్రమ పడుతున్నాడా?'

పచ్చాని అడివంత ఆకాశమైతే -
పల్లేలన్ని జాబిలమ్మలూ
ఆ గోండులే వేగు చుక్కలురా
ఆదిలాబాదు జిల్లారా -
అది ఎర్రనీ అడవి మల్లెరా!

విద్యాసాగర్ రావు ఆకాశం కేసి చూశాడు. పచ్చని చెట్ల కొసల మీద ఎండ మండుతోంది. తను ఆకాశం కేసి ఇంత రికామిగా చూసి ఎన్నాళ్లయ్యిందో? ఎండపొడను - వెన్నెలను - అసలు మనుషుల ముఖాలు చూసి ఎన్నాళ్లయ్యిందో? తనకు భార్య ముఖం తెలుసా? పిల్లలు - అమెరికాలో చదివే కొడుకు, కూతురు ముఖాలు గుర్తొచ్చాయి. వాళ్లతో తను ఎప్పుడైనా ప్రేమగా మాట్లాడిండా? తనకు గుడ్డితనం వచ్చేసింది.

తిరుగుబాటుకు తిలకాన్ని దిద్దినా
ఇంద్రవెల్లికి పురుడు పోసిందిరా
తూటాలు దించినా పాతరే పేల్చినా
కడుపుకోత
అనుభవించిందిరా // ఆది //
పోరులో పారీన నెత్తూటి వరదల్ని
మట్టి దోసిల్లతో పట్టిందిరా // ఆది //
కొమురం భీమును సమరాన
నడిపిన ఆదివాసులూ

చమత్కారం,

# గుప్పుమన్న యమకం!

చేమకూర వెంకటకవి 'విజయవిలాసం' రసవత్తర కావ్యం. చేమకూరవారి పదప్రయోగాలు, రసజ్ఞత పఠితలకు గిలిగింతలు పెడతాయి. అడుగడుగునా చమత్కారం వారి కవితా లక్షణం! మచ్చుకు ఈ చిన్న పద్యం చూడండి..

**నళినలీల సంచు నలి నలిఁగావించు**
**నించు మించు లాడు నించుమించు**
**బాపు! 'లేమ నగవు చూపు' లేమనవచ్చు?**
**జగమెరుంగు దాని జగమెఱుంగు**

సరం మాకు లేదు! మీరు చేసేపని.. మన్మథ బాణం చేసేపనిని మేమే చేసేస్తాం అని చెప్పడం అన్నమాట. అంతేనా? ఆ చూపులు మెరుపులతో కూడా ఆటలాడతాయట. ఇంచు= మనోహరమైన, మించు= మెరుపును, ఇంచుమించులాడు= ఎక్కువ తక్కువలు చేశాయి. అంటే తిరస్కరించాయి. ఇక ఆ సుందరి నవ్వు, చూపుల్లోని అందాన్ని చెప్పడం నావల్ల కాదయ్యా! జగ= ప్రశస్తమైన, మెరుంగు= లావణ్యం, జగమెరుంగు= లోకానికి బాగా తెలిసిందే!



సంచు, గావించు, ఇంచు మించు, ఇంచు మించు .. లేమ నగవు .. లేమనవచ్చు. జగ మెరుంగు.. జగమెఱుంగు.. అంటూ యమకాలంకార ప్రయోగాలు పద్యానికి కొత్త సోయగాన్ని సమకూర్చాయి. ఇక అర్థం పరంగా కూడా అంతటి ప్రయోజనాన్ని సాధించారు కవిగారు.

సుభద్ర చూపులు, సౌందర్య వర్ణనం ఈ పద్యం! బాబోయ్! సుభద్ర చూపుల్ని ఏమని వర్ణించగలం! పద్మం మన్మథుని బాణమని తెలిసిందే! ఆమె చిరునవ్వుతో కూడిన చూపులు ఆ పద్మం విలాసంలోని అందాన్ని నలిపిపారేశాయి. సంచు= అందం! మీ అవ

స్థూలంగా పద్యం భావం- సుభద్ర చూపులు మదనుని బాణాలు.. తామరసాక్షి అని. మబ్బులో మెరుపులు! ఇక లావణ్యమంటావా? మాటలతో వర్ణించలేం! అది లోకానికి తెలిసిందే!

నలినలీల.. ఇంచుమించు అనే రెండు విషయాలను అవే పదాలతో నలినలి కావించు, ఇంచుమించులాడు అని అంటే తిరస్కరించినట్లు, జగమెరుగును జగమెరుంగు అని చెప్పడం ఇక్కడ చమత్కారం!

-సేకరణ: చంద్రప్రతాప్

కన్నమ్మరా ॥ ఆది ॥
కొండ కోనలా గుండెల్లో తిరుగాడె
లంబాడి కోయల్ల పుట్టిల్లురా ॥ ఆది ॥
ఎండల్లో అలసిన ఎన్నెన్నో గుండెల్ని
చల్లబరిచిన నీళ్ళ రంజనురా ॥ ఆది ॥
ప్రాణహితా నాది గోదారి అలలాకు
ఒడిలోన నడకల్ని నేర్పిందిరా ॥ ఆది ॥
పచ్చీక పైరూల పచ్చాని అడవుల్ని
తలమీద కురులోలె
ముడిసిందిరా ॥ తల ॥
లేలేత చిగురూల నిలిచిన వృక్షాల
వనదేవిగా
పేరు మోసిందిరా ॥ ఆది ॥

దేవి కంఠం అలలు అలలుగా ఆ అడవిలో మారుమోగుతోంది. కోరస్ పాడే ఆడ మగ గొంతుల బృందగానం ప్రతి మనిషి చుట్టూ తిరుగుతోంది. లయగా వాయిద్యాలు మోగుతున్నాయి. బహుశా దేవి నృత్యం చేస్తున్నదేమో?

ఆ కంఠస్వరానికి, సాహిత్యానికి కాదు - ముఖ్యంగా అడవిలాగా అద్భుత లావణ్యంతో, మార్మికతతో - మనిషితనంతో పాటే దేహం - దేహమే పాటైన ఒక గద్దరులా, గోరేటి వెంకన్నలా, విమలక్కలా - లయగా కదులుతున్న దేవి - దేవితో పాటు ఆదివాసి యువకుల బృందగానానికి అక్కడి మనుషులంతా, తడిసి ఊగిపోయారు. కొంతమంది ఆ పాట విషాదం కాకున్నా కళ్ళల్లో నీళ్ళు నింపుకున్నారు. తట్టుకోలేక అరిచారు. కేకలు వేశారు. నినాదాలిచ్చారు.

"కల్లే నర్కార్ తోడింగే.." ఎవరో అరిచారు.

"తోడింగే.. తోడింగే.." వందల కంఠాలు పిడికిలెత్తి బదులు పలికాయి.

దేవి పాట - ఆట అక్కడ అట్లాగే కొనసాగుతుండగానే విద్యాసాగర్‌రావుకు తన గురించి - తను ఈ స్థాయికి రావడానికి పడ్డ తపన, నిచ్చెన ఎక్కడానికి ఆడిన నాటకాలు, తన వాళ్ళతో, ప్రత్యర్థులతో పన్నిన కుట్రలు, కుతంత్రాలు అన్నీ మనసులో పోటెత్తాయి. 'ఆ చీకటి పనుల గురించి మనస్సు విప్పి ఎప్పటికైనా, ఎవరికైనా చెప్పుకోగలడా?'

దేవి జీవితం కుట్రలు, కుయుక్తులు లేని తెరిచిన పుస్తకం, అడవిలాగా. అడవి రహస్యాలు తెలుస్తాయా? అఫ్‌కోర్స్ - ఛీ.. ఛీ తనకు ఏమైంది?

4

ఇంతలో దక్షిణం వైపు ఊరి నుండి దుమ్ము రేపుకుంటూ ఒక బొలెరో కారు వచ్చి హోటల్ గుడిసె దగ్గర ఆగింది.

అందులో నుండి ఆరడుగుల జగన్ రావు దిగాడు. పెద్ద పెద్ద అంగలేస్తూ విద్యాసాగర్ రావు దగ్గరికొచ్చి "రండీ! స్వర్ణ ఫోన్ చేసింది. మీరిక్కడ ఇరుక్కపోయి ఎంత సేపయ్యింది?" అంటూనే రింగయిన ఫోనెత్తి..

"ఆ..! గుర్తు పట్టిన. నన్ను మీరు గుర్తు పట్టరు కాని నాకందరు తెలుసు. నువ్వు వర్రీ గాకు. నేను చూసుకుంట" అని ఫోను కట్ చేశాడు.

నలిగిన బట్టలు, గరుకు తేలిన ఒళ్ళు. అక్కడక్కడ నెరిసిన జుట్టు, పెద్ద కండ్లు. జగన్‌రావు కేసి చూసి విద్యాసాగర్ రావు అతని వెంట నడిచి - బొలెరోలో ఎక్కబోతుండగా శివశంకర్, శ్రీను గుర్తొచ్చారు. అప్పటికే శివశంకర్, శ్రీను బొలెరో దగ్గరికి

పరుగెత్తుకొచ్చారు.

శివశంకర్ గుర్తుపట్టి జగన్ రావుకు నమస్కారం చేశాడు.

"ఇంక గంటదాకా క్లియర్ గాదు. అందాకా మీ సారును మా యింటికి తీసుకపోత - మీరూ వస్తారా? " అడిగాడు జగన్‌రావు.

విద్యాసాగర్‌రావుకు ఇష్టం లేదు. అది అతని ముఖంలో తెలుస్తోంది.

"మేమిక్కడే ఉంటం సార్! క్లియిర్ కాగానే - సార్ దగ్గరికి వస్తం.."

"నాకు తెలిసి ఇప్పుడప్పుడే క్లియర్ కాదు. ఇక్కడంతే - ఒకవేళ అయితే రింగియ్యి. నేను తీసుకొచ్చి మీ సార్‌ను వొదిలిపెడుత" అంటూ డ్రైవింగ్ సీట్లో జగన్ రావు ఎక్కి కూర్చున్నాడు.

డ్రైవర్ శ్రీను వొచ్చి బొలెరో డోర్ తెరిచాడు యం.డి. కోసం.

అప్పటిదాకా ముడుచుకుపోయిన ముఖంలోకి కొంచెం తెచ్చిపెట్టుకున్న మర్యాదతో విద్యాసాగర్ రావు కారు ఎక్కి కూర్చున్నాడు.

బొలెరో కదిలింది. రోడ్డుకు ఇరుపక్కల నిలబడిన ఆదివాసుల మధ్యలో నుండి దుమ్ము రేపుకుంటూ దక్షిణం వేపు ముందుకురికింది.

"మీకు ఈ వాతావరణం, మనుషులు కొత్త కదా। గజిబిజిగా ఉంటుంది. అయినా ఇప్పుడు ఈ జిల్లాలో మునుపటంత టెన్షన్ లేదు. ఒకప్పుడైతే రాత్రి నక్సలైటు దళాలు, పగలు పోలీసు పెట్రోలింగు. ఎన్‌కౌంటర్లు - దాడులు.. ఊళ్ళల్లో - అడవుల్లో ఒకరినొకరు చంపుకోవడాలు తగ్గినయ్.." జగన్ రావు ఏకపక్షంగా చెప్పుకపోతున్నాడు.

"ఔనా మామయ్యా? " అన్నాడు, ఆ ఉద్విగ్న వాతావరణం నుండి బయటపడ్డందుకు కొంత రిలాక్సయ్యి విద్యాసాగర్ రావు మాట కలుపుతూ..

"బలే గుర్తుపట్టావే - గుర్తున్ననన్న మాట.."

విద్యాసాగర్ రావుకు అంతా కలలాగా ఉంది. రోడ్డుకు తూర్పు వేపు కనుచూపు మేరదాకా వరి పొలాలు కలకలలాడుతున్నాయి. మధ్యలో అక్కడక్కడ మక్కజొన్న పెరండ్లున్నాయి. పెరండ్ల పీసుమీదున్నాయి. రోడ్డు వేపు చాలా చోట్ల దడులు కట్టి, దడులకు రంగు రంగుల చీరెలు కట్టారు. పడమర వేపు అడవి - కొద్దిగా పలుచగా ఉన్నది.

"ఎడమ వేపు పొలాలన్నీ మనవే. వేసంగి పంట. మక్కజొన్న కూడ. రెండో పంటే. మే దాకా కడెంకాలువ నీళ్ళు పారుతాయి.. అడవి పందుల గుంపులు రాత్రి పూట పొలంలో పడ్డవంటే అంతే! మొత్తం తొక్కి పోతాయి.. ఆ రంగు రంగుల గుడ్డలు చూస్తే అడవి పందులు భయపడి పారిపోతయ్. ఈ అడవిలో పులి సంగతే మోగాని గుడ్డేలుగులు ఎక్కువ" జగన్ రావు ప్రశ్నలు, జవాబులు తానే చెబుతున్నాడు. మనిషిని చూస్తే మాట్లాడటానికి మొహం వాచిపోయిన వాడిలాగున్నాడు.

విద్యాసాగర్ రావు - ధర్నా - అక్కడి టెన్షన్ - దేవి విశ్వరూపం - సుళ్ళు తిరిగే పాట - అల్లకల్లోల స్థితి నుండి - మళ్ళీ ఈ పంట పొలాల మీదుగా - అతనితో పాటు ఊరిలోకి ప్రయాణం.. ఇప్పుడు జగన్‌రావు మాటల ప్రవాహం.. ఈ గోలంతా ఎందుకు? తను మౌనంగా ఉంటే సరిపోతుంది. అయినా మర్యాద కాదేమో? తనకు అలవాటు లేని స్థితుల్లోకి ఇంత తొందరగా మారడం కష్టమే.

"మాట్లాడరు? "

"నాకు ఇదంతా అయోమయంగా ఉన్నది" విద్యాసాగర్ ఏమనాలో తోచక..

జగన్‌రావు పెద్దగా నవ్వెండు. "లైఫంతే. దాని గురించి ఆలోచించకపోతే - అదట్లా గడిచిపోతుంది. కాని ఆలోచిస్తే అంతు బట్టది.. యూ నో - నేను రామాయ




ణాన్ని, భారతాన్ని ఈ ఒంటరి పల్లెటూర్లో ఎన్నిసార్లు చదివానో? రామాయణం, భారతం నిండా ఆదివాసీలతో గొడవలే. బహుశా అప్పుడు మునులు.. విశ్వామిత్రుడు లాంటి వాళ్ళు మనలాంటి భూస్వాములై ఉంటారు. అంతు బట్టదు. యూనో ఇవన్నీ అంతిమంగా ప్రాపర్టీ గొడవలే. ఆదివాసీలకు వాళ్ళలో వాళ్ళకు మనంత గొడవలు లేవు. కాని మనతో వాళ్ళ కొట్లాట కూడా బతుకుతెరువు కోసం. అడవి కోసం. మనకేమొ అడవి ప్రాపర్టీనే.."

విద్యాసాగర్‌రావు అదిరిపోయాడు. అసంబద్ధంగా రామాయణ, భారతాలు.. బహుశా ఇతను ఈ రిమోటు అడవి అంచు పల్లెటూల్లో ఇంట్లో అందరూ హత్యకు గురైనా కూడా ఇన్నేండ్లు బ్రహ్మచారిగా, ఒంటరిగా ఉండి - క్రమంగా మ్యాడ్ కాలేదు కదా। బాప్‌రే! - స్వర్ణకు బుద్ధి లేదు. ఇంత కన్నా అక్కడ జరిగే టైగర్ జోన్ ధర్నాలో ఉండిపోతేనే బెటరేమొ? కాని తప్పదు.. బయలుదేరిన తరువాత విచారించి ప్రయోజనమేమిటి?

ఇంతలో ఊరొచ్చింది. ఊరు పెద్దదే. రోడ్డుకిరువైపుల కొత్తగా కట్టిన చిన్న చిన్న బిల్డింగులు - మధ్యలో పాత పెంకుటిండ్లు - ఊరు పాత కొత్తల మిశ్రమంగా ఉంది.



కారు రెండు నిమిషాల తరువాత ఆగింది. ఊరు చివరకు చేరుకున్నారు. జగన్ రావు డోరు తెరుచుకొని కిందికి దిగిండు.

విద్యాసాగర్ రావుకు ఏమి చేయాలో అర్థం కాలేదు.

"దిగండి-" అన్నాడు పొడి గొంతుతో - జగన్ రావు.

విద్యాసాగర్ రావు విధిలేక తనే డోరు తెరుచుకొని కారు దిగాడు. ఎండ ముదిరి పోతోంది. దిక్కులు చూశాడు. కారు మట్టి రోడ్డు మీద ఆగి ఉన్నది. దూరంగా దక్షిణం వైపు బోడి గుట్టలు. మధ్యలో గోదావరి. గోదావరిలో సన్నగా ఎక్కడో నీళ్ళ ధార తెల్లగా కన్పిస్తోంది.

"అటు చూడండి.. అది గోదావరి.. గోదావరి ఆవల కరీంనగర్ జిల్లా జైన ఊరు. ఆ ఊళ్లో కోమట్లే ఎక్కువ. ఒక ప్పుడు కోటీశ్వరులు. నక్సలైట్లు దాడి చేసి నగలు, బంగారం ఎత్తుకపోయిండ్లు - ఆ ఒడ్డు మీదుగా పోతే దొంతాపూర్, రాజారాం పల్లె, ధర్మపురి.. ఈ పక్క గోదా వరి గంగొడ్డు మీది నుండి గూడెం దాకా ఒకప్పుడు మాయే భూములుండే-" చెప్పా డు జగన్ రావు.

విద్యాసాగర్ రావుకు ఇట్లాంటి విష యాల మీద అసలు ఆసక్తి లేదు. ఈ స

మయంలో అసలే లేదు. తమ బాల్యం గడిచిన పల్లెలంటే ఎలర్జీ - ముఖ్యంగా తన లేమి. ఆ కొట్లాటలు, పంచాయితీలు, మూర్ఖపు హత్యలు. డబ్బు సంపాదనకు అంత మొరటుతనం అవసరమా?

"ఇంతకూ ఇక్కడ భూముల ధరలెట్లు న్నయి? " ఏదో మాట్లాడాలని విద్యాసాగర్ రావు - దుమ్ము నిండిన రోడ్డు మీద నిల బడి - గోదావరి నదిలోకి చూస్తూ.

గోదావరిలో ఇసుక నిండిన రోడ్డు మీద ఆవలి ఒడ్డుకు దగ్గరగా నీళ్ళధార సన్నగా పారుతోంది.

"గోదావరి ఒడ్డుకు మూడు లక్షలకు ఎకరం. మనం ఇందాక దాటి వచ్చిన రోడ్డు మీద అయిదు నుంచి ఎనిమిది లక్షలు - అదే జన్నారం వెళ్ళే మేన్ రోడ్డు మీదనైతే పది నుండి పదిహేను లక్షలు"

"మీకెంత భూమున్నది? "

"అంతా పోయింది. ఇప్పుడు మూడువం దలయాభై ఎకరాలున్నది.."

"అంతా కాస్తు చేస్తున్నర? "

"ఆ.. నేనే వ్యవసాయం చేపిస్తున్న" జవాబు చెప్పి, "రాములు నాయక్..!" అని బిగ్గరగా పిలిచాడు జగన్‌రావు.

కుడివేపున, పేదలకు ప్రభుత్వం కట్టిం చిన చిన్న డాబా యింటిలో నుండి ఒక ఎర్రటి యువకుడు బయటకు వచ్చాడు.

"ఇంటికి రా! అర్జంటు-" చెప్పాడు.

సరేనంటూ రాములు నాయక్ తన ఇంట్లోకి వెళ్లాడు.

"వాడు కుక్ - లంబాడా. ఎక్సలెంట్ కుక్! నేను మిలిట్రీలో కొన్ని వందల ప్రాంతాలు - వందల కుక్‌లను చూసిన - బట్ - వీడు ఎల్లిపాయ, జీలకర్రతోని వంటలో మిరాకిల్ చేయగలడు. కొన్ని ఫీలింగ్స్ మనం మాటల్లో చెప్పలేం.." అంటూనే కారెక్కాడు.

విద్యాసాగర్ రావు విధిలేక తను కూడా కారెక్కాడు. కారు మెల్లిగ వెనుదిరిగి వచ్చిన రోడ్డు మీద వెళుతోంది. ఊళ్లో ఎక్కువమంది కన్పించలేదు. పనుల మీది కెళ్లారేమో? ముసలి ముతకా ఇండ్లల్లో కూర్చున్నారేమో?

తనకు రుచి తెలియదు. అనివార్యంగా తినడమే కాని - ఇష్టంగా.. ఆస్వాదిస్తూ తిన్న గుర్తు లేదు.

కుడిపక్క హరిజన హాస్టల్ - ఎడమ పక్క హైస్కూలు.. ఎత్తు తక్కువ గల పెంకుటిండ్లతో - చాలా పురాతనమైనదని తెలుస్తోంది. స్కూలు పిల్లల రొద వినిపి స్తోంది. కారు స్కూలు దాటేసింది.

"యూనో - ట్రైబల్స్ - దే నో రియల్ స్పిరిట్ ఆఫ్ ది ఫుడ్.. కంక బొంగు కంట్రీ చికెన్ మీరెప్పుడైనా ట్రై చేశారా? " జగన్‌రావు.

'తను బయలుదేరిన పనేమిటి? ఇక్కడ ఇట్లా ఈ అసంబద్ధ మాటలేమిటి? రియల్లీ అబ్సర్డ్ అంటే ఇదేనా? ' అనుకు న్నాడు విద్యాసాగర్ రావు.

కారు స్లో చేసి కుడికేసి తిప్పాడు. కలాపి చల్లి, ముగ్గులు పెట్టిన పెద్ద పందిరి కింద కారు నిలిచిపోయింది.

జగన్‌రావు కారు దిగి వెనక్కి నడిచి ఎటో వెళ్లిపోయాడు.. విద్యాసాగర్ రావు కారు దిగాడు. రోడ్డుకవతల వరుసగా వేప చెట్లున్నాయి. వేప చెట్లకావల రోడ్డు కెదు రుగా గడీని పోలిన రెండంతస్తుల పురా తన ఇల్లు - తన ముందున్న ఇల్లు అతి పురాతనమైన గడి - రోడ్డు వైపు చిన్న చిన్న కిటికీలతో యాభై అరవై గజాల పొడవున్న పెంకుటిల్లు - దానినానుకుని ఎ త్తయిన ప్రహరీ గోడ సాగి మధ్యలో పెద్ద రేకు తలుపులు - మళ్లీ ఉత్తరం వేపు సాగింది. ఉత్తరం వేపు ప్రహరీ గోడ లోపల వరుసగా బెంగళూరు పెంకులతో కట్టిన ఆరు ఇండ్లు ఎదురుగా.

రోడ్డుకవతల మూసి ఉన్న పాత ఇల్లు, వారి తండ్రి పేరు మీద హాస్పిటల్‌కు

ఇచ్చినట్లున్నారు. స్మారక హాస్పిటల్! అయితే పాతకాలందే! తను ఇదివరకు ఎప్పుడూ ఇక్కడికి వచ్చిన గుర్తులేదు, విద్యాసాగర్ రావుకు.

కారు ముందున్న ఇంటి దరువాజ లోపలి నుండి తెరిచి "రండీ! అల్లుడు గారు!" అన్నాడు జగన్‌రావు.

విద్యాసాగర్‌రావు కొంచెం దూరం నడిచి - నిలబడే బూట్లు విప్పి పొడవాటి గది లోకి అడుగు పెట్టాడు.

"నా చిన్నతనంలో ఈ దారి మట్టి రోడ్డు, సిమెంటు రోడ్డేసి ఆరేండ్లయింది. ఈ దారంట చెప్పులేసుకొని ఎవరూ నడిచే వాళ్లు కాదు. అటూఇటూ వంద గజాల దూరంలో చెప్పులు విడిచి కనపడకుండా చంకలో పెట్టుకొని ఇల్లు దాటగానే మళ్లీ వేసుకునేవారు. మా నాన్నకు ఎదురుపడితే పులిని చూసిన జంతువుల్లాగా ఎటు వాళ్లటే పోయేవారు. అదో కాలం!" జగన్ రావు పొడుగ్గా నిట్టూర్చాడు.

తిరిగి అతనే "రండి, ఇలా కూర్చోండి" అదో విధమైన గొంతుతో అని, సోఫా చూపించాడు.

విద్యాసాగర్ రావు మౌనంగా అతన్ని అనుసరించాడు.

"పనివాళ్లంతా వెళ్లిపోయి అరగంట య్యింది. మళ్లీ సాయంకాలం మూడు గంటల తరువాత వస్తరు" జగన్‌రావు చెప్పి, లోపలికి వెళ్లిపోయాడు.

విద్యాసాగర్ రావు సోఫాలో కూర్చున్నాడు. పైనుండి చూస్తే అంత తెలియ లేదు గాని, ఆ గది విశాలంగా, పొడుగ్గా ఉంది. మాగిన టేకు కర్రతో చేసిన సోఫా సెట్లు రెండున్నాయి. కుషన్లు చాలా పాతవి. తను కూచున్న సోఫా మీద జింక చర్మం పరిచున్నది. సోఫా పక్కన ఎప్పుడో వేటాడిన పులిని లోపలదంతా వొలిచి పులిలాగే కర్రస్టూలు మీద నిలబెట్టారు. ముసలాయన మంచి వేటగాడంటారు. 'ఈ రోజు ఎక్కడికి వెళ్లినా పులి తనను వెంటాడుతోంది' విద్యాసాగర్ రావు అనుకున్నాడు. ఎదురు సోఫాకు ఎడమవైపు దుప్పి కొమ్ములు గోడకు చెక్కతో బిగించి ఉన్నాయి.. చచ్చిన జంతువుల కళేబరాల వాసన ఆ గదిలో అదివరకే ఉన్నట్టు అన్పించింది.

బాపురే - గోడకు తైలవర్ణ చిత్రం. దానికి వేలాడే పెద్ద దండ. ముసలి పులి లాగున్నాడు. పెద్ద పెద్ద కండ్లు- మీసాలు కత్తిరించి ఉన్నాయి. బంగారురంగు బట్టలు.. మనిషి ఎండలో తళతళలాడే పులిలాగున్నాడు. మంచి అందగాడు.. అతనే జగన్‌రావు తండ్రి.. ఒకప్పుడు ఈ చుట్టూ యాభై ఊళ్లలో, గూడేలల్లో అతను వేటాడే పులి..!

జగన్‌రావు వచ్చి ఎదురుగా సోఫాలో కూర్చున్నాడు. అతను పైకి ఏదో మాట్లాడుతున్నాడు కానీ లోలోపల చాలా అన్‌రెస్టుగా, ఉద్విగ్నంగా ఉన్నట్టే అన్పించింది.

"అల్లుడుగారూ! మీరు వయసులో నాకన్నా చిన్న - నిజానికి మీ ముందు నేనిట్లా మాట్లాడకూడదు. కానీ నేను మన బంధువర్గంతో పూర్తిగా సంబంధాలు తెంపుకొని చాలా ఏండ్లయ్యింది. నేను సాధారణంగా మన కులపోల్లను కలవను. దానిక్కారణం ఒకటి పాత గాయాల్ని కెలుకుతరు. అడిగినా అడగకపోయినా వాళ్ల అభిప్రాయాలు చెబుతరు. పాత మోడల్ సొసైటీ కాదిది. నాన్సెన్స్ ఎక్కువ మాట్లాడుతరు. రెండో విషయం నేనెందుకు పెండ్లి చేసుకోలేదనేదాన్ని ఎన్ని రకాల పీకవచ్చునో అన్ని రకాల పీకి.." అర్థాంతరంగా ఆపేసి కొంచెంసేపు మౌనంగా ఉండి, మళ్ళీ "బట్ అది కూడా కారణం కాకపోవచ్చు నేను దొరలతో కలువలేకపోతున్నానేమో? మే బి అయామ్ డెమోక్రాట్.." అన్నాడు డెమెక్రాట్ అనే పదాన్ని ఒత్తి పలుకుతూ.

"నీ గురించి విన్న - యూ ఆర్ బ్రిలి

యంట్.. వ్యాపారవేత్తవు. మీకొక విషయం చెప్పాలి. ఆ కాలంలో ఈ మొత్తం జిల్లాలో నేనొక్కన్నే మన కులంలో డాక్టరు చదివింది. ఆ కాలపు దొరలల్లో మీ స్వర్ణ వాళ్ల తాత తెలివై నోడు. చదువు గురించి తెలిసినోడు. మీ అత్తయ్యను మొదట నాకు ప్రపోజ్ చేసిండ్లు- అప్పుడు మా ఖాందానీకి మీ తాతయ్య ఖాందానీకి ఏవో గొడవలు - నాకు పెద్దగా తెలియవు. అది కుదరలేదు. నాకు మొదటి నుండి మిలిటరీలో పని చెయ్యాలని ఉండే. మెడిసిన్ చదివేట ప్పుడు రాష్ట్రీయ స్వయం సేవక్‌లో చాలా కాలం పనిచేసిన. పెళ్లంటే అసహ్యం.. దేశభక్తి.. దేశం కోసం బ్రహ్మచారిగా ఉండాలని నాయకులు చెప్పేవాళ్లు.. ఆ రోజుల్లో దొరల పిల్లలు.. ముఖ్యంగా యువకులు ఎక్కువగా ఆర్.ఎస్.ఎస్.లో చేరేవాళ్లు. కింది కులాలవాళ్లు పి.డి.యస్.యు., రాడికల్స్‌లో చేరేవాళ్లు. యం.బి.బి.యస్. అయిపోగానే మిలిట్రీలో చేరి మొదటి పోస్టింగ్ కాశ్మీర్‌ల అపాయింట్ మెంట్ అయి వెళ్లిపోయిన. తరువాత అరుణాచల్ ప్రదేశ్‌లో పని చేసిన.."

జగన్‌రావు ముఖంలో ఏదో వెలుగు! ఎక్కువ మాట్లాడుతున్ననేమో అనుకున్నా డేమో.. కాసేపు మౌనంగా కూచున్నాడు.

విద్యాసాగర్ పరిస్థితి ధర్నాలో లాగే ఉంది. ఈ రోజంతా ఇలాంటి చిత్ర విచి త్రమైన మనుషుల ముందు - తనకు తెలి యని, ప్రవేశం లేని అనేక మాటలు, చర్చ లకు లోను కావాల్సి వస్తోంది. మర్యాద పూర్వకంగానైనా ఏదో ఒకటి మాట్లాడా లన్నా - ఆ వాతావరణం - జగన్‌రావు అందుకు అవకాశం ఇవ్వకపోవడం - చొర వచేసి ఏదన్నా ఎట్లా మాట్లాడాలో కూడా తెలియడం లేదు. తన బాల్యం పల్లెటూరి లోనే మొదలైనా లేమిలో గడిచింది గనుక ఆ జ్ఞాపకాలు తుడిచేసుకున్నాడు. చెప్పుకో వడానికేమీ లేదు.

"ఎట్లా ఉంది మీ ఇండస్ట్రీ ప్రోగ్రెస్? చెప్పండి" అడిగాడు జగన్‌రావు.

"మామూలే - కొత్తది పెట్టడం ఈజీ - పాతది తీసుకున్నాం కదా! వెరీ రిచ్ ఎక్స్ పీరియన్స్!"

"ఔనా? మన జిల్లాలో కోర్ ఇండస్ట్రీలో మన కులం నుండి మీరే మొదటగా ఎంట రయ్యారు"

"అదీ నిజమే!"

"సిటీలో మనవాళ్లు అన్ని రంగాలలోకి చాలా ఎక్స్‌పాండయినట్టు వింటున్న. మా అన్న కొడుకు బిల్డర్ - ఏడాదికి చాలా వెంచర్లు చేస్తడు. అల్లుడు సాఫ్ట్‌వేర్ కంపెనీ పెట్టిండు. వాళ్లు బాగున్నరు. అయితే నన్ను పెట్టుబడి పెట్టమంటరు. ఏం చేసుకోవాలి? మీకో విషయం తెలుసా? మన ప్రాంతంలో నక్సలైట్ ఉద్యమాలు లేకపోతే ఇంకా రెండు వందల సంవత్సరాలు మనం పల్లెటూళ్లను వదిలిపెట్టే వాళ్లం కాదు. వాళ్లు మొర టుగా, హింసాత్మకంగానైనా కుళ్లిపోయి గిడుస బారిన సమాజానికి ఒక కుదుపుని చ్చారు. నిజంగా వాళ్లకు థ్యాంక్స్ చెప్పాలె. అయితే ఆ తాకిడికి మొదట మొత్తం బలై పోయింది మా కుటుంబం. ఇది ఈ ప్రాంతం వాళ్లకు, ముఖ్యంగా దొరలకు గుణపాఠమైంది. ఆ తరువాత గడీలన్నీ ఖాళీ అయినయ్. అందరూ పట్నాలలోకి వెళ్లి బిజినెస్.. ముఖ్యంగా రియల్ ఎస్టేట్‌లో సెటిలయ్యింద్రు"

"ఇన్ని తెలిసిన వాళ్లు - మీరు ఈ పల్లె టూళ్లోనే సెటిలయిపోయింద్రు - మళ్లీ డాక్టరుగా ప్రాక్టీసు పెట్టలేదా?" విద్యాసా గర్ రావు అనుకోకుండా అడిగిండు. జగన్ రావుకు కోపం వస్తుందేమో అనుకున్నాడు.

జగన్ రావు ఆ మాటకు జవాబు చెప్ప లేదు. అంతలోనే వంటమనిషి రాములు నాయక్ హాలులోకి వచ్చిండు.

"ఆక్సిడెంటల్‌గా అల్లుడుగా మీరు మా ఇంటికొచ్చిండ్రు. లంచ్ చేసి పోండ్రి. మీ వాళ్లను పిలుద్దాం. ఎట్లాగు లంచ్ టైం అయింది. యు విల్ రియల్లీ ఎంజాయ్ అవర్ ఫుడ్ - కంట్రీ ట్రైబల్ ఫుడ్. ఒక గంటలో చేస్తడు కుక్.." జగన్ రావు.

"వద్దు.. ఈసారి నేను, స్వర్ణ కలిసి వస్తం. రెండు రోజులుంటం. నాకిప్పుడు టెన్షన్‌గా ఉన్నది. కలెక్టర్‌తో మైనింగ్ లీజ్ రెన్యూవల్ ఫైలు క్లియర్ చేయించాలి. మైన్స్ మూతపడ్డాయి. పాత స్టాకుతో ఫ్యాక్టరీ అరకొరగా నడిపిస్తున్నం. ఏమనుకోవద్దు" విద్యాసాగర్ రావు.

"నేను ఒకసారి కలెక్టర్‌తో మాట్లాడనా? " జగన్‌రావు.

"వద్దు. వాడసలే ఇగోయిస్ట్ - పని మరింత లేటు చేస్తడు"

"సరే మీ ఇష్టం. మీకు మూడు లేనట్టున్నది. టెన్షన్‌లో ఉన్నరు. పోనీ లైట్‌గా బ్రేక్‌ఫాస్ట్ చెయ్యండి. స్వర్ణ చెప్పింది. మీరు వర్రీ అవుతున్నరని"

రాములుతో కలిసి జగన్‌రావు లోపలికి వెళ్లాడు.

హఠాత్తుగా ఆ గది మూగపోయినట్లనిపించింది.. ఇందాక ఆపేసిన ఫొటోలు చూడసాగిండు. వాళ్ల నాన్న పక్కనే నలుగురు కొడుకుల గ్రూప్ ఫొటోలు. అందులో జగన్‌రావును గుర్తుపట్టాడు. ఆ తరువాత ముగ్గురు అన్నదమ్ముల విడివిడి తైలవర్ణ చిత్రాలు. వాటికి శ్రీగంధం చెక్క పొట్టుతో చేసిన దండలు వేసి ఉన్నాయి. 1976లో ఈ గోదావరి ఒడ్డు గ్రామంలోని ఈ ఇంటిమీద రెండుసార్లు నక్సలైట్లు దాడి చేశారు. రెండుసార్లూ ఒకే వ్యక్తి కోసం దాడి చేశారు. మొదటి దాడిలో - వాళ్ల టార్గెట్ చేసిన వ్యక్తి జగన్ రావు పెద్దన్న దొరకలేదు. ఆ దాడి సీన్ చూసి తండ్రి గుండె ఆగి చనిపోయాడు. మళ్లీ నెల

## చతుర ప్రవేశిక

**డిసెంబరు చతుర చదివారా?**

ఈ ప్రశ్నలకు ఒక్క మాటలో జవాబు రాసి బహుమతి పొందండి. ఎక్కువమంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి విజేతలను ఎంపికచేస్తాం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

| | |
|---|---|
| 1. భీంరావు భార్య? | 6. మీరా కొత్త ఉద్యోగానికి జీతం? |
| జ. | జ. |
| 2. ఆదివాసీల ధర్నా దేనికి వ్యతిరేకం? | 7. పరశురామయ్యకు ఎందరు పిల్లలు? |
| జ. | జ. |
| 3. జగన్‌రావుకు విద్యాసాగర్ ఏమవుతాడు? | 8. ఇందిర భర్త? |
| జ. | జ. |
| 4. విద్యాసాగర్ రావు డ్రైవర్? | 9. 'సరళీ స్వరాలు' నవలా రచయిత్రి? |
| జ. | జ. |
| 5. కళ్యాణి భర్త? | 10. మిక్కీమౌస్ సృష్టికర్త? |
| జ. | జ. |

పంపినవారి పేరు: ------------------------------------------వయసు (    )

చిరునామా: ----------------------------------------------------

--------------------------పిన్‌కోడ్ :            ఫోన్ నెం :

**చిరునామా** : సంపాదకులు, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజీగూడ, హైదరాబాద్- 82

ఫోన్ : 04023318181, Ex: 6658, 6532

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

గడువు తేదీ 17

మాసికం రోజు రెండోసారి జరిగిన దాడిలో అసలు వ్యక్తి దొరకలేదు. ఈ గొడవలకు సంబంధం లేని ముసలాయన కొడుకులిద్దరిని చంపారు- అడ్డం వచ్చిన మరొక వ్యక్తిని హత్య చేశారు. వర్గ శత్రు నిర్మూలన కార్యక్రమంలో భాగంగా జరిగినట్లు చెప్పుకున్నారు. తరువాత తప్పు జరిగిందని క్షమాపణ చెప్పారు. వర్గ శత్రు నిర్మూలన కార్యక్రమం ప్రజా ఉద్యమాలు నిర్మించకుండా చేయడం అది ఒక దుందుడుకు పద్ధతిగా చెప్పుకున్నారు. ఏది ఏమైనా దాని ఫలితాలు ఆ కుటుంబం అనుభవించింది. తమ కుటుంబాలలో ఈ హత్యలను ప్రతిచోటా చెప్పుకునేవారు. తన భార్య తరపు కుటుంబంలో ఇదొక పెద్ద చర్చ!

జగన్‌రావు కాన్వొకేషన్‌లో డాక్టర్ పట్టా పుచ్చుకునే ఫొటో ఒకటి గోడకు వేలాడుతోంది. పైకి చూస్తే కప్పు బూజులతో నిండిపోయి ఉన్నది. తనకు శకలాలుగా తెలిసిన ఈ కుటుంబం విషాద నిష్క్రమణం గురించి గుర్తుకు తెచ్చుకోవడానికి ప్రయత్నం చేశాడు. ఎందుకో నిలువెల్లా దిగులు కమ్మేసింది. ఆనవాయితీ ప్రకారం గోడలకు ఆడవాళ్ల ఫొటోలు లేవు.

జగన్ రావు హాల్లోకి వచ్చి "రండి, లోపలికి రండి!" అన్నాడు.

విద్యాసాగర్ రావు లేచి అతని వెంట నడిచాడు. ఆ గదిలో కొంచెం దూరం ముందుకు పోతే చెక్కమెట్లున్నాయి. చెక్క మెట్ల మీదుగా జగన్ రావు ముందుకు నడిచాడు. విద్యాసాగర్ రావు అనుసరించాడు. పైన విశాలమైన గది.

"ఇది మా నాన్నగారు చాలాకాలం బెడ్ రూంగా వాడుకునేవారు.." జగన్‌రావు.

గది వాడుతున్నట్లుగా కన్పించలేదు. నగిషీలు చెక్కిన పాత అలమారాలు.. పాత టేకు మంచాలు.

## ఉత్తమ సమీక్షకు ఉన్నత సోపానం!

**(పాఠకులకు నూటపదార్లు బహుమానం)**

ఈ నెల చతుర ఆసాంతం చదివారు కదా? నవలికలు, నవలావలోకనం, కాలాతీతం ఇతరత్రా శీర్షికలు అన్నీ ఆస్వాదించారు కదా? ఇకనేం? మీకు నచ్చిన నవలిక/శీర్షికలు లేదా మొత్తం సంచికపై చతురలో అరపేజీ వచ్చేలా చక్కని సమీక్షను రాసి ఫొటోతో సహా పంపండి. ఉత్తమ సమీక్షకు రూ. 116/-లు బహుమానం అందుకోండి. సమీక్షతోపాటు మీ పూర్తి చిరునామా ఫోన్ నెంబరు తప్పనిసరి!
మీ సమీక్షలు మాకు చేరాల్సిన గడువు తేదీ ఈ నెల 17.

– సంపాదకులు

*నిబంధనలు : ఈ సమీక్షల ఎంపికలో తుదినిర్ణయం సంపాదకులదే. ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు. 'ఉత్తమ సమీక్ష'కు ఎంపిక కాని సమీక్షలకు వీలైతే 'మనసు ఉన్నదీ..' శీర్షికలో చోటు కల్పించే అవకాశం ఉంటుంది.*

చిరునామా : సమీక్ష, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్- 82
ఫోన్ : 040 - 23318181, Ex: 6658, 6532
e-mail: vipula.chatura@gmail.com

జగన్ రావు ఆ గది దాటి పై భాగం టెర్రెస్ మీదికి నడిచాడు.

విద్యాసాగర్ రావు అతని వెనుకే!

"ఇక్కడి నుంచి చూస్తే దక్షిణాన గోదావరి వరకు - తూరుపున కనుచూపుమేర దాకా - పడమర ఆ తాడి చెట్లు కన్పిస్తున్నాయే దానవతల మాకు మూడూళ్ళుండేవి.. తాళ్ళ తోపు పక్క అడవి - ఇటు ఉత్తరం రోడ్డు పక్క నుండి ఆదిలాబాద్ వెళ్ళే రోడ్డుదాకా మా భూములే. ఇరవై వేల ఎకరాలు. మాకు ఎనిమిది గుర్రాలుండేవి. మా నాన్నగారు ఎక్కువ భాగం గుర్రాలు కట్టిన బండిలో తిరిగేవారు. తరువాత కాలంలో జీబు - ఫ్యామిలీకి ఒక ఎంబాసిడార్ కారు. మా అన్నయ్యకు మూడు జీబులుండేవి. ఒకటి జన్నారంలో - ఒకటి లక్సెట్టిపేటలో - ఒకటి ఇక్కడ - వరి, జొన్న, మొక్కజొన్న, పత్తి.. అయిదెకరాల వైశాల్యం గల ఈ గడీ నిండా ఎక్కడ చూసినా ధాన్యమే ఉండేది.

వందమంది పాలేర్లు - వంద జతల ఎడ్లు - ఈ ఏరియాలో మొదటి ట్రాక్టర్ కొన్నది మేమే - అనేక గ్రామాల నుండి జనం వచ్చి ట్రాక్టర్‌ను చూసి పోయేవారు. ఇదంతా పైకి కన్పించేది. కాని ఈ అడవి పక్క భూస్వాములు, జబ్బ పుష్టి గల ప్రతివాడూ కర్ర దొంగలే - కొంత మంది ఆ కాలంలో కర్రతో కోట్లు సంపాదించారు. అడవిపక్క దొరలకు కర్ర బిజినెస్ చాలా పెద్దది. ఆ తర్వాత సారా కాంట్రాక్ట్ బిజినెస్.

"ఔనా!" విద్యాసాగర్ రావు దూరంగా కన్పించే పచ్చటి పంట భూములను, గోదావరిని చూసి నిట్టూర్చాడు.

"ఎక్స్‌క్యూజ్ మి!" అంటూ మధ్యలో విద్యాసాగర్ యస్.పి.కి ఫోన్ చేశాడు.

"ఇంకా కొంత సమయం పడుతుంది. సి.ఆర్.పి. బెటాలియన్ ఆల్‌రెడీ స్పాట్ దగ్గరికి బయలుదేరింది. బెల్లంపల్లి అడిషనల్ ఎస్.పి. స్పాట్ దగ్గరికి వస్తున్నారు. ట్రైబల్ పీపుల్ నమ్మదగిన వాళ్ళు కాదు.. తగిన ఫోర్సు లేకుండా ఏది చేసినా కష్టం - అది వయలెంటు టర్ను తీసుకున్నదనుకోండి - రెండు పక్కలా థిక్ ఫారెస్ట్. ఇంద్రవెల్లి అనుభవం బ్యాడ్ ఎక్స్‌పీరియెన్స్. ఇప్పుడు ఏ మాత్రం వయలెంటు టర్న్ తీసుకున్నా - వాళ్ళకో ఛాన్స్ ఇచ్చినట్టవుతుంది"

విద్యాసాగర్ రావుకు విసుగొచ్చింది. ప్రతివాడు సందు దొరికితే బోధించేవాడే.

"సూపరింటెండెంట్ ఆఫ్ పోలీసా?" జగన్ రావు.

"ఔను.."

"బేఫికరుగుండండి - నా అంచనా ప్రకారంగా ఇంకోగంట పడుతుంది" అన్నాడు.

మళ్ళీ అతనే "రండి" అంటూ మిద్దె కిందికి దిగిపోతూ.. "మిమ్మల్ని విసిగిస్తున్నానా?" అని అడిగాడు.

మళ్ళీ హాల్లోకి వచ్చారు. మరో హాలు తూరుపుకేసి.. ఆ హాలుకు అటూ యిటూ రూములు. పడక గదులున్నట్టున్నది.. ముందుకు నడిస్తే డైనింగ్ హాలు.

"ఫ్రెష్షవుతారా? రిలాక్స్ కండి. ఎడమ వేపు బాత్‌రూం ఉన్నది" జగన్ రావు బాత్‌రూం చూయిస్తూ.

విద్యాసాగర్ రావు బాత్‌రూంలోకి వెళ్ళాడు. ఖరీదైన టైల్స్. పురాతన అద్దం. బాత్ రూం శుభ్రంగానే ఉన్నది. ముఖం కడుక్కొని - అద్దంలో చూసుకున్నాడు. తన ముఖం తనకే వింతగా కన్పించింది. లోపల తనకు తెలియకుండా అనేకం దాగి ఉన్నాయి కదా! అదును చూసి బయటకు వస్తాయి కదా!

వ్యవసాయ భూమికోసం తన తండ్రి తాపత్రయం గుర్తొచ్చింది. విలువైన బట్టలు లేక, ఊళ్ళో ఏ శుభకార్యాలకూ వెళ్ళని అమ్మ గుర్తొచింది. ఇద్దరి చెల్లెండ్ల పెండ్లి గుర్తొచ్చింది. అన్నింటికన్నా దయనీ

యమైన స్థితి - ఆ పెంకుటింట్లో అమ్మ, నాన్న - తనెప్పుడో కొంత పంపుతాడు. తన ఏర్ కండీషను గదుల్లోకి వాళ్ళు రారు. తనక్కడికి పోడు, పోలేడు. తనకు బస్సు చార్జీలు లేక చెల్లి పెళ్లికి వెళ్ళలేని రోజు గుర్తొచ్చింది. సంపాదన అనే ఒక ఉన్మాదంలో ఇంత దూరం ప్రయాణం చేసిండు కాని - కూలి పోతున్నప్పుడు కుటుంబాన్ని తను నిలబెట్టలేకపోయాడు.

వంటమనిషి రాములు నాయక్ టవలు పట్టుకొని బాత్‌రూం బయట నిలుచున్నాడు. ముఖం తుడుచుకుంటూ - డైనింగ్ టేబుల్ దగ్గరికి నడిచి కుర్చీలో కూర్చున్నాడు. పెద్ద డైనింగ్ టేబుల్. రెండు గ్లాసుల్లో ఛిల్డ్ బీరు నింపి వున్నది. పాలక్ పకోడి, వేయించిన పల్లీ గింజలు, కాజు, గుండ్రంగా కోసిన ఉల్లిపాయ ముక్కలు, నిమ్మకాయ ముక్కలు, కీర దోసకాయ ముక్కలు - క్యారెట్, ముల్లంగి ముక్కలు నాణ్యమైన పింగాణి పాత్రల్లో నీట్‌గా టేబుల్ మీద సర్ది



ఉన్నాయి.

"తీసుకోండి" జగన్‌రావు డ్రింక్ ఆఫర్ చేశాడు.

"నాకలవాటు లేదు" మృదువుగా చెప్పాలనుకున్నా కుదరలేదు.

"రాము - సారుకు కూల్ డ్రింక్ సర్వ్ చెయ్యి - కోక్, స్ప్రైట్ -"

"స్ప్రైట్" అన్నాడు విద్యాసాగర్ రావు.

"మిలిట్రీలో తప్పని సరైంది. చాలాకాలం అరుణాచల్ ప్రదేశ్‌లో మిలిట్రీ డాక్టర్‌గా పనిచేసిన. అదీ తైవాంగ్‌లో, చైనా బార్డర్ - వెరీ కోల్డ్ ప్లేస్! మిలిట్రీ కోటా హాట్ ప్రతి నెలా ఉంటుంది. బహుశా ఇది లేకుంటే ఐ కాంట్ ఇమాజిన్ మై లైఫ్! పల్లెటూర్లో ఈ పాత గడీలో మందు లేకుండా.." మిగతా మాట్లాడలేదు. ఏదో చెప్పాలనుకుంటున్నాడు.. అనేకం పోటీ పడి.. ఏది ముందు చెప్పాలో తేలలేదు.

బీర్ గ్లాస్ ఎత్తి రెండు గుక్కల్లో గ్లాస్ ఖాళీ చేశాడు. రాములు గ్లాసు మళ్ళీ నింపాడు.

విద్యాసాగర్‌కు వినాలనే మూడ్ లేదు. కానీ తప్పదు. పాలక్ పకోడి అద్భుతంగా ఉన్నది.

"అంత జరిగిన తరువాత మీరిక్కడ ఉండడం సేఫ్ కాదేమొ? పైగా అడవిలో.." విద్యాసాగర్ రావు.

"అఫ్‌కోర్స్..!" కుర్చీలో నుండి లేచి కొంచెం దూరం నడిచి చేతులు రుద్దుకొని మళ్ళీ వచ్చి కుర్చీలో కూర్చున్నాడు.

"మొన్న ఫిబ్రవరిలోననుకుంట - బీహార్ నుండి ఒక అమ్మాయి వచ్చింది. తెలంగాణలో ఫ్యూడలిజం - అగ్రేరియన్ అఫ్‌స్ప్రింగ్ మీద పి. హెచ్‌డి. చేస్తున్నదట - కాని మనిషిని చూస్తే స్కాలర్‌లా లేదు. ఆక్టివిస్టులాగున్నది. వెరీ బ్రిలియంట్ - షీ బ్యూటిఫుల్ వుమెన్ అడిగేదాకా - నేను నా గురించి.. ముఖ్యంగా గత నలభై సంవత్సరాల గొడవల గురించి ఆలోచించ లేదు. ఎంతసేపూ ట్రడిషనల్‌గా..? చాలా సంవత్సరాలు గడిపాం. మనం దొరలం. ఆస్తిపాస్తులున్నవాళ్ళం - ఇంత ఫారెస్ట్ ట్రైబల్ ఏరియాలో ఆకలితో, బట్ట బాత లేక ఉన్న మనుషుల మధ్య జీవించడం.. అది అంత సజావైన విషయమేమీ కాదు. క్రూరమైన వయొలెన్స్‌తో కూడుకున్నది. అసలు ప్రాపర్టీయే వెరీ క్రూయల్ థింగ్! దాని రియాక్షన్స్ అంతే క్రూరంగా



నోస్ కాంప్లికేటెడ్ ఇండియన్ సొసైటి - దొరల గురించి తెలుసుకోవడానికి తెలంగాణలో అనేకమందిని అదివరకే కలిసినట్టున్నది. గమ్మత్తేమంటే ఆ యంగ్ డైనమిక్

ఉంటాయి. ఆ పిల్ల మాటల్లో చెప్పాలంటే ఇదివరకు బ్రూటల్‌గా మనం ఫాసిస్టు నేచరుతో ప్రజలను అణచివేశాం. కులాల హెచ్చు తగ్గులు మనం వాడుకున్నాం. ఈ ఊళ్ళో అగ్రకులం మనయి మూడిండ్లు - మా కుటుంబం తప్ప మిగతా రెండు కుటుంబాలు మామూలు రైతులు - ఒక బ్రాహ్మణ కుటుంబం. అయినా ఆధిపత్యం మనది. ఈ ఊళ్ళో మున్నూరు కాపు, పెరిక, యాదవ, మాదిగ కలిపి రెండు వేలుంటారు. కమ్మరి, కుమ్మరి, కంసాలి, దూదేకుల తదితరాల వారు వంద మందుంటారు. మా నాన్న కాలం నుండి - మా మీద దాడి జరిగేదాకా అన్ని అధి కారాలూ మావే. అటు తరువాత సర్పంచ్ బి.సి. కులస్తుడయ్యాడు. గొడవల్లో డైరె క్టుగా ఫ్రంట్‌లో అతనుండే వాడు. మా బ్రదర్స్ మీద దాడి జరిగేటప్పుడు అతని కొడుకు అడ్డమొచ్చి మా అన్నలతో పాటు చనిపోయాడు. బి.సీ.లల్లో కొన్ని కులాల మధ్య నిరంతరం కొట్లాటలుండేవి. ఎక్కువ భాగం కూలీలు, పాలేర్లు దాడు లన్నీ వాళ్ళే మన తరపున చేసేవాళ్ళు. బయట యం.ఎల్.ఎ., మండల్ ప్రెసి డెంట్ పదవులు మనవి. ఇప్పుడు అట్లా ఉండలేం.. ఇది పైకి కన్పించే సింపుల్ ఆటవిక థియరీ"

విద్యాసాగర్ రావుకు ఆసక్తి పెరిగింది. స్ప్రైట్ సిప్ చేశాడు. కీరదోసకాయ ముక్కలు ఫోర్కుతో తినసాగాడు.

"అంటే - సామాజిక పరిణామ క్రమం గురించి మనకు తెలియదన్నమాట. మీరు ఏమీ తినడంలేదు" జగన్ రావు అన్నాడు, గ్లాసు ఖాళీచేసి, ఉల్లిపాయ ముక్క చప్పు డు వచ్చేవిధంగా కరకర నములుతూ.

రాము మళ్ళీ గ్లాసు నింపాడు.

"నేను నార్మల్‌గా హాట్ ప్రిఫర్ చేస్త. ఈ వూళ్ళో నాకో వోల్డు ఏజ్ మిత్రుడు న్నాడు. అతను బీరు మాత్రమే తాగు తాడు. అతని కోసం ఎప్పుడూ ఫ్రిజ్‌లో బీరు ఉంటుంది.

"సో - విద్యా! ఫ్రీగా ఉండు. నాకిప్పుడు అరవై అయిదేండ్లు. మేం నలుభై సంవత్స రాల క్రితమో, అంతకన్నా ముందో నీలాగా ఆలోచించవల్సింది. గిడసబారిన పాత పద్ధతి నుండి మా అంతట మేము బయట పడాల్సింది. ఎవరూ తమంత తాము అలవాటయిన కంఫర్టు నుండి బయట పడరు, అఫ్‌కోర్స్!

నేనిప్పుడు డెమొక్రాట్‌గా ఉన్నాన న్నానా? కూలీలందరికీ చట్ట ప్రకారంగా కొంచెం ఎక్కువగా కూలీ యిస్తాను.. చుట్టున్న గూడేలల్లోని స్కూలు పిల్లలకు సైకిళ్లు - వైద్య సౌకర్యం కల్పిస్తాను. వ్యవ సాయంలో నేను చేయని ప్రయోగం లేదు. అయినా ఆ బీహారీ పిల్ల 'మీరు ఇంకా ఫ్యూడలిజాన్ని ఎందుకు వొదులుకోలేకపో తున్నారు. వాళ్ళ శ్రమను వాళ్ళకు ఇచ్చి మీరు దాతృత్వం తృప్తి పొందుతున్నారు. భూములు ట్రైబల్స్‌వి, వాళ్ళ భూములు వాళ్ళకెందుకు ఇవ్వరు? యూ ఆర్ బీయింగ్ యే డాక్టర్ - మిలిట్రీలో పని చేశారు. మీ నాన్నగారు గుండె ఆగి చని పోయారు. మీ పెద్దన్న కోసమొచ్చి - ఈ గొడవలకు సంబంధం లేని మీ అన్నను, తమ్ముడిని కాల్చేశారు అంది"

ఆ మాటలు చెబుతుంటే జగన్‌రావు ముఖం జేవురించింది. ఆ విషాదపు తాలూకు నీలినీడ ముఖంలో - "ప్రతిచర్య లేకుండా - అది ఏదన్నా కానియ్యి ఇన్ని సంవత్సరాలు నిశ్శబ్దంగా పిచ్చివాడిగా గడ పడం- అసలు నేను డాక్టరన్న సంగతే మరిచిపోయి చాలా కాలమయ్యింది.. హారిబుల్! ఐ కాంట్ ఎక్స్‌ప్రెస్!" మరలా గ్లాసు బీరు తాగి.

"పైకి ఇంత జమీ - డబ్బు - కారల్ మార్క్స్ అన్నట్టు మనం డబ్బు అనే మృత దేహంతో బతుకుతాం. ఈ పాత గడీలో

గత ముప్పయేండ్లుగా మృత దేహాలతో బతుకుతున్నానేమో? బహుశా నాకు నేను దయ్యాన్నేమో? అనిపిస్తుంది. రాములు నాయక్ ఒక్కొక్కసారి ఇక్కడ పడుకుంటాడు. ఎన్ని నిద్రలేని రాత్రులు గడిపానో? హారిబుల్..! ఏమన్నాను, డబ్బు మృతదేహం కదా? అది మనలో లోపల రోజూ కొంత కొంత కుళ్ళగొడుతుంది. ఈ జబ్బుకు వైద్యం అందదు. మందు ప్రకృతిలో ఉంటుంది. కష్టంలో ఉంటుంది. ది వండర్‌ఫుల్ ఏనిమల్ మనిషి - మనిషి మాత్రమే గతం, వర్తమానం, భవిష్యత్తు కాలాల సంధానకర్త. కానీ మనం మనుషలను ద్వేషిస్తాం, అవమానిస్తాం, చివరకు.. అల్లుడితో ఇట్లా మాట్లాడకూడదు.. మనం మనచుట్టూ ఉన్న ప్రకృతితో పాటు అన్నింటినీ చెరుస్తాం. కకావికలం చేస్తాం. ఈ గడిలో ఎంతమంది ఆడపిల్లలను మా అన్నయ్య చెరిచాడో? - ఆ బిహారీ పిల్ల చెప్పింది. అంటే మనం చేసే ప్రతి పనినీ జనం జాగ్రత్తగా చూస్తున్నారన్నమాట. నేను కూడా యిష్టం లేక అలాంటివి ఆలోచించలేదు. ఎంతమంది నెత్తురు కొరడా దెబ్బలకు పారి ఈ ఇంటి వాకిట్లో ఇంకిపోయిందో చెప్పింది. అదంతా కాదు.. మా నాన్న మరణం కన్నా - మా అన్న, తమ్ముల మరణం కన్నా, మా పెద్దన్న మరణం భయంకరమైంది. సుఖవ్యాధులతో కాళ్ళుచేతులు, ఒళ్ళంతా చిట్లిపోయి, రాత్రిళ్ళు బాధతో అరుస్తూ చనిపోయాడు!"

గ్లాసు ఖాళీ అయ్యింది. అసలే పెద్దగా ఉన్న కండ్లు ఎర్రగా అయిపోయాయి. ప్లేటులో ఊరకనే చెంచాను ఆడించాడు.

కళ్ళల్లో తడి.. బాత్‌రూంకు వెళ్ళివచ్చి మళ్ళీ కూర్చున్నాడు.

బిగుసుకుపోయిన ఈ వాతావరణం, తిండీ, తాగటం.. ఆ సమయం విద్యాసాగర్ రావుకు తోచకుండా ఉంది.

"మా యింట్లో మా అమ్మ, ఇద్దరు చిన్న పిల్లలతో మా పెద్ద వదిన, మా చిన్న వదిన నాలుగు నెలల గర్భవతి. ముగ్గురు విధవలు. మా వాళ్ళ హత్యలు నన్ను వెంటాడేవి. రివాల్వర్‌తో ఒంటరిగా తిరిగేవాన్ని. నేననుకున్న వాళ్ళను కసితో కాల్చి పారేయాలని వాళ్ళ కోసం వెతికేవాన్ని. కాలక్రమంలో అదెంత పిచ్చి పనో అర్థమయింది. మరింక పెళ్ళంటే వనుకు వచ్చేది.. నేను నీకిప్పుడు ఇంత కూల్‌గా చెప్పుతున్నాను గాని - ఆ రోజుల్లో నా స్థితి హారిబుల్ - సంవత్సరాల తరబడి ఎటూ తోచక, ఎవరికీ చెప్పుకోలేక - ఒంటరిగా అనుభవించాను. బహుశా పోయిన మా వాళ్ళ కన్నా ఇప్పుడాలోచిస్తే నేను ఎక్కువ హింసననుభవించాను. అనివార్యంగా మొత్తం కుటుంబ భారమంతా మీద పడ్డది. భూములు, అన్ని ఆస్తులూ ఒక్కొక్కటీ అమ్మేసి వాళ్ళందరినీ సెటిల్ చేయడం ఎంత హింసనుకున్నారు? తేరుకునేసరికి వయసయిపోయింది. మిలిట్రీ నుండి రిటైరై వచ్చేసరికే నాకు నలుభైయేండ్లు. చూస్తుండగానే జీవితం చెయ్యి జారిపోయింది. మనం గొంతు మంటి ఊబిలో దిగిపోతే ఎవరూ దగ్గరికి రారు. అయితే కనీసం వాళ్ళు.. నక్సలైట్లు ముందే హెచ్చరిస్తే - లేదా వాళ్ళకు ఇప్పటికైనా హత్యల వలన ఇన్ని సంవత్సరాలు - ఇంత హింస హ్యూమిలియేషన్ ఆ కుటుంబాల్లో జరుగుతుందని తెలిస్తే బావుండునని అనుకునేవాన్ని. 'ఈ విషయం గుర్తించవలసింది దొరలు. అన్ని రకాలుగా ఈ ఊళ్ళో హత్యలు చేయించింది మీరు. వందల సంవత్సరాలు అనేక కుటుంబాలు మీ కన్నా ఎన్నో వేల రెట్లు క్షోభ అనుభవించాయి.. మీరు లెక్కలు తీయండి. కఠోరంగా ఉన్నా మీ వాళ్ళు పోయిన తరువాత ఊరు నిద్రపోయింది. ఇప్పుడు బతకడం నేర్చుకుంటున్నారు. హత్యలు హఠాత్తుగా జరుగుతాయి. కానీ వాటి ప్రభావం

జీవితం పొడుగూతా కొనసాగుతుంది..' కానీ అది ఎంత అసంబద్ధమైందోనని ఆ పిల్ల చెప్పింది.

'హింస ముమ్మాటికీ తప్పే. మీరు, మీ కుటుంబం అనుభవించిన క్షోభను - ముఖ్యంగా ప్రజల తరఫున పోరాడేవాళ్ళు తప్పనిసరిగా గుర్తు పెట్టుకోవాలి. ఈ ఊళ్ళో జరిగిన హింసాదౌర్జన్యాలకు కారణం మీ అమ్మ, వదినెలు, మీరు కాదు. మీరు ప్రత్యక్షంగా ఎవరికీ ఎలాంటి హానీ తలపెట్టలేదు. క్రూరమైన భూస్వామిక సంబంధాల పెనుగులాట అది. ఔనా! అయినా ఆ ఫలితం అనుభవించారు, అనుభవిస్తున్నారు. ఆ పద్ధతి తప్పని గతంలోనే అనేకసార్లు నక్సలైట్లు ఆత్మ విమర్శ చేసుకున్నారు. ఇప్పుడు అలాంటి విచక్షణ లేకుండా చేసే హత్యలు తగ్గిపోయాయి. క్షమాపణలు చెప్పారు. కానీ, కానీ అవి కోల్పోయిన జీవితాన్ని తెచ్చివ్వలేవు కదా! ఎవరైనా గుర్తించవల్సింది విలువైన మానవ ప్రాణాన్ని. మీ నొప్పిని వారి క్షమాపణలు ఏ మాత్రం తగ్గించలేవు. గాయాన్ని గెలికినందుకు అయామ్ సో సారీ! స్వంతాస్తి ఒక భయంకర హింసాత్మక మహమ్మారి. ప్రతి రూపాయికీ ఎవరిదో ఒకరి శ్రామికుడి నెత్తురంటి ఉంటుంది.

ఏది ఏమైనా జరిగిపోయినదాన్ని సరిదిద్దలేం. ఇక ముందు ఇలాంటివి జరగకుండా చూడాలంటే ఇరుపక్షాలూ ద్వేషంతో కాకుండా - ఒక బాధతో - కన్‌సర్న్‌తో ఆలోచించాలి.. నాలాంటి పిల్ల ఈ గడీలో - మీ ముందు ఇన్ని సంవత్సరాల తరువాత- పాత గడీలో అలాంటి విషాద సంఘటనల గురించి ఇంత కూల్‌గా మాట్లాడుకుంటున్నాం. ఈ మార్పు ఒక్క రోజులో జరగలేదు. ఉత్తగా జరగలేదు. అటు యిటు రక్తపాతం జరిగిన తరువాత జరిగింది. కనపడని విధ్వంసం జరిగిన తరువాత జరిగింది. ఔనా! ఈ విచారం నక్సలైట్లు మాత్రమే కాదు, హింసలో కూరుకుపోయిన మీరూ ఆలోచించాలి. ఎన్ని వందల సంవత్సరాల నుండో ప్రతి కుటుంబంలో అంతకన్నా లోతైన హింస జరిగింది. మీకు అడ్డుగా వచ్చిన వారిని, ఎదిరించిన వారిని, మీ మొరటు అధికారం కోసం, భూస్వామిక ఉత్పత్తి విధానంలో ఎంతమందిని నిర్దాక్షిణ్యంగా చంపి ఉంటారు? ఆడపిల్లను చెప్పకూడదు గాని - టీనేజీ పిల్లను బలవంతంగా ఖరాబు చేస్తే, ఆమె ఆ తరువాత ఎట్ల బతికిందో ఆలోచించారా? అట్లా ఈ ఊళ్ళో ఎంత మంది? నేను చాలామందిని ఇంటర్వ్యూ చేశాను. మీరు ఒక్కరోజు అంటరానివానిగా బతికి చూడండి. చెరుపుకు గురైన ఆడపిల్ల కుటుంబ సభ్యుడిగా బతకండి. బట్ - మీరు మీకనుకూలమైన లాజిక్‌తో ఆత్మవంచన చేసుకుంటున్నారు. వాళ్ళు అనేక తప్పిదాలతో చిక్కురు బొక్కురు దారుల్లో పడుతూ లేస్తూ పోరాడుతూ వ్యక్తిగత ఆస్తిలేని మనుషుల కోసం - సమాజం కోసం పని చేస్తున్నారు. ఇంకా రాజ్యాన్ని, దాని సమస్త అంగాలైన పోలీసు, మిలిట్రీ, జుడీషియరీ.. అన్నీ మీ పక్షంలో మీ కోసం, ప్రజల శ్రమతో బతుకుతూ పని చేస్తున్నాయి. మీరిక్కడ ఇంకా మీ క్రూరమైన దొరతనాన్ని డెమొక్రాట్ ముసుగులో ప్రేమిస్తున్నారు. మీ హింసకు గురైన వందలాది మంది ప్రజలకు ఈ ఊళ్ళో మీలాగా ప్రాపర్టీ లేదు. ప్రాపర్టీని తెలివిగా మేనేజి చేసి, శ్రమశక్తిని దోచుకుంటున్నారు. గ్రామంలో కులాలను యథావిధిగా కొనసాగనిచ్చి మీరు పూర్తిగా బూర్జువా రాజకీయాలల్లో మరో విధంగా కొనసాగుతున్నారు. డెమోక్రాట్ మీ అందమైన మేలి ముసుగు! నా మాటలు కఠినంగా ఉంటే నన్ను క్షమించండి. రాజకీయాలలో ముసుగులు, మొహమాటాలుం

రూ.116/- గెలుచుకున్న

# ఉత్తమ సమీక్ష

# అక్షర మాలలు.. లక్షల విలువలు!




తెలుగు నుడికారానికి మమకారపు అక్షరాలను అద్ది మమ్మల్ని చదివింపజేస్తున్న 'చతుర'కు హృదయపూర్వక ధన్యవాదాలు. నవంబరు చతుర మమ్మల్ని విశేషంగా ఆకట్టుకుంది. 'నీడల చెట్టు' నవలిక గురించి ప్రత్యేకంగా చెప్పుకోవాలి. సుమారు నాలుగు దశాబ్దాలనాటి సమాజ పరిస్థిలకు అద్దంపట్టిందీ నవలిక! ఆడపిల్ల పుట్టిందంటే అసహ్యించుకునే తీరు, మగపిల్లలంటే మోజు తదితర నాటి అవలక్షణాలన్నీ విప్పి చెప్పింది. ఆడపిల్ల త్యాగాన్ని, గొప్పతనాన్ని, ప్రేమను గుర్తుచేసింది.. ఆలోచింపజేసింది. ఆడపిల్లలున్న ప్రతి ఇంటిలోనూ కనిపించే సంఘటనలకు అద్దం పట్టింది. ప్రస్తుత సమాజానికి ఈ కథనం ఒక విధంగా మేలుకొలుపు. ఆడపిల్లను భారంగా, హీనంగా చూడకూడదు. అమ్మ ప్రతిరూపమేనని భావించాలి. ఆడపిల్ల పుట్టిందని ఇప్పటికీ భార్యను వదిలేసే భర్తలకు ఈ నవలిక కనువిప్పు! ప్రతినెలా 'చతుర'లోని కథా చతురతలు ఎంతగానో కట్టిపడేస్తున్నాయి.

అపురూప ప్రేమకావ్యం 'మీర్జా సాహిబా' మనసుకు బాగా హత్తుకుంది. రసరమ్యంగా సాగిన ఈ కథనం ఆద్యంతం ప్రేమమయం. అనువాదమైనా ఆసక్తిగా చదివించింది.

'కొత్తగాలి' అంతా మళ్లీ మళ్లీ చదవాలి అనే విధంగా ఉంది. భద్రంగా దాచుకునేలా ఉన్నాయి కవితలు. ఈ గాలి ఎంతకాలమైనా కొత్తగానే ఉంటుందని చెప్పడంలో ఎలాంటి అతిశయోక్తి లేదు. 'చతుర ప్ర.జ.' ద్వారా ఎన్నెన్నో ఆధ్యాత్మిక అంశాలను తెలుసుకోగలుగుతున్నాం. ప్రశ్న ఒక్కరే అడిగినా సమాధానం మాత్రం కొన్ని వేలమంది తెలుసుకుంటున్నాం. వర్తమాన కాలానికి ఇలాంటి ఆధ్యాత్మిక బోధనలు ఎంతో అవసరం.

ఇంకా నవలావలోకనంలో 'కాలాతీతవ్యక్తులు' నవలపై మంచి సమాచారం ఇచ్చారు. కాలాతీతంలో మార్క్వెజ్ నవల గురించి ఇచ్చిన వివరాలు బాగున్నాయి.

బతుకును చేదుచేసే 'తీపి' వ్యాధి గురించి తెలుసుకోవడంతో పాటు, తీసుకోవలసిన జాగ్రత్తలను పాటించేందుకు వ్యాధిగ్రస్తులు సన్నద్ధం కావాలి.



ఉసిరికారం నోరూరించింది. ఉసిరి చేసే మేలు ఎంతో అన్నది అందరికీ తెలిసిందే! రుచితోపాటు చక్కటి ఆరోగ్యాన్ని అందించే ఆరోగ్య 'ఉసిరి' తిని తీరాల్సిందే అందరూ!

– నీలిమ సబ్బిశెట్టి,
రాజానగరం, తూ.గో. జిల్లా

డొద్దు' ఆ పిల్ల మార్దవమైన, స్థిరమైన కంఠంతో అంది.

నేను సంయమనం కోల్పోయి 'ఆర్ యు యే నక్సలైట్?' అన్నాను.

ఆ పిల్ల మాత్రం ఉద్రేకపడలేదు"

జగన్ రావు కుర్చీలో నుండి లేచి కొంచెంసేపు పచారు చేశాడు.

"మీకు బోరింగ్‌గా ఉందా?" అని అడిగాడు బీరు సిప్ చేస్తూ.

"లేదు. నాకు ఈ విషయాలన్నీ కొత్తగా ఉన్నాయి" విద్యాసాగర్ కొంచెం కూల్ డ్రింక్ సిప్ చేసి అన్నాడు.

టేబుల్ దగ్గర నిలబడి జగన్‌రావు చిత్రమైన గొంతుతో మాట్లాడిండు. ఆ పిల్ల ఆ తర్వాత ఏమందో వివరంగా చెప్పాడు.

"మీరు దారులు మూసుకొని సాకులు వెతుకుతున్నారు. బహుశ భారతీయ బ్రాహ్మనికల్ ఫిలాసఫీ మొత్తం ఒక అద్భుతమైన మాయను సృష్టించి, హేతువును - ప్రశ్నను - దారులను మూసేసి - కృత్రిమ సాకులు చెప్పింది. రామాయణం అంతా చూడండి. అది సీత కోసం జరిగిన యుద్ధమా? కానేకాదు. ఆదివాసీ సమాజాలను, అక్కడక్కడున్న మాతృస్వామిక సమాజాలను క్రూరంగా, హింసాత్మకంగా అణచివేసి, ఒక దుర్మార్గమైన ఫ్యూడల్ రాజ్యాన్ని స్థిరీకరించడం చేశాడు రాముడు. అందుకే చివరకు రాజసూయ యాగం చేసిండు. ఆదివాసీ ప్రాంతాల్లో సర్వ సంపదలను దోచుకునే మునుల ఆశ్రమాలకు - బహుశా మీలాంటి భూస్వాములకు మద్దతు పలికాడు. అందుకే భారతదేశంలో రామాయణం గిడసబారిన భారత దేశ ఫ్యూడలిజానికి కొండగుర్తు. నేను తిరుగుతున్న తెలంగాణ మొత్తంలో భూమి మొత్తం కొద్దిమంది అక్రమంగా కబ్జా చేశారు. మీ ఊరులో దాదాపు కొందరు మైదాన ప్రాంతం నుండి వలస వచ్చిన గైర్ ఆదివాసులు. వాళ్ళంతా ఆదివాసుల భూములను కబ్జా చేశారు. ఆదివాసులు లోతట్టు అడవుల్లోకి వెళ్ళిపోయారు. ఇప్పుడు అడవులను కబ్జా చేద్దామనుకుంటున్నారు. ప్రకృతి వనరులను కొల్లగొట్టారు. ప్రజలు ఊపిరాడని స్థితిలో బతికారు. ఈ క్రూరమైన, హింసాత్మకమైన ప్రాపర్టీ ఆక్యుపేషన్ - మొరటు ఉత్పత్తి - దయాదాక్షిణ్యం లేని, కడుపుకు జాలని పంపిణీ ఇది కాదా? తెలంగాణా గ్రామ సీమలను స్మశానాలుగా మార్చింది మీ దొరలు కాదా? మా బీహార్‌లో లాగే ఆ మృత్యుశీతల గ్రామాలల్లో దొరలు సంపదలతో - జల్సాలతో కేళీవిలాసంగా బతికారు. ఈ తిరకాసెక్కడుందో అంతుపట్టని జనం - కసితో చెలరేగారు. ఔనా కాదా? ఒక నిప్పు రవ్వ ఊళ్ళను కాల్చేసింది.. కానీ అది సరైంది కాదు. హత్యకు హత్య జవాబు కాదు. మూలంలోకి వెళ్ళాలి. హింసకు ప్రతిహింస, చెలరేగడం లాజికల్‌గా వాస్తవమే అయినా - ఈ మొత్తం వ్యవహారంలో - ఈ ఉత్పత్తి సంబంధాలు, మానవ సంబంధాలు ఎందుకింత కుళ్ళిపోయి, సంక్లిష్టంగా తయారయ్యాయో ఆలోచించాలి. అదిగో అందులో భాగంగా నేను మారుమూల- ఇక్కడిలాగే - క్రూరమైన భూస్వామ్యం - హింసగల బీహార్ నుంచి మీ దగ్గరికి వచ్చాను. నేను గత పదిహేను రోజులుగా మీ వూళ్ళోని చాలామంది ప్రజలను, ప్రభుత్వ అధికారులను కలిసి మాట్లాడాను. పక్కూళ్ళు తిరిగాను. గత ముప్పై ఎనిమిది సంవత్సరాల కాలంలో క్షేత్రస్థాయిలో జరిగిన సంఘటనలన్నీ సేకరించాను. నిరక్షరాస్యతతో చీకట్లో ఉన్న చిన్న గ్రామాల్లో నుంచి ఇప్పుడు ఎక్కువమంది పిల్లలు కాలేజీ చదువుతున్నారు. జనాభా పెరిగింది. భూస్వామ్య ప్రత్యక్ష హింస, దౌర్జన్యం తగ్గింది. కానీ ప్రధానంగా ఆస్తి, అధికారం మారలేదు. అది ఇంకా మీ భూస్వామ్య

# మిక్కీమౌస్ ముచ్చట్లు

పిల్లలకు ఎంతో ఇష్టమైన వాల్ట్‌డిస్నీకి అధిక లాభాలు తెచ్చిన కార్టూన్ మిక్కీమౌస్. దానికి సంబంధించిన విశేషాలు..

★ 'మిక్కీమౌస్' సృష్టికర్త వాల్ట్‌డిస్నీకి ఎలుకలంటే భయం!

★ మిక్కీమౌస్‌కి మొదట వాల్ట్‌డిస్నీ పెట్టిన పేరు 'మార్టిమర్ మౌస్'. అతని భార్య దానికి 'మిక్కీమౌస్' అన్న పేరు బావుంటుందని సూచించింది.



★ మిక్కీమౌస్ మొదటి స్కెచ్‌ని వాల్ట్‌డిస్నీ ఓ రైల్లో వెళ్తూ గీశాడు.

★ 'ది లీగ్ ఆఫ్ నేషన్స్' 1935లో వాల్ట్‌డిస్నీకి ఓ మెడల్‌ని బహూకరించారు. మిక్కీమౌస్‌ను అంతర్జాతీయ గుడ్‌విల్‌కు గుర్తుగా వారు భావించారు.

★ మిత్ర సైన్యాలు 1944లో యూరప్ మీద దాడి చేయడానికి ఇచ్చిన కోడ్ పేరు 'మిక్కీమౌస్'.

★ వాల్ట్‌డిస్నీ 1950లో 'మిక్కీమౌస్ క్లబ్' అనే టీవీ షోని ఆరంభించాడు. అనేకమంది పిల్లలు దీనిలో పాల్గొనేవారు. వారికి 'మస్కటీర్స్' అనే ముద్దు పేరు పెట్టారు. బ్రిట్నీ స్పియర్స్ లాంటి నేటి ప్రముఖ నటులు ఒకప్పటి మస్కటీర్సే!

★ తెరమీద మాట్లాడిన మొదటి కార్టూన్ మిక్కీమౌస్! 1929లో 'ది కార్నివాల్ కిడ్' అనే ఎపిసోడ్‌లో 'హాట్ డాగ్' అనే మాటను మాట్లాడింది. 1946 వరకు వాల్ట్‌డిస్నీనే మిక్కీమౌస్‌కి కంఠాన్నిచ్చింది. అప్పటి నుంచి ఇప్పటివరకూ ఇద్దరే మిక్కీమౌస్‌కు కంఠాన్నిచ్చారు.

★ మిక్కీమౌస్ సృష్టికర్తగా వాల్ట్‌డిస్నీకి ఆస్కార్ అవార్డు లభించింది.

★ 1935లో 'మేసీస్ థాంక్స్ గివింగ్ పరేడ్'లో 55 అడుగుల ఎత్తయిన మిక్కీమౌస్ విగ్రహం పాల్గొంది. ఓ కార్టూన్ పాత్ర పరేడ్‌లో పాల్గొనడం అదే మొదటిసారి.

★ 1978లో మిక్కీమౌస్ ఏభయ్యో పుట్టిన రోజు నుంచి దాని చెవులు మారాయి.

★ న్యూయార్క్‌లోని కాలనీ థియేటర్‌లో 18 నవబంరు 1928న తొలుత మిక్కీమౌస్ ప్రేక్షకులకి దర్శనం ఇచ్చింది.

★ మిక్కీమౌస్ నటించిన 'లెండ్ ఎ పా' (1941) కార్టూన్ సినిమాకి అకాడమీ అవార్డు లభించింది.



వర్గాల చేతుల్లోనే ఉంది. కులాలు ఇంకా బలపడ్డాయి. కులాల మధ్య ఘర్షణలు పెరిగాయి.. కులాలకు మూలమైన పుట్టుకతో కులవృత్తి పది శాతం కన్నా మారలేదు. ముఖ్యంగా అతి తక్కువగా ఉన్న, వడ్ల, కమ్మరి, కుమ్మరి వృత్తులలో మార్పు వచ్చింది. అసలు కొన్ని వృత్తులు లేనే లేవు.. మాదిగలు వ్యవసాయం చేస్తున్నారు. వారికి స్వంత భూమి రాలేదు. మీ ఊళ్ళో ఒకరు బాగా చదివి హైకోర్టు జడ్జి అయ్యారు.. పార్టీలలో అందరూ కలిసి తిన్నా కులంలోనే కంచం పొత్తు కొనసాగుతోంది. కులంలోనే పెండ్లిల్లు జరుగుతున్నాయి. కుల పంచాయితీలు బలహీనపడ్డాయి. అయినా ఉన్నాయి. కులం నుండి బహిష్కరించే ఆచారం పోయింది. కానీ కులాల వారిగానే ఏకీకరణ ఉంది. ఇక్కడ దీర్ఘకాలం సర్పంచి చేసినాయెనే - తన కోడలును మండలాధ్యక్షురాలిని చేయడానికి జాతకం చెప్పించుకుంటున్నాడు. గ్రామం వ్యాపార పంటలకు, వ్యాపార సరకులకు నిలయమయ్యింది. హత్యలు తగ్గి ఆత్మహత్యలు పెరిగాయి. భూముల ధరలు పెరిగినయ్. మీ భూములన్నీ అధిక ధరలకు అమ్మి మీ కుటుంబం సిటీలో వ్యాపారంలోకి మారింది. మీ

భూములు స్థానికులే కాక, బయటివారు, సింగరేణి ఉద్యోగస్తులు కొన్నారు. ఏది ఏమైనా స్థానికులకు, భూమిలేని పేదలకు అయిదు శాతం కూడా భూమి దొరకలేదు. మీ ఊళ్ళో యాభై శాతం మాల, మాదిగ, న్యాతకాని, గోండు ప్రజలకు భూమి లేదు. ఇంత అతలాకుతలం ముప్పై ఎనిమిది సంవత్సరాల పోరాటం తరువాత పరిస్థితి ఇది. బ్యాంకు వచ్చింది. రోడ్డు, రోజ్‌గారి నిధులొచ్చినయ్, రైతులు లబ్ధిదారుల య్యిండ్లు. కరెంటు వాడకం పెరిగింది. మీరు ఆధునిక పద్ధతిలో వ్యవసాయం చేస్తున్నారు. వ్యవసాయ అధికారులు, మీ పంటల పర్యవేక్షణ చేస్తరు. రైతులు మార్కెట్టులో మోసపోతున్నారు.. అడవి తగ్గిపోయి, పైగా టైగర్ జోనంట. ఆదివాసులు పూర్తిగా తుడిచిపెట్టుకుపోయే పరిస్థితి వచ్చింది..

ఇంతకూ నేను కోరేదేమంటే - ప్రతి దానికీ ఫలానా కారణం వల్ల జరిగిందని నిర్ధారణకు వచ్చి అసలు విషయాన్ని, పుండును దాచలేం.. ఈ ప్రకృతిలో అందరం ఉన్నాం. అందరం పరిణామ క్రమం గురించి - నిర్దిష్ట పరిస్థితుల్లోకి వెళ్ళి నిజాయితీగా అధ్యయనం చేద్దాం. అమానవీయమైనదాన్ని మారుద్దాం.. నేను ఎవరైందీ అంత ముఖ్యం కాదు.

మీరు ఆలోచించండి. వేల సంవత్సరాలుగా కుళ్ళిపోయిన ఫ్యూడలిజం నుండి బయటకు రండి! అంబేద్కర్ అన్నట్టు రెండున్నర వేల సంవత్సరాలుగా గిడుసబారిన, అసహ్యకరమైన కులం దాటి బయటకు రండి - మీరు డాక్టర్! ఆలోచించగలవారు. అరుణాచల్‌ప్రదేశ్‌లో పని చేశారు - అక్కడ ఇంకా బతికున్న బుద్ధిస్టు సొసైటీలు - ఆదివాసీ సొసైటీలు చూశారు. ఆలోచించగలవారు. మీరు సకలం కొల్లగొట్టి పారాసైటుగా బతికిన స్థితి నుండి బయటకు రండి! ఆదివాసీలు, దళితులు, మైనార్టీలు, మహిళలతో కలిసి దీన్ని మారుద్దాం. దళారులు కాకండి' - బహుశా ఈ మాటలన్ని ఎట్లా గుర్తున్నాయో నాకిప్పటికీ అర్థం కావడం లేదు. తిరిగి చెప్పగలుగుతున్నాను. ఆ పిల్ల మాట్లాడింది సామాజిక డాక్టరు భాష.." జగన్‌రావు తల వెనుక చేతులు పెట్టుకొని కుర్చీమీద తల వెనక్కు వాల్చి కాసేపు మౌనంగా కూర్చున్నాడు.

విద్యాసాగర్‌రావుకు దేవి గుర్తొచ్చింది. ఒళ్ళు జలదరించింది. పల్లెల్లో, అడవుల్లో సామాజిక మూలాలను చదివే జ్ఞానం గాలిలా వ్యాపిస్తోందా? తమ ఫ్యాక్టరీలో కూడా ఇలాంటి రీజనింగ్ వ్యాపించిందా? బహుశా తను ఆ టైగర్‌జోన్‌లోనే ఇంతసేపూ తిరుగుతున్నాడా?

జగన్‌రావు ఆఖరి గ్లాసు బీరు తాగి - వేయించిన జీడిపప్పు తిని లేచి నిల్చున్నాడు. అతని కళ్ళు కొంచెం ఎరుపెక్కాయి.




**"అ**ల్లుడుగారూ! రండి - ఆ బీహారీ పిల్ల మాటలు, నా మాటలు కలగాపులగంగా చెప్పి మిమ్మల్ని అదరగొట్టాను. చిత్రంగా ఆ పిల్లతో జరిగిన సంభాషణంతా గుర్తొస్తున్నందుకు సర్‌ప్రైజింగ్‌గా ఉంది. బహుశా నేనున్న స్థితిలో అంత ధైర్యంగా, సూటిగా, అనలైటికల్‌గా ఎవరూ చెప్పజాలరేమో? నేను చాలాసార్లు సైకియాట్రిస్టును కలిశాను. కానీ ఈ లోపలి

చరిత్ర తెలియకుండా, అర్థం కాకుండా ఎట్లా నా స్థితిని సైకియాట్రిస్టు చెప్పగలడు? నాకనిపిస్తుంది. ఆ పిల్ల చెప్పిన మాటలు ఆమె ఒక్కదానివి కాదు. ఈ ప్రాంతంలో నలభై సంవత్సరాలుగా పోరాడుతున్న నక్సలైట్లవి. ఆ మాటలు పాత గడిలో మనతో ముఖాముఖి చెప్పడమే వండర్.. పోనియ్యండి. మీకు తప్పక ఈ అనుభవాలు ఉపయోగపడతాయనే ఈ సోదంతా చెప్పాను. అట్లా బయటకు వెళ్ళి కిచెన్ గార్డెన్ చూద్దాం" జగన్‌రావు తేరుకుని బయటకు దారితీశాడు.

విద్యాసాగర్‌రావుకు నిజానికి ఆ మాటలు చాలావరకు అర్థం కాలేదు.

చేసేదేమీలేక జగన్‌రావును అనుసరించాడు. గడి వైశాల్యం ఐదెకరాలు. చుట్టూ ప్రహరీ గోడ. లోపలి గోడ కానుకొని దూరంగా చిన్న చిన్న బెంగళూరు గూన పెంకుల షెడ్లున్నాయి.

ఇద్దరూ మౌనంగా కిచెన్ గార్డెన్ గట్ల మీద నడుస్తున్నారు. మొదట నపనవలాడే ఆకు కూరల మళ్ళున్నాయి.

"ఇది తోటకూర - ఇందులో మళ్ళా నాలుగు రకాలు - దేని రుచి దానిదే. లోకల్ రకాలు బావుంటాయి.. ఇది పాల కూర, అది చుక్క కూర, గంగవాయిలి, పుదీన, కొత్తిమీర, మెంతి, ఉల్లి, ఎల్లి మడులు" అన్ని మళ్ళ చుట్టూ తిప్పి పేరు పేరున దగ్గరుండి చూయించాడు.

పొద్దున్నే మళ్ళన్నిటికీ నీరు పట్టినట్టున్నది. మళ్ళ మధ్య కాలి బాటలు. వింత పరిమళం. మట్టి వాసన, చల్లగా ఉల్లాసంగా ఉంది.

విశాలమైన తమ బంగ్లాలో పదిమంది గార్డెన్ వర్కర్లు కిచెన్ గార్డెన్‌లోనే పనిచేస్తారు. తనెప్పుడూ ఆ పక్కకు వెళ్ళనేలేదు. కేకలు వేస్తూ ఆ పనివాళ్ళ మధ్య తిరిగే తన భార్య గుర్తొచ్చింది విద్యాసాగర్ రావుకు. కూరగాయలు, వాటి రకాలు తనకు అంతగా తెలియదు.

## కొత్తగాలి... 

**అంతటా ఆనందమే**
**కవికి కలంలో**
**గాయకుడికి గళంలో**
**నాయకుడికి జనంలో!**

– బి. చంద్రశేఖరయ్య,
పలమనేరు, చిత్తూరు జిల్లా

"ఇవి కూరగాయలు - వంకాయలు నాలుగు రకాలు, టమాట, ఇవి మన దేశవాళి రామ్ములగ.. వీటి రుచి బ్రహ్మాండం. గోబీ, పూగోబీ, క్యారెట్టు" - ఆ పక్కనే గల వెదురు పందిళ్ళ దగ్గరికి తీసుకెళ్ళాడు.

దోస, బీర, కాకర - నల్ల రకాలు, తెల్ల రకాలు.

చిక్కుడు, అలిశంత.. దొండకాయలు.. పూలు, తీగలు, కాయలు - అరటి నాలుగు రకాలున్నాయి. జామ, మామిడి, కొబ్బరి, దానిమ్మ, నారింజ చెట్లు విరగకాస్తున్నాయి. అవి గడి గోడవారగా దూరంగా - ఈశాన్యంలో రెండు మోట బావులున్నాయి.. ఇంకా జల్లుకు రాని మొక్కజొన్న పెరడు.. ఆ పక్కనే నాలుగు రకాల మిర్చి మళ్ళు ఉన్నాయి..

"ఒక్కరికీ ఇవన్నీనా? " విద్యాసాగర్‌రావు ఆశ్చర్యపోతూ..

"నేను తినగా - కొద్ది మందికి పంపగా - మిగతావి మార్కెట్టుకు" జగన్‌రావు.

చల్లగా హాయిగా ఉంది. అటునుండి తిరిగివస్తే ఒక దగ్గర షెడ్లల్లో వందలాది దేశవాళి కోళ్ళున్నాయి.. ఆ షెడ్ల ముందు విశాలమైన జాలీలలో మక్కలు చల్లి ఉన్నాయి. కోళ్ళు వింత శబ్దాలతో తిరుగుతున్నాయి. ఆ పక్కనే దూరంగా మేకల దొడ్డు. ఇరవైకి పైన్నే మేక పిల్లలు వీళ్ళిద్దరి

అలికిడికి అరిచాయి. మరికొంచెం దూరంలో - రేకుల షెడ్లు - బర్లు - ఎడ్ల కోసం. ఆవులున్నట్టున్నాయి. దూడలు, లేగలు ఒక చిన్న కొట్టంలో పచ్చిగడ్డి మేస్తున్నాయి.

తిరిగి ఇంటి దగ్గరికి వచ్చారు. రేకు తలుపుల దగ్గర లోపల అరెకరం విశాలమైన వాకిలి. ఉత్తరం వేపు ఆరిండ్లు - అవి ఒకప్పుడు కుటుంబమంతా ఉంటే తలొకటి వాడుకునేవారు. ఆ ఇండ్ల నిండా ధాన్యం, పత్తి, ట్రాక్టర్ల సామాను, కర్ర.. మొత్తం అన్ని గదులూ నిండి ఉన్నాయి. వాకిట్లో అరెకరం ప్లాస్టిక్ పట్టాలు పరిచి మొక్క జొన్నలు ఎండబోసి ఉన్నాయి.

"సార్! బ్రేక్‌ఫాస్టు రడీ - " రాములు నాయక్ వాళ్ళ దగ్గరికి వచ్చి చెప్పాడు.

ఇద్దరూ మళ్ళీ డైనింగ్ టేబుల్ వద్దకు వచ్చారు. ఒక ప్లేట్లో దోరగా కాల్చిన పుల్కాలున్నాయి. పల్చగా, మృదువుగా చేసిన జొన్న రొట్టెలు, పూరీలు ఉన్నాయి. విద్యాసాగర్‌కు ఏం తినాలో తోచలేదు.

ఒక పుల్కా పళ్ళెంలో వేసుకున్నాడు. పింగాణి ప్లేట్లు. ఖరీదైన డైనింగ్ సెట్టే..! ఐదారు కూరలున్నాయి. లేత దొండకాయ ఫ్రై. పచ్చిమిర్చితో చేసిన ఎగ్‌బుర్జీ, రామ్ములక్కాయ, పెసర పప్పు, తోటకూర.. ముక్క తుంచి నోట్లో వేసుకున్నాడు.. "నిజంగానే - అద్భుతం..!" అన్నాడు విద్యాసాగర్ రావు.

"వెరీ సింపుల్ కుకింగ్! ఒకటి ఫ్రెష్, ఆర్గానిక్ ఫుడ్, గ్లూకోజు పోకుండా చెట్టు మీదివి కోసి వండడం. రెండు కూరగాయల అసలు ఫ్లేవరు డామినేట్ చెయ్యకుండా నూనె, ఉల్లి, టమాట, వెల్లుల్లి, జీలకర్ర ఉప్పు మోతాదులు - అవన్నీ ఎప్పుడు, ఎట్లా, ఎంత మోతాదులో కుక్ చేయాలనేది ఒక కళే - రాములు నాయక్ వెజ్ స్పెషలిస్టు. ఓన్లీ పచ్చిమిర్చితో చేసే కుండ చికెన్ అద్భుతం.. అన్నట్టు గోదావరి నీళ్ళల్లో చేపలు.. పులుసు ఫ్రై - బహుశా ఈ ప్రకృతి సిద్ధమైన వాటికోసం నేనిక్కడున్నానేమో? అయినా ఆ పిల్లన్నది. 'ఇదంతా నీది కాదు' అని. కరక్టే.. ఈ ఫ్లేవరంతా కూరగాయలు పండించిన వాళ్ళదీ, రాములు నాయక్‌ది"

తనేది ప్రిఫర్ చేశాడో చూసి రాములు నాయక్ అవి వేడివేడిగా అప్పటికప్పుడు వడ్డిస్తున్నాడు. మరో మూడు పుల్కాలు తిన్నాడు విద్యాసాగర్ రావు.

"ఈసారి మీ దగ్గరికి నాన్‌వెజ్ పంపనా? " జగన్‌రావు.

"వద్దు. మీకెందుకు శ్రమ? వీలు చూసుకొని మేమే వస్తాం" అన్నాడు విద్యాసాగర్ రావు.

బ్రేక్ ఫాస్టయిపోయింది.

ఫోన్ మోగింది. శివశంకర్ ఫోన్.

"సార్! ఇంకో పది నిమిషాలల్లో రూటు క్లియరౌతుంది. మమ్మల్ని అక్కడికి రమ్మంటారా? "

"ఎవరు? " జగన్‌రావు.

"మా పర్సనల్ మేనేజరు"

"క్లియరవుతుందా? "

"యస్.."

"నేనే దిగబెడుత.. పదండి.." అన్నాడు జగన్‌రావు.

ఇద్దరూ రోడ్డుమీదికి వచ్చి నిలుచున్నారు. ఒక ట్రాక్టర్ రొద చేసుకుంటూ మెయిన్ రోడ్డుకేసి వెళ్ళింది. దూరంగా వేప చెట్టు కింద ఒక పిచ్చివాడు నిర్వికారంగా తమకేసి చూస్తూ నిలుచున్నాడు. కిటకిటలాడే మందితో ఒక ఆటో గోదావరి కేసి పరిగెత్తింది. కొన్ని మేకలు - వాటి వెనుక ఎడ్ల బండి - గడ్డి మోపులతో మనుషులు.

జగన్‌రావు కారు తాళాలు మరిచిపోయి - మళ్ళీ ఇంట్లోకి వెళ్ళిండు. విద్యాసాగర్ రావు బూట్లు వేసుకోవడానికి తంటాలు పడుతున్నాడు.

అ
క్ష
రం

తను చేసేది ఎవరూ, ఎన్నటికీ
కని పెట్టలేరని తెలిసినపుడు
మనిషి ఎలా ప్రవర్తిస్తాడో
అదే అతని నిజమైన వ్యక్తిత్వం

– థామస్ మెకాలె



ఇంతలో పిచ్చివాడు నిదానంగా నడిచి వచ్చి - విద్యాసాగర్ రావు ఎదురుగా పందిరి కింద నిలుచున్నాడు.

"సుట్టమా! ఒక బీడుంటే యియ్యి" అన్నాడు చెయ్యి చాపి.

విద్యాసాగర్ రావు తేరుకోలేదు.

పిచ్చివాడు ఎర్రగా ఉన్నాడు. దుమ్ము కొట్టుకుపోయినా ముఖం, కళ్ళు వింత తేజస్సుతో మెరుస్తున్నాయి. జుట్టు అట్టలు గట్టి, జడలు గట్టి తల మీద పెద్ద నల్లటి గంప బోర్లించినట్టుగా ఉంది. బట్టలు చిరిగిపోయి మట్టి గొట్టుకుపోయున్నాయి. పిచ్చివాడు పందిరి కింది నుంచి ఆకాశంలోకి చూశాడు. బీడీ సంగతి మరిచి పోయినట్టున్నాడు.

"అదిగో! అగ్గిదేవుడు బగబగమండుతున్నాడు. పాపం దునియల బరుపూర్తిగా నిండిపోయింది. తూరుపు నుండి గాలి వెడుతది. ఇండ్లకిండ్లు తెప్పల్లోలె లేసిపోతయి. ఇగో గీ గడి పుటుక్కున కూలిపోతది. గంగ పొంగి - సేపలు అగో! కన్పించే కొండల మీదికి ఎగబాకుతయి. అడివిల ఆకులు బాకులయితయి. కొమ్మలు గన్నులైతయి. గిదంత నాకే ఎరుక! రాబోయే దాని గురించి ఎచ్చరిక చేస్తే ఎవడూ పట్టించుకోడు" అన్నాడు అదో విధమైన గొంతుతో.

ఇంతలో జగన్ రావు వచ్చాడు.

ఉమ్మేసి పిచ్చివాడు మళ్ళీ వేప చెట్టు కిందికి చేరిపోయాడు.

విద్యాసాగర్ రావు ఇంకా తేరుకోనేలేదు.

"లైటుగ తీసుకో - దొరలున్న దగ్గర తప్పక పిచ్చివాళ్ళుంటారు. ఈ చుట్టుపక్కల గ్రామాలల్ల చాలామంది ఇలాంటి వాళ్ళుంటారు" జగన్‌రావు.

'పొద్దుటి నుండి జరుగుతున్న 'టైగర్ జోన్' ధర్నా ఇప్పటిది కాదు. ఇది అడివంత పురాతనమైంది. ఇది ఇట్లా వ్యక్తమయ్యింది. ఈ మొత్తం వ్యవహారంలో ఆదివాసులు దారులు వెదుకుతున్నారు. తను తప్పించుకోను సాకులు వెతుకుతున్నాడు. వెరీ క్లియర్!. తను దారులు వెతుకజాలడు. తన నేచర్ కాదు' విద్యాసాగర్ రావు మనసులో అనుకున్నాడు.

మరో ఐదు నిమిషాలల్లో బొలెరో రోడ్డు మీద పరుగెత్తింది. విద్యాసాగర్ రావు మెదడు కకావికలమైంది. ముఖ్యంగా దారులకు బదులు సాకులు వెతుకుతున్నామనేది పట్టేసింది.

"బట్, ఐ షుడ్ బీ గెట్ లాస్ట్ ఫ్రం దిస్ ఫ్యూడల్ విలేజ్, ఫ్యూడల్ విలేజ్ ఇమేజెస్ - ఇట్ ఈజ్ పెయిన్‌ఫుల్ - అదర్‌వైజ్ ఐ విల్ బీ టార్గెటెడ్ - బై మై సెల్ఫ్ ఆర్ థర్డ్ పార్టీ. నేనింకా ఈ పాత శరీరంలో, ఇంట్లో బతకడం - దుర్లభం.. బహుశా నేను మా నాన్న, చనిపోయిన మా అన్నల, తమ్ముడి ప్రేతాత్మనా? " జగన్‌రావు గొంతు వణికింది.

నిజంగా జగన్‌రావు ప్రేతాత్మేనేమోననే భావన విద్యాసాగర్ రావులో మెరిసింది. తనూ ప్రేతాత్మనేనా.. రియల్లీ టార్చర్!

కారాగింది. శివశంకర్, శ్రీను ఎదురొచ్చారు. శ్రీను డోరు తెరిచాడు. విద్యాసాగర్‌రావు కారు దిగి రోడ్డు మీద నిలుచు

న్నాడు. జగన్‌రావు మారు మాట్లాడకుండా, తనకేసి చూడకుండా కారు వెనక్కు తిప్పుకొని వెళ్ళిపోయాడు.

ఇంతలో టేకుటాకుల మీద సుడిగాలిలా పెద్ద పెట్టున రొద ప్రారంభమయ్యింది.

విద్యాసాగర్‌రావు ఇంకా తేరుకోనేలేదు.

"అక్రమంగా అరెస్టు చేసిన వాళ్ళను.."

"భేషరతుగా విడిచి పెట్టాలె.."

"పోరాడుదాం! పోరాడుదాం!"

"టైగర్‌జోన్‌కు వ్యతిరేకంగా పోరాడుదాం!"

"పోలీసు జులుం.."

"నశించాలె.."

నినాదాల హోరు హెచ్చింది. డప్పులు, డోళ్ళు ఉవ్వెత్తున మోగుతున్నాయి? ఒకటే రొద. బస్సులు, లారీలు స్టార్టు చేసిన రొద. హాహాకారాలు. తిట్లు, గొణుగుడు. అంతా గందరగోళం. గూడెం మీద పులి దుంకిన రొద. మనుషులు, పశువులు కకావికలైన రొద.

విద్యాసాగర్ రావు ముఖం వికసించింది. గుండెలు పొంగాయి. ఇంతదాకా ఆగిపోయిన రక్తం, శరీరం ఉరుకులు, పరుగులు పెట్టింది.

ఇంతలో డ్రైవర్ శ్రీను ఎగపోసుకుంటూ స్కార్పియో దగ్గరికి పరుగెత్తాడు. అతని వెనుకనే మేనేజర్ హెచ్.ఆర్.ఎ. శివశంకర్ హడావిడిగా విద్యాసాగర్‌రావు పక్కనే వచ్చి నిలుచున్నాడు.

డ్రైవర్ శ్రీను స్కార్పియో ఎక్కి దాన్ని స్టార్ట్ చేసి విద్యాసాగర్ రావు పక్కకు ఆపి తను దిగి - వెనుక డోరు తెరిచి పట్టుకున్నాడు ఆయన ఎక్కేందుకు.

విద్యాసాగర్‌రావు కారెక్కిండు. శివశంకర్ డ్రైవర్ పక్క ముందు సీట్లో కూర్చున్నాడు. సుళ్ళు తిరిగిన తుపాను దారి మళ్ళినట్టు రొద.

"ఏమయ్యింది? " శివశంకర్.

"లాఠీ చార్జ్ జరుగుతంది. పోలీసోల్లు ధర్నాలో ఉన్న హక్కుల వాళ్ళను ముఖ్యంగా కార్యకర్తలను అరెస్టు చేసిండ్లు" డ్రైవర్ శ్రీను.

స్కార్పియో కదిలింది. రెండుపక్కలా నిటారుగా సైనికుల్లా నిలుచున్న చెట్ల నీడలు రోడ్డంతా కప్పేశాయి.

తమకన్నా ముందు గల వాహనాలు కదిలాయి. స్కార్పియో అందులో దూరి కొంచెం దూరం నడిచింది.

రోడ్డుకు ఎడమ వైపున ఆదివాసీ మహిళలు పెద్ద గుంపుగా నిలబడి ధర్నా కొనసాగించాలని ప్రయత్నం చేస్తున్నారు. అరెస్టు చేసిన వాళ్ళను వొదిలిపెట్టాలని పెద్ద పెట్టున నినాదాలు చేస్తున్నారు.

తుపాకులు ధరించిన పోలీసులు ఒక దడిలాగా ఏర్పడి వాహనాలను ధర్నా ప్రదేశం నుండి ముందుకు పంపుతున్నారు. మైకులో ఎవరో తెలుగులో, గోండీలో -

'ప్రశాంతంగా అక్కడి నుండి ప్రజలు వెళ్ళిపోలి' అని హెచ్చరికలు జారీ చేస్తున్నారు. కొంచెం దూరంలో రెండు పోలీస్ వ్యాన్‌లు ఆగి ఉన్నాయి.

వాటిలో అరెస్టు చేసిన పురుషులను మాత్రమే నింపారు. ఆ వాహనాలల్లో నుండి వాళ్లు గొంతు నరాలు చిట్లేదాకా నినాదాలిస్తున్నారు. మీడియా వాళ్ళు హడావిడిగా తిరుగుతున్నారు. కెమెరాలు క్లిక్ మంటున్నాయి.

అద్దాలు దించిన స్కార్పియోలో విద్యాసాగర్‌రావు రోడ్డు మీద మహిళల్లో దేవి కోసం వెతికాడు. ట్రాఫిక్ మూలంగా కారు నెమ్మదిగా కదులుతోంది. ఆగి ఉన్న పోలీసు వ్యాను దగ్గర నిలబడి గోండు మహిళలతో ఏదో మాట్లాడుతున్న సర్కిల్ ఇన్‌స్పెక్టర్ ఆఫ్ పోలీసు విద్యాసాగర్ రావును గుర్తుపట్టి సెల్యూటు చేశాడు. ముడుచుకపోయిన విద్యాసాగర్ రావు ముఖం విచ్చుకున్నది.

# తొలి మరణాలు




మరణానికి వెయ్యి కారణాలు! ఒక్కో పద్ధతిలో మొదటగా మరణించినవారి వివరాలు..

★ కారు ప్రమాదంలో మరణించిన తొలి వ్యక్తి మేరీవార్డ్. ఆగస్ట్ 31, 1869లో లండన్‌లో కారు కింద పడి మరణించింది.

★ ఎలక్ట్రిక్ చెయిర్‌లో మరణిచిన తొలి వ్యక్తి విలియమ్ కిమ్లర్. భార్యని హత్య చేసినందుకు ఆగస్ట్ 6, 1890న మరణశిక్ష పడింది.

★ విమాన ప్రమాదంలో మరణించిన



తొలి ప్రయాణికుడు థామస్ సెల్ఫ్‌రిడ్జ్. సెప్టెంబరు 17, 1908లో విమానం కనిపెట్టిన ఆర్విల్ నడుపుతున్న సమయంలోనే ఈయన తల పగిలి మరణించాడు. ఆర్విల్ గాయాలతో బయటపడ్డాడు.

★ 'సెల్ఫ్‌డ్రైవింగ్' కారు ప్రమాదంలో మొదట మరణించింది మిస్టర్ బ్రేన్. ఒహాయో రాష్ట్రంలోని కేంటన్‌లో మోడల్ 'S' కారులో ఇతను మరణించాడు.

★ అంతరిక్షంలో మరణించిన తొలివ్యక్తి వ్లాడిమర్ కొమరోవ్. ఏప్రిల్ 24, 1967న ఇతను మరణించాడు.

★ కారుణ్యమరణం (యుథనేషియా) పొందిన తొలివ్యక్తి ఆస్ట్రేలియాకి చెందిన బాబ్ డెంట్. ప్రోస్టేట్ క్యాన్సర్‌తో బాధపడిన ఈయన సెప్టెంబర్ 22, 1996న డాక్టర్ ఫిలిప్ సహాయంతో ఆత్మహత్య చేసుకున్నారు.

★ అమెరికా సివిల్ వార్‌లో మరణించిన తొలివ్యక్తి నేన్సీ అటుక్స్ అనే నల్లజాతి బానిస. మార్చి 5, 1770న బోస్టన్‌లోని ఓ బార్‌లో ఈమెని బ్రిటీష్‌వారు చంపారు. దాంతో అమెరికన్ రివల్యూషన్ ఆరంభమైంది

★ ఉల్కతునక(మెటియోరైట్) తాకి మరణించిన తొలివ్యక్తి తమిళనాడుకి చెందిన వి. కామరోజ్. ఫిబ్రవరి 6, 2016న అంతరిక్షం నుంచి ఓ రాయి రాలి మీద పడి మరణించాడు. ఆ రాయి వల్ల నేలపై నాలుగడుగుల గొయ్యి కూడా పడింది!

★ స్వేగ్వే (పవర్‌బోర్డ్) ప్రమాదంలో మొదటగా మరణించింది లండన్‌కి చెందిన సవఫ్ అల్ యవయన్. ఈ కుర్రాడు డిసెంబర్ 2015లో మరణించాడు. డబుల్ డెక్కర్ అతని స్వేగ్వేని ఢీ కొట్టడంతో మరణించాడు.

---

అదే అధికారగర్వంతో అరెస్టయిన వారి దిక్కు చూశాడు విద్యాసాగర్. ఒక వ్యానులో నినాదాలిస్తున్న దేవి భర్త భీంరావును చూశాడు. తన ప్రత్యర్థిని అంతకన్నా ఎక్కువగా పోలీసులు ఏమీ చేయలేరా?

దేవి కన్పించలేదు.

ఇంతలోనే ఎడం పక్కలో గల మహిళల్లో కలకలం. దేవి తప్పించుకొని పరుగెత్తి రోడ్డు మీద అడ్డంగా పడుకున్నది. ఆమెతో పాటు మరో ముప్పయి మంది మహిళలు పోలీసు వలయం ఛేదించారు.

పోలీసులు గాబరా పడ్డారు.

స్కార్పియో ఆగిపోయింది. అక్కడ ఆడ పోలీసులు లేరు. కనుక ఆడవాళ్ళను ఏం చేయాలో మగ పోలీసులకు తెలియదు.

మళ్ళీ ట్రాఫిక్ ఆగిపోయింది.

హఠాత్తుగా తనే డోరు తీసుకొని కారు కిందికి దిగి సర్కిల్‌ను పిలిచి - "దాన్ని అరెస్టు చెయ్యండి" వికృతమైన, అసహ్యాకరమైన గొంతుతో విద్యాసాగర్ రావు పులిలా గురగురలాడాడు.

ఈ హఠాత్పరిణామానికి ఏమి చేయాలో తోచక శివశంకర్ కారు దిగిండు.

కారు చుట్టూ మహిళలు మూగిండ్లు. విద్యాసాగర్ రావు మీద దాడి చేసి బట్టలు

పీకారు. దవడలు నొక్కారు. ఎవరో టైర్ల గాలి విప్పే ప్రయత్నం చేశారు. కర్రలతో పటాపట్ కారు మీద మోదిండ్లు.

పరిస్థితి అదుపు తప్పుతోంది.

గుంపు చర్యలు ముదురక ముందే పోలీసులు పరుగెత్తికొచ్చి విద్యాసాగర్ రావును కారెక్కించిండ్లు. శివశంకర్ కూడా ఎక్కి కూర్చున్నాడు.

"సర్! ఏమనుకోవద్దు. మీడియా అంతా ఇక్కడే ఉన్నది. అసలే ప్రత్యేక తెలంగాణ రాష్ట్రం గొడవలు - వెరీ సెన్సిటివ్ సార్! ఆడవాళ్ళతో దురుసుగా ప్రవర్తిస్తే రేపు మీడియా.." ఎక్కడి నుండో వచ్చిన డి. యస్.పి. తెరిచి ఉన్న కారులోనికి వంగి విద్యాసాగర్ రావుతో గుసగుసలాడాడు.

డి.యస్.పి. లాఠీచార్జ్‌కు ఆర్డరిచ్చాడు.

గుంపు చెదిరిపోయింది.

"ఓన్లీ ఫైవ్ మినిట్స్ సార్!" ఇందాకటి సి.ఐ. మహిళల దగ్గరికి వెళ్ళిపోయాడు. పోలీసులు దేవిని ఎత్తి పక్కకు తీసుకవెళ్ళారు. మహిళలను ఒక్కొక్కరిని అట్లాగే రోడ్డు పక్కకు తీసుకెళ్ళి దించి పోలీసులు రౌండుగా వాళ్ళ చుట్టూ నిలుచున్నారు.

ఎవరో నొక్కిన విద్యాసాగర్ రావు భుజం, దవడలు బాగా నొప్పి పెడుతున్నాయి. అతని గాజు కళ్ళు కోపంతో ఎర్రగా మారిపోయాయి.

సబ్ఇన్‌స్పెక్టర్ పోలీసు వ్యానులతో అరెస్టయిన ఆదివాసీ యువకులతో జన్నారంకేసి కదిలాడు.

"జల్ - జంగల్ - జమీన్" భీంరావ్ కంఠం.

"హమారా - హమారా"

ఆ పహారా మధ్య చెట్ల కొమ్మలల్లో నుండి అంచెలంచెలుగా మోగి ఆ నినాదం అడవిలో మారుమోగుతోంది. వందల కంఠాలు నినాదాన్ని అందుకొని అడవిలోకి పంపుతున్నారు. అడవుల్లో, లొద్దుల్లో ఆ నినాదం మారుమోగుతోంది.. బహుశా గాలి ఆ నినాదాన్ని తనంత తానే మోసుకుపోతోంది.

స్కార్పియో కదిలింది.

శివశంకర్ ఊపిరి పీల్చుకున్నాడు.

స్కార్పియో ఏమన్నా డ్యామేజీ అయ్యిందేమోనని శ్రీను ఆలోచిస్తున్నాడు.

విద్యాసాగర్‌రావుకు కంపరంగా ఉంది. మంటగా ఉంది. నొప్పిగా ఉంది. కసిగా ఉంది.

రోడ్డు పక్క దేవి కంఠం మోగింది.

"పొడుస్తున్న పొద్దుమీద
నడుస్తున్న కాలమా..
భలె.. భలె.. భలె.."

పిడుగులు రాలినట్లు తుపాకీ తూటాలు మోగినట్టు.. ఆమె చుట్టూ గోండు మహిళలు కోరస్ యిస్తున్నారు..

అడవి అదురుతోంది.

పాట లయగా సాగుతోంది.

వాహనాలల్లో చాలామంది ఆ పాటతో జత కలిపారు.

"అదిగో రాజులు దొరలు వలస దొరలు
భూమిని నీళ్ళని ప్రాణుల్ని
సర్వస్వాన్ని చెరబట్టారు..
మా పాలన..
భలె.. భలె.. భలె.. హహ
మా పాలన
మాకేనని మండుతున్న గోళమా..
అమర వీరుల స్వప్నమా.."

దేవి పాడుతూ చేతిలో ఎర్రటి దస్తీతో నాట్యం చేస్తోంది.

ఆమెతో పాటు అక్కడున్న ఆదివాసీ మహిళలంతా నృత్యం చేస్తున్నారు.. కదిలే జనం కోరస్ ఇస్తున్నారు.

విద్యాసాగర్‌రావు కారు అద్దాలు దించి, మెడ తిప్పి వెనుకకు చూశాడు. దేవి మండుతున్న సూర్యగోళంలా కన్పించింది.

ఆ పాట వెంటాడుతుండగా నల్లని తారు రోడ్డు మీద నల్లటి స్కార్పియో టైగర్ జోన్‌లో వేగంగా పరుగెత్తుతోంది. ©

# తరాలు.. అంతరాలు

- అరిపిరాల సువర్ణ

**వేణు తల్లిదండ్రులిద్దరికీ చెన్నై వెళ్ళేందుకు టికెట్లు తెచ్చాడు.
వేణు భార్య 'ఏంటండీ, నేనేమో అత్తమామలు బావగారింటికి వెళ్ళకుండా
ఆపాలని తంటాలు పడుతుంటే మీరేమో ఏకంగా టికెట్లు తెచ్చేశారు?' అంది.
మామగారు కల్పించుకుని 'వాడికి మేం వెళ్ళాలనే వుంది..
అది నీకర్థం కావడంలేదా గీతా?' అన్నారు.
ఇంటింటి రామాయణాలను, వ్యక్తి వ్యక్తికీ మధ్యనుండే అంతరాలను
కళ్లకుకట్టినట్టు చిత్రించిన నవలిక '*తరాలు.. అంతరాలు*'**

"ఎందుకా స్కూలులోనే చేర్చాలని అంత పట్టుదలగా వున్నావు, మీరా..? " అన్నాడు వసంత్.

"అదే మంచి స్కూలు! ఎల్.కె.జి.లో చేర్పిస్తే పన్నెండో క్లాసు పూర్తయ్యేంత వరకూ ఏ ఇబ్బందీ వుండదు.. ఏ గ్రేడ్ స్కూలు.. పొద్దుట టిఫిను, ఆనక లంచ్ అక్కడే! డబ్బా కట్టి పంపిస్తే చల్లారిపోయి పిల్లాడు తినలేక ఇబ్బంది పడటం.. ఎందుకా అనవసర సమస్యలన్నీ? చదువు, ఆరోగ్యం రెండూ బాగుంటాయి. అర్థమయిందా దొరగారికి? " అంది మీరా.

"నువ్వేదీ ప్రాక్టికల్‌గా ఆలోచించవా? " అన్నాడు వసంత్.

"ఏమంటారు? " అంది మీరా.

"ఆ స్కూల్లో సంవత్సరానికి ఫీజు ఎంతో తెలుసునా? రెండున్నర లక్షలు..! పుస్తకాలు, యూనిఫామ్, వాహన ఖర్చు కలిపి మూడు పైనే.."

"ఆ! అవుతుంది. మనబ్బాయి బాగా చదువుకుని పైకి రావడానికి ఇప్పుడే విత్తనం నాటాలి"

"జిల్లాపరిషత్, కార్పొరేషన్ స్కూళ్లలో చదివినా పైకి రాగలరు. అందుకు నేనే ఉదాహరణ. నలుగురు పిల్లలకు ఇంతింత ఖర్చు పెట్టగలిగేంత సంపాదన ఆ కాలంలో మా నాన్నకు లేదు. అయినా నే పైకి రాలేదా? మంచి ఉద్యోగంతో పెద్ద జీతం రావడం లేదా? "

"బాగానే వుంది మీ వరస! తరువాత రోడ్డు దీపాల కింద అంటారు! మన అబ్బాయికి అంత ఖర్మ పట్టలేదే!"

"నువ్వు కుటుంబాన్ని నిర్వహిస్తున్నావు. ఖర్చుల గురించి ఆలోచించవా? "

"కుటుంబం అంటే అన్ని ఖర్చులూను"

"మన ఫ్లాటు లోను నలభైవేలు కడుతున్నాం. బయటి అప్పుకి పదివేలు.. ఇంటి ఖర్చులకు ముప్పైవేలు! వెహికలు పెట్రోలుకు పదివేలు.. నువ్వు వేసే చిట్టీలకు అయిదువేలు! ఇప్పుడు మనబ్బాయి స్కూలు ఖర్చు ఇరవైవేలు. లెక్కలు వెయ్యి నువ్వే.. లక్షా పదిహేనవుతుంది! టాక్స్ పోయి చేతికొచ్చేది ఒకటీ ఇరవై.. అంటే మిగిలేది అయిదువేలు. అదనపు ఖర్చేమైనా వస్తే మన్ని ఆదుకునేదదే!"

"అలాంటిదేదైనా వచ్చినప్పుడు చూసుకుందాం!"

"అంతేకాదు మీరా! అమ్మానాన్నలు పెద్ద

వాళ్లయినారు"

"వాళ్లు మీ తమ్ముడి దగ్గరున్నారుగా..?"

"తమ్ముడి దగ్గరుంటే మాత్రం మనకి బాధ్యత లేకుండా పోతుందా? వారికి ప్రతి నెలా ఇవ్వకపోయినా ఎప్పుడైనా కావాల్సొస్తే కొడుకుగా నేనేమైనా ఇవ్వద్దా?"

"ఎందుకు? మీ నాన్నకు నెలకు ఇరవై వేలు పెన్షను వస్తుంది. ఇంకో పదివేలు డిపాజిట్ల మీద వస్తుంది. మొత్తం ముప్పై వేలు.. మీ తమ్ముడికి వాళ్ల ఖర్చుకింద పది ఇచ్చినా ఇంకో ఇరవై వారి చేతిలో వుంటుంది"

"మరొకరి ఖర్చుల లెక్కలెయ్యొద్దు, అది తప్పు!"

"ఇంతకీ మీరు చెప్పాలనుకున్నదేమిటో? బాబును తప్పకుండా అందులోనే చేర్పించాలి. ఈ ఏరియాలో అందరి పిల్లలూ ఆ స్కూలుకే వెడుతున్నారు.."

"హంస ఉద్యోగం చేస్తున్నది. ఆమె భర్త పెద్ద బిజినెస్ మేన్! మన కాలనీలో చాలా మంది మహిళలు ఉద్యోగాలకెడుతున్నారు! నువ్వు గ్రాడ్యుయేటయినా ఏ ఉద్యోగమూ చెయ్యకుండా ఇంట్లో కూర్చున్నావు.."

"అనుకున్నా! అలా ఇలా వచ్చి ఆఖరికి నా ఉద్యోగం దగ్గరకొస్తారని నాకు తెలుసు.."

"మీరా! నువ్వు ఉద్యోగం చేస్తూండేదానివి.. చేతి నిండా జీతం తెచ్చుకుంటూండే దానివి.. ఇప్పుడన్నీ మానేసి ఇంట్లో కూర్చున్నావు" వసంత్ మాటల్లో నిరుత్సాహం.

"ఏం మాట్లాడుతారు మీరు? నాకు మాత్రం ఇంట్లో కూర్చోవాలని ఆశా? నా పరిస్థితులలా?"

"ఏం పరిస్థితులేమిటి? ఎవరూ పెళ్లిళ్లు చేసుకోలేదా? పిల్లల్ని కనలేదా? ఉద్యోగాలు చేయడంలేదా"

"చాల్లెండి.. అంతటితో ఆపండి! అలాంటి వారికి ఇంట్లోని వారి సహాయ సహకారాలున్నవి. నేను పెళ్ళయాక సంవత్సరం పాటు ఉద్యోగం చెయ్యలేదూ? ఇంటి పనులన్నీ చేసి ఆఫీసుకెళ్లలేదూ? మీ అమ్మ తాగిన గ్లాసు కూడా తీసికెళ్లి సింకులో పడెయ్యరే!"

"వారిలో లోపాలు చెప్పకు.. వాళ్లొచ్చి ఒక నెల మనతో వుండడం నీకు ఇష్టం వుండదేం?"

"అలా అనద్దు! మీ అమ్మగారికి నలుగురు సంతానం.. ఇద్దరు కొడుకులు, ఇద్దరు కూతుళ్లు.. ఎక్కడైనా ఒకచోట స్థిరంగా వున్నారా? ఇద్దరూ ఇల్లిల్లూ తిరుగుతుంటారు.. ఎందుకలా తిరగాలి? ఒక చోట వుండచ్చునుగా?"

"అర్థం లేకుండా మాట్లాడకు! కన్న నలుగురు పిల్లలు వారికి సమానం"

"అవును సమానమే! ఎవరికి వారి సహాయం కావల్సి వస్తుందో అప్పుడు వారి దగ్గరుండరు. అందుకనే ఎవరికీ దగ్గరకాలేకపోయారు! మంచో చెడో పెద్దవారు నిరంతరంగా మనతో వుంటే వారితో మనకో కమిట్‌మెంటు, వాళ్ళకు అవసరమైనవి చెయ్యాలన్న బాధ్యత వుంటుంది.. వాళ్ళిలా వుంటే ఏ కొడుకు మాత్రం బాధ్యత వహిస్తాడు?"

"పెద్దవారి లోపాలు ఎత్తి చూపించడం మానేసి, నవ్వు మన సమస్య గురించి ఆలోచించు మీరా"

"ఇదీ మన సమస్యే! నేను కడుపుతో వున్నప్పుడు నాకు వారు సహాయంగా వున్నారా? కూతురింటికి పరిగెత్తారు! ఆ సమయంలో నేనెంత కష్టపడిందీ మీకు తెలియంది కాదు"

అతను మాట్లాడలేదు.

"నాది నార్మల్ కేసయితే దిగులేం వుండదు.. కాంప్లికేటెడ్ అయి బెడ్ రెస్ట్ తీసుకోమన్నారు"

"తీసుకున్నావుగా!"

"ఎలా? మా అమ్మ వచ్చాక! ఆమె నన్ను చాలా జాగ్రత్తగా చూసుకున్నది"

"అది నేను కాదనలేదు. కానీ మన బతుకుల్ని చెరిచిందే ఆమె!"

"చాలాపండి వసంత్! మా అమ్మని తప్పు పట్టద్దు..!"

"నీకు ఆఫీసు పెద్ద దూరం లేదు. పైగా నేను బైకులో పొద్దున తీసికెళ్లి దించి సాయంత్రం తీసుకొస్తానంటే మీ అమ్మ వినలేదేం!"

"డాక్టర్లు అనుమతించలేదుగదా!"

"డాక్టర్లు అలాగే అంటారు.. వాళ్లు చెప్పేవన్నీ తప్పకుండా వినాలనేం లేదు! సరే అదిపోనీ.. జీతం లేని సెలవు, ప్రసవ సెలవు అని దాదాపు సంవత్సరం పైనే ఇంట్లోనే వున్నావు!"

"నిజమే! మరి బాబునెవరు చూసుకుంటారు? "

"సమస్య సృష్టించిన మీ అమ్మ చూసుకోవచ్చుగా? "

"ఆమెకు కుటుంబం వుంది.. పెళ్లి కావాల్సిన చెల్లెలు, చదువుకుంటున్న తమ్ముడు, ఆఫీసుకెళ్లే నాన్న. వాళ్లని వదిలేసి ఇక్కడొచ్చి వుండగలదా అమ్మ? "

"నువ్వు కడుపుతో వున్నప్పుడు వారందరినీ వదిలిపెట్టి వచ్చి నీతో వుండలేదా? "

"సరే, అప్పుడు మా అమ్మ వుంది, ఇప్పుడు మీ అమ్మ వుండచ్చునుగా? "

"ఆమె రావడం నీకు ఇష్టం వుండదుగా? "

"అయితే ఇప్పుడు ఏమంటారు? చూడండి నూటికి తొంభైమంది అమ్మానాన్నలు కూతుళ్ళకు సపోర్టు చేస్తారు. అల్లుళ్ళు, వారి కన్నవారి లోపాలను ఎత్తి చూపిస్తారు!"

"సరే వదిలెయ్యి, ఇది మన కుటుంబం. ఖర్చులు పెరిగాయి. ధరలు రోజురోజుకు పెరుగుతున్నాయి.. అనుకోని ఖర్చులెన్నో వచ్చి పడుతున్నాయి.. జరగాల్సిన వాటి గురించి మాట్లాడుకుంటే మేలు!"

"చెప్పండి"

"ఏ అవసరాలనూ తగ్గించుకోలేకపోతే.. రాబడినైనా పెంచుకోవాలి!"

"ఎలా? "

"ఏం కష్టం లేదు.. నీకు ఉద్యోగ అనుభవం వున్నది.. ఇప్పుడు అప్లై చేసినా దొరుకుతుంది.. పాత కంపెనీలో కూడా దొరకొచ్చు.. అధమ పక్షం నలభై వేలైనా చేతికొస్తాయి..!"

"ఏం చెప్తున్నారు? బాబుని ఎవరు చూసుకుంటారు? ఎక్కడ వదులుతాం? "

"మా అమ్మానాన్నవాళ్లను మనతోనే వుంచుకుంటే సరి!"

"వాళ్లు ఒకచోట స్థిరంగా వుండలేరు"

"అడిగి చూద్దాం"

"అడగండి కానీ అనేక సమస్యలొస్తాయి"

"ఏం సమస్యలు? "

"అవన్నీ మీకు అర్థం కావు, కిచెన్ పాలిటిక్స్ చాలా ఉంటాయి"

"నువ్వనేదేమిటి? "

"వాళ్ళొచ్చి ఎప్పటికీ ఉంటే మంచిదే, ఆ తీరే వేరుగా వుంటుంది. కానీ విడిగా అలవాటు పడ్డాక కలిసి వుండడం వీలవదు"

"మావాళ్ళ రాక నీకిష్టం లేకపోతే మీ అమ్మగారినే వచ్చి ఉండమను"

"అదసలు వీలవదు. కుటుంబాన్ని వదిలేసి అమ్మ రావడం కుదరనిపని"

"సో, ఇద్దరికీ వీలుగాకపోతే బాబుని స్కూల్ అటాచ్డ్ క్రష్‌లో ఉంచుదాం!"

"అది నాకిష్టం లేదు. కూలీకి పనిచేసే ఆయాలు తల్లిలా ప్రేమగా చూస్తారా పిల్లల్ని? "

"తప్పు.. కన్నతల్లికన్నా ఎక్కువ ప్రేమగా చూసుకునే సవతి తల్లులు, పెంపుడు తల్లులు, ఆయాలు ఎంతోమంది వున్నారు. ఇలా ఎవరూ వద్దంటే ఎలా? "

"ఇదిగో చూడండి! బాబు పెరిగి తన కాళ్లమీద తను నిలబడేంతవరకూ నేనే పెంచుతాను.. ఎవరి దగ్గరా వుంచను!"

"అలాగైతే ఈ జన్మలో నువ్వు ఉద్యోగం

చెయ్యలేవు"

"నేనేం చేయను? పరిస్థితి అలాంటిది"

"సరే నువ్వు దేనికీ ఒప్పుకోవు కానీ, డబ్బు చాలకపోతే మాత్రం నన్ను అడగకు. ఐ.టి. సంస్థలు ప్రస్తుతం బాగాలేవు. ఇప్పుడున్న పరిస్థితుల్లో జీతాలు పెరగవు, ప్రమోషన్లు రావు. ఉద్యోగంలోంచి తీసేయకుండా వుంటే అదే గొప్ప విషయం!"

"ఎందుకిలా అంటున్నారు? "

"మొదటిది రాబడికి సరిపోయే బడ్జెట్ వేసుకుని ఆ పరిధిలో ఖర్చు చేసే సమర్థత ఉండాలి. రెండోది పెద్దవారితో కలిసిమెలిసుంటూ గౌరవ, అభిమానాలతో చూడగల్గాలి. రెండూ లేకపోయాక అనుభవించాల్సిందే! సమస్యలు పెరిగితే నువ్వే ఏదో ఒకటి చేస్తావు!" అనేసి వసంత్ చిరాకుగా వెళ్ళిపోయాడు.

మీరా చిరాగ్గా వుండిపోయింది.

★ ★ ★

చిన్నవాడు వేణు దగ్గరున్నారు తల్లిదండ్రులు పరశురామయ్య, కళ్యాణిలు.

వేణు భార్య గీతకి భూదేవంత సహనం. వేణుది సెంట్రల్ గవర్నమెంటుద్యోగం. గీత ఇంటి పనులన్నీ చేసి బయలుదేరుతుంది. పెద్దవారితో గౌరవంగా నడుచుకుంటుంది! ఒక పాప. నాలుగు సంవత్సరాలు. మీరా కొడుకు కన్నా పెద్ది. దగ్గరి స్కూలుకెడుతోంది. గీతకు అత్యాశలు లేవు. ఉన్నదానితో తృప్తిగా జీవించాలనే తత్వం. అత్తమామలను 'ఎప్పుడూ తమతోనే వుండిపోండి' అనే విశాలమైన మనసు. వారిక్కూడా గీతంటే ఎంతో అభిమానం.

"కాదమ్మా! నలుగురు సంతానం వుండగా ఎప్పుడూ ఒకరి దగ్గరే వుండి ఎందుకు భారమవడం? మా ఖర్చులకని డబ్బులిచ్చి ఒక్కొక్కరి దగ్గర మూడేసి నెలల చొప్పున వుంటాం. ఏడాది పొడుగునా అలా తిరుగుతూంటాం. మాకంటూ సొంత ఇల్లు లేదు. కనుక ఒకరకంగా దేశదిమ్మరులం. మా ఇద్దరిలో ఎడబాటనేది వస్తే అప్పుడు ఆలోచిస్తాం!" అన్నాడు పరశురామయ్య.

## కొత్తగాలి...

**దేశంలో**
**రాష్ట్రాల విభజన**
**పరిపాలనా సౌలభ్యానికి**
**నీళ్ల తగాదాలకు కాదు!**

– గుడిమెట్ల గోపాలకృష్ణ,
అరసవల్లి, శ్రీకాకుళం జిల్లా

మూటాముల్లే సర్దుకుంటూ "రేపు మేం బయలుదేరతామమ్మా" అంది కల్యాణి.

"ఎక్కడికత్తయ్యా? " అడిగింది గీత.

"వసంత్ దగ్గరకి.. ఏప్రిల్, మే, జూన్ వాడి దగ్గరేగా మేముండేది"

"అమ్మా! అన్నయ్య వుంటున్నది చెన్నైలో. ఈ మూడునెలలు అక్కడ ఎండలు మండిపోతాయి. ఊటీలో చెల్లి సుజి వాళ్లింటికెళ్ళి వుండచ్చుగా? ప్లెజెంట్‌గా వుంటుంది? "

"నిజమేగానీ నాయనా, ఆ సమయంలోనే సుజి అత్తమామలు వచ్చి వుంటారు. మేమూ వెళ్తే వాళ్లకు ఇబ్బంది!"

"ఇబ్బందిగా ఏముంటుందత్తయ్యా? మీకు మీ అమ్మాయిపై హక్కులేదా ఏమిటి? "

"వుంటుంది గీతా! అత్తగారు ఇటు పుల్ల తీసి అటు పెట్టదు. సుజి ఒక్కత్తే కష్టపడాలి! నేను సహాయం చెయ్యడం వారికిష్టం వుండదు. చప్పున ఏదో ఒకటి అనేస్తారు. ఎందుకిలాంటి సమస్యలన్నీ కోరితెచ్చుకోవాలి? వాళ్లు లేని సమయంలో వెడితే ఇబ్బంది వుండదు. సమస్యలు రావు"

"నువ్వాగు గీతా! వారికెలా బాగుంటే అలా చేస్తారు గానీ నువ్వేం చెప్పకు"

"వేణూ, గీతని చెప్పనీ.. అందులో తప్పేం లేదుగా"

"అక్కరలేదు, అన్నిసార్లూ మన సలహాలు అందరికీ నచ్చాలనేంలేదు.. జాగ్రత్తగా మాట్లాడడం అందరికీ మంచిది"

వేణు మంచబ్బాయే! కన్నవారిని మర్యాదగానే చూసుకుంటాడు. కానీ చేరువగా వుండడు. తన అభిప్రాయాలు చెప్పడు, సలహాలివ్వడు. అలా కలుగచేసుకోవడం అతనికి సుతరాము గిట్టదు. అతని విషయాల్లో ఇతర్ల జోక్యమూ నచ్చదు.

పెద్దవాడు వసంత్ అలా కాదు. అందరితోనూ పూసుకు తిరుగుతాడు. కానీ మీరా చేరికగా వుండదు. గీత అందుకు విరుద్ధం. ఆమె అందరితోప్రేమగా, కలుపుగోలుగా వుంటుంది.

కన్నవారు వస్తే ఎందుకొచ్చారని వేణు అడగడు. రాకపోతే ఎందుకు రాలేదని విచారించడు. బడ్జెట్ వేసి ఇంటికి ఖర్చు పెడతాడు. ఎక్కువ ఖర్చు ఒప్పుకోడు. డ్రెస్సులు, నగలు, అలంకార సామాగ్రి ఖర్చులసలు సమ్మతించడు. కూతుర్కైనా అక్కరలేనివి కొనిపెట్టడు.

తమ వద్ద ఉన్నప్పుడు తండ్రి నెలకు పదివేలు ఇస్తారు. అలా ఇవ్వడం ఒక్క రోజు ఆలస్యమైనా ఏమాత్రం మొహమాటం లేకుండా అడిగి తీసుకుంటాడు. వారి మూలంగా అదనంగా ఏదైనా ఖర్చు చేయాల్సివస్తే వారినుంచే ముక్కుపిండి వసూలు చేస్తాడు. అది గీతకు ఇష్టంలేక "ఏమిటిది? వారు మిమ్మల్ని కన్న తల్లిదండ్రులు. ప్రతీదానికీ వాళ్లనుంచి డబ్బు వసూలు చేస్తారేమిటి? " అని కాస్త గట్టిగానే అడుగుతుంది.

"ఇందులో తప్పేంలేదు గీతా! సెంటిమెంటు ఎవరినీ బతకనివ్వదు. అది ముందు అర్థం చేసుకో! డబ్బు అవసరం వస్తే మనకెవ్వరూ సాయపడరు"

వేణు స్వభావం పరశురామయ్య, కళ్యాణిలను చాలానే బాధించేది. కానీ దానికి వారు మెల్లగా అలవాటు పడిపోయారు.

★ ★ ★

ఉదయాన్నే చాలా హడావిడిగా వుంది. కొడుకు స్కూలు అడ్మిషను కోసం ఒక వి.ఐ.పి. సిఫార్సు లెటరు తీసుకుంది మీరా.

"సంవత్సరానికి రెండు లక్షలు కట్టడం గాక ఇంకా సిఫార్సు కూడానా? ఇలాంటి స్కూల్లోనా బాబుని చేర్పించేది? ఈ స్కూలులో చదివి పేరుప్రఖ్యాతులు సంపాదించిన గొప్ప వ్యక్తులు ఒక్కరైనా తెలుసా? తెలిస్తే వారి వూరేమిటి? పేరేమిటి? చెప్పు!" అన్నాడు వసంత్.

"మీ వితండ ప్రశ్నలకు సమాధానాలు చెప్పే ఓపిక నాకు లేదు. వచ్చాక మాట్లాడుకుందాం"

"ఇవ్వాళే అడ్మిషన్ అయిపోతుందా? "

"మాట్లాడాను. అడ్మిషన్ ఇస్తే తతిమా డబ్బు వచ్చేవారం కట్టాలి. రెడీ చెయ్యండి"

"ఈ యాభైవేలకేం చేశావు? "

"బ్యాంకులో ఓవర్‌డ్రాఫ్ట్ తీసుకున్నాను"

"వడ్డీ ఎక్కువ కదా!"

"ఫరవాలేదు, ఇలాంటప్పుడు ఎక్కువ తక్కువలు చూసుకోకూడదు"

"వూ! సరే, టిఫినేం చేశావు? "

"ఏం చెయ్యలేదు. బయట తినండి. నేను, బాబు స్కూలు క్యాంటీన్లో తింటాం"

"అమ్మానాన్నా వస్తున్నారే"

"రానియ్యండి. అత్తయ్య చేసుకు తింటారు" అని కొడుకుని రెడీ చేస్తోంది.

మీరా బయలుదేరే వేళకు వాకిట్లో ఆటో ఆగింది.

"నాన్నగారూ రండి! అమ్మా రా!" అని వసంత్ ఆహ్వానించాడు.

మీరా ఏం మాట్లాడలేదు.

పెద్దవాళ్ళిద్దరూ లోపలికొచ్చి కూర్చున్నారు. కళ్యాణి మనుమడితో "నాయన

అక్షరం

సంతోషం డబ్బుతో రాదు
అది మనసుకు సంబంధించినది

– సోక్రటీసు



మ్మను వచ్చాసురా బాబూ!" అంటూ ఎత్తుకోబోతే "అత్తయ్యా! వాడు స్నానం చేసి నీటుగా వున్నాడు! రైలులో ప్రయాణం చేసి వచ్చారు. నేను గుడికెళ్లి అట్నుంచి స్కూలుకి తీసుకెళ్లాలి! ఇప్పుడు వాడినెత్తుకోకండి" అంది మీరా.

కళ్యాణి మొహం చిన్నబోయింది!

ఇది ఆవిడకేం కొత్త కాదు. మీరా ఇలా మొహాన కొట్టినట్లు మాట్లాడే మనిషే! కానీ దాదాపు తొమ్మిది నెలల తరువాత వచ్చినవారికిచ్చే ఆహ్వానమే ఇంత అధ్వాన్నంగా వుంది.

పరశురామయ్య మొహం ఎర్రబడింది.

"ఏమండీ! టైమవుతున్నది. మేం బయలుదేరుతాం" అని మీరా అత్త మామలతో చెప్పకుండా కొడుకుని తీసుకు గడప దాటుతూంటే వసంత్‌కు బాధ కలిగించింది. నిస్సహాయంగా చూస్తూ "సారీ అమ్మా! ఏం అనుకోకు. మీరా స్వభావం మీకు తెలిసిందేగా! మీరిద్దరూ మొహాలు కడుక్కురండి. నేను కాఫీ కలిపి పట్టుకొస్తా. తాగి మీరు స్నానాలు చేసేంతలోగా హోటలుకు వెళ్లి టిఫిన్ పట్టుకొస్తా" అన్నాడు.

"ఇంట్లో ఏం చేసుకోలేదా ఏమిటి!"

"లేదమ్మా! ఏం చేయలేదు.. బాబుకు అడ్మిషన్ కోసం వెడుతున్నది"

"హోటలుకెందుకురా! స్నానం చేసి నేనే ఏదైనా చేస్తాను. పిండి వుందా? " అంటూ ఫ్రిజ్ తెరిచి చూసి "పిండి లేదు. సరే పొంగలో ఉప్మానో చేస్తాలే!" అని డబ్బాలు చూస్తే బియ్యం మాత్రం వున్నయి. పెసర పప్పులేదు. రవ్వలేదు.

"వసంత్! ఏమీ లేవేమిట్రా? ఏం వండుకు తింటున్నారురా? " అంది.

"సగం రోజులు హోటలే గతి"

"అన్నాళ్లు హోటల్ తిండి తింటే ఒంటికి పడుతుందా? పైగా బోలెడు ఖర్చు!" అని భర్తతో "ఉప్మాకి రవ్వ కూడా లేదు.. ఏమండీ! నేనో లిస్టు రాసిస్తాను. మీరెళ్లి తీసుకురండి. కూరలు కూడా. మొదట రవ్వ, పచ్చి మిరపకాయలు, టెంకాయి పట్టుకురండి.. మిగతాలిస్టు ఇచ్చేసి వస్తే వాడే ఇంటికి పట్టుకొచ్చిస్తాడు" అంది.

"అమ్మా! వద్దమ్మా.. నేను తీసుకొస్తాను" అన్నాడు వసంత్.

"మేం తీసుకొచ్చినా తప్పేం లేదురా! ఇది మా కొడుకిల్లేగా" అని పరశురామయ్య కాఫీ తాగేసి లిస్టు తీసుకు బయలుదేరాడు.

"స్నానం చేసిరా వసంత్! ఇల్లంతా చిందరవందరగా వుంది నేను సర్దుతాను" అంది కల్యాణి.

"వచ్చీరాగానే ఎందుకమ్మా శ్రమ? "

"ఇందులో శ్రమ ఏముందిరా? " అంటూనే ఇల్లంతా నీటుగా సర్దింది.

తండ్రి బజారీ సరుకులు తేగా, తల్లి అర గంటలో ఉప్మా, చట్నీ ఘుమఘుమలాడేలా చేసింది.

ముగ్గురూ స్నానాలు చేసి కలిసి కూర్చుని తిన్నారు.

"అమ్మా! నువ్వు చేసిన ఉప్మా అమృతంలా వుంది. నీ చేతి వంట తిని ఎన్నాళ్లయిందో? " అంటూ మెచ్చుకున్నాడు కొడుకు.

"మధ్యాహ్నం భోజనానికి వస్తావుగా? "

"ఉహూ రానమ్మా.. మళ్లీ రాత్రికే! ఫల హారం వద్దు, అన్నమే వండెయ్యమ్మా!"

"అలాగే!"

వసంత్ మరో స్ట్రాంగు కాఫీ తాగి ఆఫీసుకు బయలుదేరాడు.

"బైకేగా? "

"ఆ, అవునమ్మా!"

"ఏం కుంటుతున్నావు? "

"పొద్దున కాలు బెణికి నడవడానికి కష్టంగా వుందమ్మా!"

"ఇవాల్టికి సెలవు పెట్టు, బెణుకు మంత్రం వేసి మందు రాస్తాను"

"సరే! ఆఫీసుకెళ్ళే మూడ్ కూడా లేదు! మీ ఇద్దర్నీ చూసి తొమ్మిది నెలలైంది!" అన్నాడు.

"మరింకేం? లీవ్ పెట్టి ఇంట్లో వుండు. మధ్యాహ్నానికి రుచికరమైన లంచ్ తయారు చేస్తా" అందావిడ.

పది గంటలకు అంగడి నుంచి సరకులొచ్చాయి. బియ్యం, పప్పులు, నూనె, చింత పండు, బెల్లం అన్ని సరుకులూ.. దాదాపు అయిదువేల రూపాయల బిల్లు..

"నాన్నా! ఇప్పుడు మీరిచ్చెయ్యండి. నేను ఏ.టి.ఎమ్. నుంచి తీసుకొచ్చిస్తాను"

"నువ్వేం ఇవ్వక్కరలేదు! ఏంట్రా! పెద్ద లెక్కలేస్తున్నావు? " అంది తల్లి.

వాకిట్లో కూరగాయలొస్తే ఏరి లేతవి, పుచ్చులు లేనివి చూసి కొన్నది. ఆరేడు వందల రూపాయల కూరలు, పండ్లు కొన్నది. ఒక్కగంటలో ఇల్లంతా ఊడ్చి, తుడిచి బట్టలుతికి ఆరేసింది.

"సరే! నేను వంట మొదలెడతాను. మీరా, బాబు భోజనం వేళకు వచ్చేస్తారుగా? " అందావిడ.

"లేదమ్మా! బయట తినేసి వస్తారు. వాళ్ళకు వండకు"

"సరే, నీకిష్టమైన గుత్తి వంకాయ కూర, టమేటా పచ్చడి, ఉల్లిపాయ సాంబారు చేస్తాను"

"వావ్! సూపర్ అమ్మా!"

"బెండకాయ వేపుడు చెయ్యమంటావా? "

"వద్దు, కంద చిప్సు, అప్పడాలు.."

"అలాగే"

"బాబుని ఏ స్కూల్లో చేర్పిస్తున్నారు? " తండ్రి అడిగాడు.

కొడుకు ఏ స్కూలైందీ చెప్పగా "సీటు దొరికిందా? చాలా ఖరీదైన స్కూలే!" అన్నారాయన.

"మంచి భవిష్యత్తు కోసం తప్పదు మరి!"

"చదివే పిల్లల భవిష్యత్తు ఏ స్కూలులో చదివినా బాగానే వుంటుంది రా!"

"వసంత్ నువ్వు రా, బాబూ! కాలికి మందు రాస్తాను" అని వేడి కొబ్బరినూనెలో హారతి కర్పూరం రంగరించి వసంత్ కాలికి రాసి మర్దనా చేసింది కల్యాణి.

మందు ప్రభావం కన్నా అమ్మ చేతి స్పర్శ నొప్పిని తగ్గించిందనవచ్చు!

"ఇప్పుడెలా వుంది నాయనా? "

"నీ చేతి స్పర్శే మందు! వేణు ఎలా వున్నాడమ్మా? "

"బాగున్నాడు రా!"

"గీత చాలా మంచి అమ్మాయి. అందరినీ ఆదరిస్తుంది!" అని మరదలిని ప్రశంసించాడు. అతని మనసులో భార్య మెదిలింది.

మీరాను ఎదిరించలేం. ఆమె చెప్పిందే వేదం అన్నట్లు ఆచరించాల్సిందే! అమ్మకు అది నచ్చదు. అయితే కూతురైనా కోడలైనా తప్పు పట్టడం అమ్మకిష్టం వుండదు. తనకు చేతనైనంతవరకు పనిచేస్తుంది. విమర్శ అనవసరం అనుకునే మన స్తత్వం. సాధారణంగా పెద్ద వయసులో విసుగు, అనవసర కోపం వుంటాయి. ఆ గుణాలేవీ ఆమెలో లేవు. పక్షపాతం అసలు లేదు. ఆ విషయం గీత బాగా అర్థం చేసుకుంది. మీరా అర్థం చేసుకోలేదు. తండ్రి పూర్తి వ్యతిరేకం. ఇష్టం లేకపోతే

మాట తూలతారు. ఒక్కోసారి వాగ్వాదం పెద్దదై పోట్లాటగా మారుతుంది. గీత యితే మౌనంగా వుండిపోతుంది. మీరా వదలదు. సంబంధ బాంధవ్యాలు, పెద్దరి కాలు చూడకుండా వాదిస్తుంది, ఎదురించి మాట్లాడుతుంది. అలాంటప్పుడు వసంత్‌కు కంగారుగా వుంటుంది. కల్యాణి సామరస్యంగా మాట్లాడి వాతావరణాన్ని తేలిక పరుస్తుంది. అది మీరాకు ఇష్టం వుండదు.

కబుర్లు చెప్తూనే తల్లి వంట మొదలుపెట్టింది. కాసేపటిలోనే ఘుమఘుమలాడే వంట సిద్ధమైంది.

వసంత్ తల్లి వంటను మెచ్చుకుంటూ కాస్త ఎక్కువగానే లాగించేసి "ఇలా రోజూ తిన్నానంటే నెలకే డబుల్ వెయిట్ అయిపోతానమ్మా" అన్నాడు.

"నువ్వు బాగా చిక్కిపోయావురా..!"

"నువ్వు నీ కొడుకుని లావుగా చెయ్యాలనుకున్నా నీ కోడలు చెయ్యనివ్వదులే!" అన్నాడు పరశురామయ్య.

మూడు గంటలకు మీరా, బాబు వచ్చారు. బాబుని ఎత్తుకొచ్చి తీసికెళ్లి బెడ్ మీద పడుకోబెడ్తూ "ఆటో బయట నిలబడుంది. డబ్బులిచ్చి పంపండి!" అంది.

వసంత్ వెళ్లి ఇచ్చి వచ్చాడు.

"మీరేంటి.. ఆఫీసుకెళ్లలేదు? "

"పొద్దున కాలు బెణికింది. నడవలేక సెలవు పెట్టాను. అమ్మ మందు రాసింది"

"అప్పుడే అమృతాంజనం రాసుకునుండాలి. వీళ్లు రాగానే సెలవా? "

"మేం సెలవు పెట్టమనలేదు, వాడే పెట్టాడు" అన్నాడు పెద్దాయన.

"నేను మిమ్మల్ని అనలేదు మామయ్యగారూ! వసంత్ మీరు సెలవులు వృథా చేస్తున్నారు! తరువాత సెలవులన్నీ అయిపోయి ఏదైనా ఎమర్జన్సీకి సెలవు పెట్టాల్సి వస్తే జీతం కట్ అవుతుంది" అంది మీరా.

పరశురామయ్యకు కోపమొచ్చి "నువ్వు ఇంట్లో కూర్చుని ఎన్నయినా చెప్తావు. బయటికెళ్లి ఉద్యోగం చేసొచ్చేవాడికి అలుపు సొలుపు వుండవా? " అన్నాడు.

"ఆయన కుటుంబ భారం మోసే మగవారు మామగారూ! అలాంటాయనకు అలుపూ సొలుపులుండకూడదు!"

"అమ్మా! కుటుంబ భారం మొయ్యాల్సిన బాధ్యత కేవలం మగాళ్లది మాత్రమే కాదు. ఆడవారికీ ఉందమ్మా. ఇప్పుడంతా ఆడవారు మగవారితో సమంగా ఉద్యోగాలు చేస్తున్నారుగా! అందాకా ఎందుకు? మన కుటుంబంలోనే వేణు భార్య గీత ఉద్యోగం చేస్తూ సంపాదించు కురావడం లేదూ? నా కూతురు సుజి చెయ్యడం లేదూ? " అన్నాడాయన తగ్గకుండా.

"ఏమిటండీ ఇదంతా? ఎందుకీ వాదనలన్నీ? మాట్లాడకుండా వుండరాదా? " అంది కల్యాణి.

"ఎందుకే నా నోరు మూయిస్తావు? ఆవిడ మాట్లాడొచ్చు గానీ.. నేను మాట్లాడకూడదా? "

"సరేగానీ మీరా! బాబు అడ్మిషన్ విషయం ఏమైంది? " అందావిడ కోడలి వైపు తిరిగి.

"ఎందుకు మాట మారుస్తారు? రాగానే ఆ కోడలితో పోల్చి నన్నెందుకు తక్కువ చేసి మాట్లాడాలి? "

## కొత్తగాలి...

**తింటే**
**పిజాలే తినాలి!**
**చూస్తే**
**వాట్సపే చూడాలి!**

– ఆర్.ఎస్. హైమవతి,
చెన్నై



"నిన్నెవరమ్మా తక్కువచేసి మాట్లాడారు? నీ భర్త ఒక్కరోజు సెలవు పెట్టినందుకు మాట్లాడింది నువ్వే కదమ్మా!" అందుకున్నాడు పరశురామయ్య.

"అందుకాయన్ని సమాధానం చెప్పనియ్యండి మామయ్యా! మీరెందుకు మధ్యలో కలుగచేసుకుంటారు? "

"వాడు నా కొడుకు, వాడి తరపున నేను మాట్లాడొచ్చమ్మా"

"ఎప్పుడూ ఆయన్ను అనుసరించే భార్యను.. కష్టనష్టాలను అనుభవించే దాన్ని నేను"

"అలా నువ్వు కష్టనష్టాలను అనుభవిస్తున్నదానిలా నాకనిపించడం లేదే! వాడు కష్టపడ కూడదనుకున్నదానివైతే చదువుకున్న నువ్వు ఉద్యోగం చెయ్యకుండా ఇంట్లో గోళ్లు గిల్లుకుంటూ కూర్చోవు" పరశురామయ్య తగ్గలేదు.

"నేను బయటికెడితే బాబుని ఇంట్లో ఎవరు చూసుకుంటారు మామయ్యా? మీరిద్దరూ ఆ బాధ్యత తీసుకుంటారా? నాకు పురుడు కష్టమైనపుడే మీరిద్దరూ మీ అమ్మాయి దగ్గరున్నారే తప్ప నా దగ్గరుండలేదే? మా అమ్మేగా అన్నీ చేసింది!"

"అయ్యయ్యో! మీరా.. జరిగిపోయిన విషయాలన్నీ ఇప్పుడెందుకు తిరగతోడడం? " సర్దిచెప్పబోయాడు వసంత్.

"ఆ విషయం మీ నాన్నగారికి చెప్పండి. నిష్ఠూరంగా మాట్లాడింది ఆయనేగా? "

"చూడమ్మా! నేనేం నిష్ఠూరంగా అనలేదు! బిడ్డను గర్భంలో మోసే తల్లులు నొప్పులొచ్చేంత వరకు పనికి వెడుతున్నారు! గీతకు నొప్పులొచ్చేసరికి ఆమె స్కూలులోనే వుంది"

"నా కథ అది కాదు!"

"అందరి కథలూ ఒకటే! మీ అమ్మ నిన్ను ఉద్యోగానికి పోనియ్యలేదు. ఒకసారి మానేశాక మళ్లీ వెళ్లబుద్ధి కావడం లేదు. టచ్ పోతుంది"



"మీరెప్పుడూ ఇక్కడే వుండి బాబుని చూసుకుంటారా? నేను ఉద్యోగానికెళ్లడా నికి రెడీ! మీరా సవాలు చేసింది.

"మేం సిద్ధంగానే వున్నామమ్మా!" అంది అత్తగారు.

"ఎందుకు కల్యాణీ! వచ్చినవారిని లోనికి రండని, ప్రేమగా పలకరించనైనా లేదు. ఇప్పుడిలా పోట్లాడింది. ఇక్కడెలా వుండ గలం? మనం పెద్దవాళ్లమైపోయాం. ప్రేమాభిమానాలు లేనిచోట ఎలా వుండ గలం? " అన్నాడు మామగారు.

"తప్పులెంచుతూ ప్రతిదాంట్లో లోపాలనే ఎత్తి చూపి సాధిస్తూండే పెద్దవారితో కలి సుండడమూ కష్టమే!" అంది మీరా.

"అయ్యో! మీరా, నువ్వు ఆపవా? " అన్నాడు వసంత్.

"ఆ మాట మీ నాన్నగారికి చెప్పండి"

"ఇదిగో చూడమ్మా! రాగానే చూస్తే ఇంట్లో వండుకునేందుకు ఒక్క సామాను లేదు, కూరలు లేవు. ఫ్రిజ్‌లో పాలు లేవు, పిండి లేదు. నువ్వేం కాపురం చేస్తు న్నావు? పెద్దవారిని తప్పుపట్టి మాటల నడం మాత్రం తెలుసు" పరశురామయ్య వాక్ప్రవాహం ఆగలేదు.

మీరా కోపంగా చూసింది.

"అవును మీరా! నాన్నగారే పచారికొట్టు కెళ్ళి సరుకులన్నీ పట్టుకొచ్చారు. అయిదు వేలు ఖర్చయింది. మరో ఏడొందలతో పండ్లు, కూరగాయలు, పాలప్యాకెట్లు తెచ్చారు. టిఫిను, వంట అన్నీ అమ్మ చేసింది"

"ఓహో! అలాగా? ఆ ధైర్యంతోనా మీ

నాన్నగారు ఇన్ని మాటలు మాట్లాడారు!"

"ఏమిటి మీరా! అలా అంటావు? " వసంత్ ఆవేదన.

"ఇరవైకిలోల బియ్యం ఎందుకు? నూనె ఐదు కిలోలెందుకు? " మీరా ప్రశ్నలు.

కళ్యాణి కల్పించుకుని "పసివాడితో చేరి ఐదుగురం వున్నాం. పోనీ! మమ్మల్ని వది లెయ్యి మేం ఇప్పుడొచ్చాం. మీ ముగ్గురికీ అక్కరలేదా? " అంది.

"నేను ఒకేసారి కొనిపెట్టను! బియ్యం వంటికి మంచిదికాదని తగ్గించేశాను! వేపుళ్ళు చేయను. నూనె పదార్థాలు పూర్తిగా మానేశాను, కొలెస్ట్రాల్ పెరిగిపో తుందని. రవ్వ, మైదా, గోధుమపిండి ఎక్కువకాలం నిలవుంటే పురుగు పడు తుంది. ఎక్స్పైరీ డేట్ చూసికొనాలి! కొబ్బరి అస్సలు వాడటం లేదు. కంద, చేమ, ఆలుగడ్డ వంటి దుంపకూరలు పూర్తిగా మానెయ్యమన్నాడు డాక్టరు!" అంటూ మీరా ఓ లిస్టే చదివింది.

"చూశావా కళ్యాణీ? చేతినుంచి ఆరు వేలు ఖర్చుపెట్టి తెస్తే అందులో ఎన్ని తప్పులు పడుతున్నదో చూశావా? అసలు నిన్ననాలి! డబ్బులు ఖర్చుపెట్టడం గాక చెడుపేరు.."

"మామయ్యా! నేను మిమ్మల్నేం తీసుకు రమ్మనలేదే? ఇందులో సగం నేను ఉప యోగించనక్కరలేదు.."

"తీసుకెళ్లి కుప్పతొట్టిలో పారబొయ్యి" పరశురామయ్యకు అహం దెబ్బతింది.

వసంత్ అవేశంగా "ఇది చాలా తప్పు మీరా! నాన్న తన డబ్బుతో బాధ్యతగా సరుకులు తెస్తే ఇలా నోటికొచ్చినట్లు మాట్లాడడం బాగుండలేదు" అన్నాడు.

"నాకు సంసారం నడపడం రాదన్నట్లు విమర్శ. సరుకులు తెచ్చి పడేసి నన్నెం దుకు అవమానించాలి? మీ అమ్మానా న్నలు వచ్చింది ఇప్పుడు! తొమ్మిది నెల లుగా నేనేగా కుటుంబం నడుపుతున్న దాన్ని! బాబుని, మిమ్మల్ని ఇన్నాళ్లనుంచీ ఉపవాసం పడుకోపెట్టానా! మనం బతకి లేదా? " అంది మీరా.

పరశురామయ్య దగ్గరగా వచ్చి చేతులెత్తి నమస్కరించి "సారీ అమ్మా! మేమిక్కడకు రావడమే తప్పు. వచ్చినా నోరు మూసు కుండాల్సింది! ఇల్లంతా శుభ్రం చెయ్యాలను కున్నదే! అది దాని తప్పు. కన్నపిల్లలే అయినా వారికి సొంత కుటుంబం ఏర్ప డ్డాక మంచో చెడో వాళ్లే చూసుకుంటారు. అందులో ఎవరూ కలుగచేసుకోకుండా, తల దూర్చకుండా వుంటే ఏ సమస్యా రాదు" అన్నాడు.

కళ్యాణి చాలా నొచ్చుకుంది. ఆయనింకా ఏదో మాట్లాడబోతే చేతిని నొక్కి ఆపింది.

"నన్ను ఆగమంటున్నావా కళ్యాణీ? "

"ఆ! అవును, ఇక ఆపాలి"

"నువ్వేం అంటున్నావు కళ్యాణీ? "

"నన్ను మన్నించండి! ఇది మీ ఇల్లు కాదు. ఇక్కడ దేన్నీ విమర్శించే హక్కు లేదు. మీరు చదువుకున్నవారు. మంచి ఉద్యోగం చేశారు. ప్రపంచ అనుభవం ఎక్కువ. అర్థం చేసుకుని ప్రవర్తించండి. ఇప్పుడు లోపలకు రండి" అంటూ కల్యాణి ఆయనను లోపలకు లాక్కెళ్లింది.

"బయల్దేరిక కళ్యాణీ..!"

"ఎక్కడికీ? "

"వేణు ఇంటికెళ్లిపోదాం. వచ్చి ఒక్క రోజైనా కాకుండానే ఇలా వుంది.. ఇంకా మూడు నెలలు ఇక్కడుండలేం. ఉండడం కష్టం, వెళ్లిపోదాం!"

"ఆగండి. ఇలా వెంటనే వెళ్లిపోతే వసంత్ బాధపడతాడు!"

"చాల్లే మహా చెప్పొచ్చావు! వాడికి మనమే కావాలనుకుంటే పెళ్ళాన్నిలా మాట్లాడనిచ్చేవాడు కాడు. ఆ నోటిమీద రెండిచ్చి మూయించేవాడు! చేశాడా? చెయ్యలేదే! పెళ్లాన్ని చూసి గడగడలాడే వాడింట్లో వుంటే మనకి నిరాదరణే క

ళ్యాణీ! అలాంటప్పుడు ఇక్కడ మనం ఎందుకుండడం? "

"పొరపాటండీ! వాడు జీవితాంతం ఆమెతో బతకవలసిన వాడు! మనల్ని ఆదరించి, భార్యని ఎదిరిస్తే వాడు ప్రశాంతంగా వుండలేడు! మాట వినే భార్య అయితే భర్త ధైర్యంగా మాట్లాడతాడు.. ఎదిరించే భార్యనేమైనా అంటే వ్యవహారం బెడిసికొడుతుంది. మన వసంత్‌ది జగడా లిష్టపడని స్వభావం. ఇప్పుడే మనం వెళ్లిపోతే వాడు బాధ పడతాడు. వద్దు, వెళ్ళొద్దు.. మీరామెని చూసీ చూడనట్లుండండి. మూడు నెలలు ఎట్లాగో గడిపేసి వెడదాం!"

"వుండగలమని అనిపించడం లేదు"

"ఓర్పు, సహనాలతో వుండండి! మనకి వయసైపోయింది. అందరితో విరోధం మంచిది కాదు. సర్దుకు పోవడంలో తప్పేం లేదు!"

"గీత ఎంతో మేలు! ఏం అనదు"

"తను బాగానే వుంటుంది, కానీ వేణు వూరికే వుండడు. ఏదో ఒకటి అంటాడే!"

"వాడేమైనా అంటే రెండు అననూ? "

"అవును, మీరూరుకోరే! పోయిన వారం ఏం జరిగిందక్కడ? మరిచిపోయారా? "

ఆయనేం మాట్లాడలేదు. కల్యాణికి ఆ వేళ జరిగింది కళ్ళముందు మెదిలింది.

★ ★ ★

గీత ఆ రాత్రి వంట చేస్తున్నది.

కల్యాణి ఏదైనా సహాయం చేద్దామని వెళ్తే "అత్తయ్యా! నేను చేసుకుంటాను, మీరు వెళ్లి టీవీ చూడండి" అని అత్తగారిని పంపేసింది గీత.

కల్యాణి హాల్లోకొచ్చేసరికి పరశురామయ్య టీవీలో ఏదో పాత సినిమా పాటలు చూస్తున్నాడు. ఆయనకి పాత పాటలంటేనే ఇష్టం. వేటూరి, సినారె, ఆరుద్ర గీతాలంటే మరీ ఇష్టం.

మనుమరాలొచ్చి కార్టూన్ ఛానల్ మార్చేసరికి ఆయన కోపంగా "ఎందుకే మార్చావు? " అన్నాడు.

"పో! తాతయ్యా! అవేం బాలేదు, బోరు కొడుతోంది" అంది.

"చదువుకునే పిల్లలకు టీవీ ఎందుకు? వెళ్లి చదువుకో!"

అప్పుడే లోపలికొచ్చిన వేణు "ఊరుకోండి నాన్నా! అది చిన్నపిల్ల. దానికేదిష్టమైతే అది చూడనియ్యండి" అన్నాడు.

"పొరపాటు వేణూ! చిన్నపిల్లల్ని వారి కిష్టం వచ్చినట్లుగా చేసుకోనిస్తే తరువాత మాట వినరురా!"

"ఎందుకంత పెద్దమాటలు అంటారు? "

"అది నిజమే కదరా? "

"కాదు నాన్నా! ఏదైనా ప్రేమగా చెప్పండి, కొట్టినట్లు అనద్దు. పెద్దలు అపశకునంగా అనకూడదు.. అది పిల్లలకు మంచిది కాదు!"

"ఆ విషయం నాకు తెలీదా వేణూ? మందలించేప్పుడు మాటలలా వచ్చేస్తాయి"

"టీవీలో ఎన్నో కలర్‌ఫుల్ ఛానల్స్ వస్తాయి, అవన్నీ చూడాలనిపిస్తుంది మాకు"

"నాకు ఇదే ఇష్టం.."

"నాన్నా! ఇంట్లో టీవీ వున్నది మీ ఒక్కరికే కాదు, అందరికీను.. బయటి నుంచి ఇంటికొచ్చాక మాకు టీవీ కావాలి"

"ఎందుకు వేణూ! పాప ఎదురుగా

## కొత్తగాలి...

**ఎర్రని ప్రజ్వలనంతో**
**అనుక్షణం దహించే**
**ప్రకాశం కన్నా**
**నల్లగా ఉంటేనేం?!**
**హాని చేయని ఆ చీకటే మిన్న!**

– పి.వి.ఎల్. సుజాత,
సైనిక్‌పురి, సికింద్రాబాద్

ఇలా మాట్లాడతావు? ఇక పిల్లకు నామీదే మైనా గౌరవం వుంటుందా? "

"మీరు మాట్లాడుతూంటే నేను మాట్లాడ కుండా వుండగలనా? మీకంటూ ఈ ఇంట్లో ఓ రూమ్ వుంది! కావాలంటే అందులో ఓ టీవీ కొనిపెట్టుకుని మీ కిష్ట మైనవి వేసుకుని చూస్తూ కూర్చోండి, ఎవ రొద్దన్నారు మిమ్మల్ని? "

"అంటే దీంట్లో నన్ను చూడద్దంటావా? "

"అలా అనడం లేదు, అందరినీ చూడని య్యండంటున్నాను" అని కొడుకు అన డంతో ముటముటలాడుతూ లేచి లోపలకె ళ్ళిపోయారాయన.

గీత బయటికొచ్చి "ఏమిటండీ ఇదంతా? మామయ్యగారికి ఏది ఇష్టమైతే అదే చూడనియ్యండి! ఎందుకీ అనవసర వాదాలు? " అంది.

"తప్పు, గీతా! పెద్దవారికి మర్యాద ఇచ్చి గౌరవించాల్సిందే! కాదనడం లేదు. కానీ వారు చెప్పేవాటికన్నీ తలాడించకూడదు. వారిని అవమానపరచ కూడదు. అలాగని మన స్వేచ్ఛ స్వతంత్రాల్ని అడ్డుకుని వారు అధికారం చలాయించకూడదు"

పరశురామయ్య వేగంగా బయటికొచ్చి "నేనెవరిమీదా అధికారం చలాయించాలను కోవడం లేదు. డామినేట్ చెయ్యడం లేదు. మరొకరి విషయాలలో నేనెప్పుడూ జోక్యం చేసుకోను!" అన్నాడు.

"సరే నాన్నా! నాకిదే కావాలంటూ మొం డిపట్టు పడితే మిగిలినవాళ్ళని బాధించ దా? అది తప్పు కాదా? " అన్నాడు వేణు.

"సరే! ఇప్పుడేం అంటావు? నీ కూతురు కు ఇష్టమైన ఛానల్ చూడాలి, అంతేగా? నేనసలు హాలులోకే రాను.. సరేనా? "

"ఏంటి నాన్నా! అంత కోపగించుకుంటా రు? మీరు హాల్లోకి రావద్దని అన్నానా? "

"అది తప్ప మిగతావన్నీ అన్నావు.. నువ్విలా డొంకతిరుగుడుగా అనేకంటే డైరె క్టుగానే అనచ్చుగా? "

"లేదు నాన్నా! నాకు మీరెంత ముఖ్య మో నా బిడ్డ కూడా అంతే ముఖ్యం"

"మేం నిన్ను ఇంతవాడిని చెయ్యడం వల్లేగా నీకీ నాడు బిడ్డ పుట్టింది.."

"ఏం మాట్లాడ్తారు నాన్నా? కని పెంచి ప్రయోజకుల్ని చెయ్యడం త్యాగం కాదు, బాధ్యత!"

"ఆ బాధ్యత నీకూ వుంది!"

"నేను కాదనడం లేదే!"

గీత హడలిపోయింది "ఎందుకీ అనవ సర వాగ్వాదం? మీరిద్దరూ బాధ్యతలు కలవారే! చర్చ ఎందుకు? భోజనాలకు రండి.." అంది.

"వచ్చేస్తున్నాను" అన్నాడు వేణు.

"మామయ్యా! చపాతీలు రెడీ, కుర్మా వేడిగా వుంది.. రండి తిందురుగాని.."

"వద్దమ్మా! నాకొద్దు"

"కోపం తెచ్చుకోకండి మామయ్యా! మీ అబ్బాయేగా!"

"అలా అని వూరుకోలేనమ్మా! ముసలా డినైపోయినా అభిమానం అనేది ఒకటి ఉంటుందిగా!"

గీత దగ్గరగా వచ్చి గొంతు తగ్గించి "ఆయన అన్నమాటలు బాధ పెడితే ఆయన తరపున నేను మిమ్మల్ని క్షమించ మని కోరుతున్నాను.. భోజనానికిరండి.." అంది మెల్లగా.

"సరేనమ్మా పద! వస్తాను"

గీత బయటకు రాగానే "నువ్వెందుకు క్షమించమని అడిగావు? నేనేం తప్పుగా మాట్లాడాను? ఆయనేగా ఇష్టం వచ్చిన ట్టుగా మాట్లాడింది! ఆయన ఈ మూడు నెలల నుంచీ పెట్టే అవస్థలు భరింపశక్యం కావడం లేదు.. ఎంతకని ఓర్చుకోను? " అన్నాడు వేణు.

"అలా అనకండి!"

"కాదు గీతా! పరస్పరం అర్థం చేసుకో వాలి, లేదంటే ఎవరికీ నెమ్మది వుండదు!"

"ఆయనని మాత్రం తప్పు పట్టద్దు. మీరు

అక్షరం

ఫలితాన్ని గురించి ఎంత శ్రద్ధ చూపిస్తారో
ఆ ఫలితాన్ని పొందడానికి
ఉపయోగించే పద్ధతుల విషయంలో కూడా
అంతే శ్రద్ధను పాటించండి

– స్వామి వివేకానంద



సర్దుకుపోయే మనిషి కారు! బావగారు నోరెత్తరు. మీరసలూరకుండరు. వాదులాడతారు. రెండు చేతులు జోడిస్తేనేగా చప్పుడొస్తుంది. ఇంతటితో వదిలెయ్యండి"

ఆ రాత్రి పరశురామయ్య మండిపడుతూంటే "ఇక్కడ మన లెక్క పూర్తి కాబోతున్నది.. ఒక వారంలో బయలుదేరుతాం. అంతదాకా ఓపికగా వుండకూడదా? మీరెందుకలా మాట్లాడారు? వాడేం తప్పుగా అన్నాడు? " అంటూ సర్దిచెప్పింది కల్యాణి.

"నువ్వెప్పుడూ నీ పిల్లల పక్షమే!"

"అదేంకాదు, న్యాయం ఎటుంటే అటు"

"నా వైపు న్యాయం లేదంటావా? "

"అలాని కాదు! కొన్ని సమయాలలో న్యాయం తప్పుదారి పడుతుంది"

"సరే! వదిలేయి, ఇప్పుడు నేను మాట్లాడితే మన మధ్య జగడం వస్తుంది"

తరువాతి మూడు రోజులు మామూలుగా గడిచాయి. బయలుదేరడానికి రెండే రోజులుండగా "అత్తయ్యా! మీరిద్దరూ వెళ్ళే తీరాలా? " అంది గీత.

"ఎందుకమ్మా! అలా అంటున్నావు? " అడిగింది కల్యాణి.

"అత్తయ్యా! మీరు పెద్దవారైపోయారు. మామయ్యగారికి బాగా ఓపిక తగ్గిపోయింది. తరచు ప్రయాణాలు చెయ్యలేరు. అందుకని ఒకేచోట వుండచ్చుగదాని.."

"నిన్ను వదిలి వెళ్ళడం నాకసలు ఇష్టం లేదు. కానీ మీ మామయ్యగారు కొన్ని పద్ధతులు పెట్టుకున్నారు.. నేనాయనను ఎదిరించగలనా అమ్మా? "

"నేను మీ అబ్బాయితో మాట్లాడతాను. ఆయన చెప్తే మామయ్య వింటారు.."

"వాడు చెప్తాడా గీతా? " అందావిడ.

ఆ సాయంత్రం వేణు ఇంటికి వస్తూనే బ్యాగులోంచి రెండు టిక్కెట్లు తీసిస్తూ "అమ్మా! ఎల్లుండి మీరిద్దరూ చెన్నై వెళ్ళడానికి టిక్కెట్లు" అన్నాడు.

కళ్యాణి మొహం మారిపోయింది.

అది చూసి గీత "ఏమిటండీ మీరు మరీను. నేను వారిని వెళ్ళకుండా ఇక్కడే వుంచేసుకుందామనుకుంటే మీరు టిక్కెట్లు తెచ్చేశారు? " అంది.

"వాడు వెళ్ళమనే అంటున్నాడు. అది నీకు అర్థం అవలేదా గీతా? " అన్నాడు అపుడే వచ్చిన పరశురామయ్య.

"కాన్సిల్ చెయ్యచ్చునుగా మావయ్యా!" అంది గీత.

"వద్దమ్మా! మేం బయల్దేరుతాం" అన్నారాయన.

అదేం పట్టించుకోని వేణు "నాన్నా! ఈ రెండు టిక్కెట్లకు పద్దెనిమిది వందలు అయింది.." అన్నాడు.

"ఆ! ఇస్తాను! చేతిలో రొక్కం లేదు. ఎ.టి.ఎమ్. కెళ్ళి తీసుకు వస్తాను. నేనింకా ఏమైనా బాకీ వున్నానా? " అడిగారాయన ఉక్రోషంగా.

అడగడమే ఆలస్యమన్నట్టుగా "ఆ వుండండి, రాసి పెట్టాను.. చాలా మందులు తెచ్చాను. అమ్మకు కళ్ళజోడు మార్చాను. మీరీ నెల కేవలం పది వేలిచ్చారు! పద్నాలుగువేలు ఖర్చయ్యాయి. మీరు ఆ నాలుగువేలు, ఈ టిక్కెట్టు డబ్బు

లియ్యాలి" అన్నాడు వేణు.

"సరేరా! టేబుల్ ఫ్యాను, లేబరు కూలీ కలిపి నాలుగు వేల తొమ్మిదొందలిచ్చాను. నీకివ్వాల్సిందాంట్లో ఈ మొత్తం పోను తొమ్మిదొందలిస్తాను"

"అత్తయ్యా! వీళ్ళిద్దరూ ఇలా లెక్కలు చూసుకోవాలా? " అంది గీత మెల్లగా.

"నాకూ నచ్చలేదు గీతా! కానీ, ఇదే వారి స్వభావం.. మీ మామగారికి అంతగా పట్టింపులేదు. కానీ నా కొడుకు మాత్రం డబ్బు విషయంలో ఎప్పుడూ ఇంతే!" అంది కల్యాణి.

"చాలా బాధనిపిస్తున్నదత్తయ్యా!"

"గీతా! ప్రేమ తగ్గిపోకుండా వుండాలంటే సర్దుకుపోవాలి!"

రాత్రి భోజనాలు ముగించి అందరూ పడుకున్నారు.

"బామ్మా! ఊరికెడుతున్నావా? " అడిగింది మనవరాలు.

"అవును బంగారం!" బదులిచ్చింది నాయనమ్మ.

"వెళ్ళొద్దు బామ్మా! ఇక్కడే వుండు"

"మళ్ళీ వస్తాంగా! పెదనాన్న ఇంట్లో తమ్ముడున్నాడు, వాడిని చూడొద్దూ? "

"బామ్మా! నేను నీ దగ్గర పడుకొనా? "

"సరే, బంగారం!"

అంతలో వేణు లోపలికొచ్చి "వద్దు నాతో రా!" అన్నాడు.

"ఇక్కడ పడుకోనీరా!" అంది కళ్యాణి.

"వద్దమ్మా! మా దగ్గరే పడుకోవాలి.. ఇదేం కొత్త అలవాటు? " అన్నాడు వేణు.

"ఒక్కరోజే కదరా? "

"ఊరుకో కల్యాణీ! వాడి బిడ్డ.. నువ్వెందుకు కలుగజేసుకుంటావు? తాత, బామ్మ నిరంతరం వుండరని వాళ్ళనుకుంటూంటే మనం బలవంత పెట్టకూడదు. ప్రేమాభిమానాలు మోతాదు మించకూడదు. ముందది అర్థం చేసుకో!" అని తండ్రి అంటున్నా పట్టనట్టు వేణు కూతుర్ని తనతో తీసికెళ్ళాడు.

పరశురామయ్య తలుపు వేసి, "ఇదిగో కల్యాణీ! ప్రేమ పాశాలన్నింటికీ డబ్బుతో లెక్కలు చూస్తున్నాడు నీ కొడుకు. నువ్వెంతగా పాకులాడినా వాడి మనసు మారదని అర్థం చేసుకో!" అన్నాడు.

"సర్లెండి! వీటిని అంత పెద్దగా పట్టించుకోవాలా? "

"మనం సర్దుకుపోయినా వాళ్ళు సర్దుకుపోడానికి సిద్ధంగా లేరు"

"అయినా అరవై దాటిన వయసులో మీకింత కోపం వుంటే, చిన్నవాడు, ఉద్యోగంలో ఉన్నవాడు, వాడికి కోపం వుండదూ? ఇంటాబయటా ఎన్నో పనులు, టెన్షన్లతో వుంటాడు!"

"చాల్లే వూరుకో! నేను ఇలాంటి టెన్షన్లన్నిటినీ అనుభవించి దాటుకుంటూ వచ్చినవాడినేగా? మనం నలుగురు పిల్లల్ని కని, పెంచి, చదివించి, పెళ్ళిళ్లు చేసి, పురుళ్లు పోసి ఎన్నెన్ని బాధ్యతలు మోయలేదు? వీళ్లు మన గురించి ఏమాత్రమయినా ఆలోచిస్తున్నారా? "

"పోన్లెండి! అందరి అనుభవాలూ ఒకే మాదిరిగా వుండవు. కాలమాన పరిస్థితుల్ని బట్టి మారతారు"

"కానీ, మనం మారామా? అప్పుడూ ఇప్పుడూ అమ్మ నాన్నలమేగా!"

కల్యాణి ఏం చెప్పాలో తెలియక ఉక్కిరిబిక్కిరి అయింది.

★ ★ ★

గీత అత్తమామలు తమవద్ద వుండాలనుకుంది. వేణు అందుకొప్పుకోలేదు.

లెక్కలు చూసుకోవలసిందే! కానీ దాన్ని అతి నాజూకుగా ఎవరి మనసులూ నొప్పించకుండా మాట్లాడి పరిష్కరించుకుంటే బాగుంటుంది. శాంతంగా మాట్లాడుకుని నిర్ణయాలు తీసుకోవాలే గానీ ఘర్షణ పడితే మనసులు విరిగిపోతాయి. అదే అందమైన ఉలితో మెల్లిగా చెక్కితే అంద

మైన శిల్పం అవుతుంది. కనుక చెప్పే విధంలో, చేసే విధానంలో ఇష్టమో, అయిష్టమో తెలిసిపోతుంది.

మూడో నెల ఆఖరున అక్కడ పగుళ్ళొస్తే ఇక్కడ మొదటి రోజే బీటలొచ్చాయి. అక్కడ కొడుకుతో మనస్పర్థలు, ఇక్కడ కోడలితో!

పరశురామయ్యకు నిద్రపట్టక అటుఇటు కదులుతుంటే "ఏమిటండీ! నిద్ర రావడం లేదా? " అనడిగింది కల్యాణి.

"ముసలాడినైపోయానుగా! ఇంక శరీరం చెప్పిన మాట వినదు కల్యాణీ! నిద్ర, ఆకలి ఏవీ వుండవు, తగ్గిపోతాయి"

"ఉహూ! ఆకలినిద్రలు పోగొట్టుకోకూడదు. కోపాన్ని మాత్రమే పోగొట్టుకోవాలి. ఇప్పటికీ మీకు కోపం తగ్గలేదు"

గబుక్కున లేచి కూర్చున్నారాయన "నా కోపంలో తప్పేముంది? " అంటూ.

"అందరూ అలాగే అనుకుంటారు. మనం చేసే పనేదీ మనకు తప్పనిపించదండీ! కానీ అవతలివారి మనసులకు అందులో వున్న తప్పులు విశ్వరూపంలో కనపడతాయి"

"వచ్చీరాగానే డబ్బు ఖర్చుపెట్టి ఇంటికి కావాల్సిన సరుకులు తీసుకొస్తే, అందులో లోపాలెంచింది. ఎవరికి మాత్రం కోపం రాకుండా వుంటుంది! నువ్వే చెప్పు? "

"కానీ, మనం చేసింది గొప్పగా చూపిస్తే ఎవరికీ ఇష్టం వుండదు.."

"నేనేం గొప్పలు చెప్పలేదు, చెప్పి చూపించనూ లేదు"

"కాదండీ! వాళ్ళకు కుటుంబ నిర్వహణే రాదన్నారు"

"అది నిజమేగా? "

"మరి, ఆమెకు రోషం వుంటుందిగా? "

"తల్లిదండ్రులు ఇంటికొచ్చారని కొడుకు ఆఫీసుకు సెలవు పెట్టడం నేరమా? "

"వదిలేయండి, జరిగినదాన్ని విశ్లేషించుకుంటే నెమ్మది వుండదు"

"లేదు కల్యాణీ! ఇక్కడ వుండగలమని నాకనిపించడంలేదు. వేణు పాకప్ చేశాడు! ఇక్కడా వుండలేం. సుజీ ఊటీలో! వారింటికి ఆమె అత్తమామలొచ్చారు. ఇక ఒకటే మార్గం.. బెంగళూరులో మన చివరి అమ్మాయి ఇందిర దగ్గరికెడదాం"

"తొందర పడకండి! అక్కడ మనకి రెడ్ కార్పెట్ మర్యాదలేం జరగవు. అక్కడున్న సమస్యలేంటో మీకు తెలుసు! ప్రస్తుతానికి నిద్రపోండి. పొద్దున్నే ఆలోచిద్దాం"

"తలనొప్పి భరించలేకపోతున్నా"

"అమృతాంజనం రాస్తానుండండి"

కల్యాణి ఒడిలో తలపెట్టుకు పడుకున్నారాయన.

కల్యాణి అమృతాంజనం రాసి మృదువుగా తల నొక్కుతూ, కేశాలను సవరిస్తూ "చూడండి! మీ శ్రమలో ఏ లోపమూ లేదు, రాదు. నలుగురు పిల్లలకు ఏ లోటూ లేకుండా పెంచి పెద్ద చేశారు. మంచి చదువులు చెప్పించి, వాళ్ల కాళ్ల మీద వాళ్లు నిల్చునేట్లు చేశారు మీరు" అంది.

"లేదు కల్యాణీ! ఇది నా ఒక్కడి సాధన కాదు. ప్రతిదాంట్లో నీ సహకారం వుంది. నా కోప తాపాలను భరిస్తూ, ఎప్పుడేం అడిగితే వాటిని నెరవేరుస్తూ ఎల్లప్పుడూ తోడుగా నిలబడ్డావు. నా కోసమే జీవించావు. నీ ఓర్పు, సామర్థ్యం, త్యాగం..

### కొత్తగాలి...

**'నిన్ను'**
**వెదుక్కుంటున్నావు ఎందుకు?**
**'నువ్వు' నీలోనే ఉన్నావు!**
**ఆత్మ విమర్శ చేసుకో!**
**నీలో నువ్వు కనిపిస్తావు!**

– ఎన్కే. నాగ్,
పెనుగొండ, ప.గో. జిల్లా

## కొత్తగాలి...

**తీరని అప్పు**
**ఆరని నిప్పు**
**ఎప్పుడూ ప్రమాదమే!**

– వై.వి. శివకాంత,
అచ్యుతాపురం, శ్రీకాకుళం జిల్లా

ఇవన్నీ లేకపోతే నేనేమీ చెయ్యగ లిగేవాడిని కాను"

"ఇది త్యాగం కాదు, ఓ మంచి భార్య బాధ్యత. అదే నేను చేశాను. మీరు విసు గనేది లేకుండా శ్రమ పడ్డారు. ఇప్పటికీ మనం ఎవరి దయాధర్మాలతోనూ బత కటం లేదు! మన భోజన ఖర్చులు ఇ చ్చుకుంటూనే వారిళ్లలో వుంటున్నాం. మన డబ్బులతో మీరు మనకు వైద్యం చేయిస్తున్నారు. ఈ వయసులోనూ ఆత్మా భిమానంతో తల ఎత్తుకు బతుకుతు న్నారు!" అంటున్న భార్యను గర్వంగా చూశారాయన.

"కానీ మీరు కోపాన్ని తగ్గించుకుంటే మంచిది" మళ్లీ అంది కళ్యాణి.

"చేతకావడం లేదే? "

"అవ్వాలి. మనకైన ఖర్చులు ఇస్తు న్నాం. శారీరక శ్రమ చేతనైనంత చేస్తు న్నాం. వేటికీ లెక్కలు వెయ్యద్దు. వారి వ్యవహారాలలో కలుగచేసుకోవద్దు. వాళ్ల కుటుంబాలు, వాళ్ల ఇష్టం. మన సలహాలు అడిగితే చెబుదాం, లేదంటే లేదు. అలా తామరాకు మీది నీటిబొట్టులా వుంటే ఏ సమస్యలూ వుండవు, రావు. బతుకు హాయిగా గడిచిపోతుంది"

"ఇది వాళ్లకి అర్థం అవాలిగా? "

"అర్థం చేసుకుంటారు. మోచెయ్యి వంగి తేనే పూర్తి చెయ్యి చాచుతుంది. ఇచ్చినా పుచ్చుకున్నా ఇదే తత్వం. మనకు చేతనై నంతవరకూ చేద్దాం, చేతనవకపోతే చెప్పేద్దాం. అయిదువేళ్లు ఒక మాదిరిగా లేవు. పిల్లలు మన మాదిరిగానే కుటుం బాలు నిర్వహించాలనేం లేదు. మీరు ఖర్చులు లెక్క రాయండి! అదే మన లిమిట్ అని నాజూగ్గా చెప్పొచ్చు"

"నా మనసులో ఓ ప్రశ్న.."

"ఏమిటది? "

"మనకి నెలకి ముప్ఫయి వేల రాబడి వుంది. వీళ్లను పట్టుకు ఎందుకు వేళ్లా డాలి? వీరిళ్లలో ఎందుకు పడుండాలి? అద్దెకో ఇల్లు తీసుకుని విడిగా వుండడానికి మనకొచ్చే డబ్బు చాలదా? సింగిల్ బెడ్ రూమ్ ఇల్లు ఏడెనిమిదివేల అద్దెలో దొరు కుతుంది. మిగిలిన డబ్బులు మన భోజనా నికి చాలవా కల్యాణీ? "

"ఎందుకండీ? "

"అమ్మాయిలు వేరు కాపురాలైనా అల్లుళ్ల మొహాలు చూడాలి. అబ్బాయిలిళ్లలో కోడ ళ్లతో సర్దుకుపోవాలి! అదే మనకంటూ ఇల్లుంటే ఈ బెడదలేవీ వుండవు!"

"కానీ, ఇంటికి కావాల్సిన సామానంతా కొనుక్కోవాలిగా!"

"ఆ! తప్పకుండా కావాలి. బడ్జెట్టు వేశాను. నాలుగైదు లక్షలైనా అవుతుంది! మన డిపాజిట్టులో డబ్బు వుంది. ఇంటికి అడ్వాన్సుగా పదినెలల అద్దె ఇవ్వాలి!"

"అహ! అంటే? మీరు నిర్ణయం తీసేసు కున్నారన్నమాట!"

"లేదు కల్యాణీ! నీతో చెప్పకుండా ఏ నిర్ణయమూ తీసుకోను"

"సరే! మీరు చెప్పేది పూర్తి చెయ్యండి"

"మనం సొంత ఇల్లు కట్టుకోలేక పోయాం. నలుగురు పిల్లల్ని పెంచి పెద్ద వాళ్లని చెయ్యడానికే మూడొంతులైపో యింది. అందుకనే మనకేం మిగలకుండా పోయింది. కానీ మన ఇంట్లో వున్నప్పుడు మనకన్నీ వున్నాయి. ఇప్పుడేం లేకుండా

పోయాయి"

"అవును! మనకి ఇల్లు లేదు, సామానెక్కడ పెట్టుకుంటామని నలుగురికీ పంచి ఇచ్చేశాం"

"అదే మనం చేసిన తప్పు. మనకంటూ ఎప్పటికీ ఓ ఇల్లు వుండాలి. అలా లేకపోవడం ఎంత ఇబ్బందిగా వుందో చూడు! ఈ మూడేళ్ల నుంచీ ఎంతగా ఇబ్బందులు పడుతున్నామో! పిల్లల ఇళ్లలో వున్నప్పుడు వారి నిజస్వరూపాలు బయట పడుతున్నాయి. అందుకనే ఇప్పుడు విడిగా వుండాల్సిన పరిస్థితి వచ్చింది. చేతిలో డబ్బుండగానే ఈ ఏర్పాటు చేసుకోవాలి. ధరలు రోజురోజుకు పెరిగిపోతున్నాయి. అద్దెలు ఎక్కువవుతున్నాయి. అందుకే తొందరగా ఓ నిర్ణయానికి రావాలి!"

కల్యాణి ఏమీ మాట్లాడలేదు.

"మాట్లాడవేం కల్యాణీ? నేను చెప్పిన విషయం నీకు అర్థమవలేదా? "

అయినా ఆమె బదులివ్వలేదు.

"నీకు పిల్లల మీద మమకారం తగ్గలేదు"

"కాదు, నాకెవరైనా మీ తరువాతే!"

"మరెందుకు ఆలోచన? "

"మన దగ్గర డబ్బుంది గనుక వేరే ఇల్లు తీసుకు వుండగలం ప్రస్తుతానికి. కానీ, ఇప్పుడు మీకు అరవైమూడు, నాకు అరవై. ఆ విషయం మీరు మరవకూడదు"

"అయితే ఏంటంటావ్? "

"ఇప్పుడు నా ఒంట్లో బలముంది. బస్సులో ప్రయాణం చేస్తాను, బట్టలుతుకుతాను. మీరు బరువులు మోస్తారు. కానీ"

"కాపురం కూడా చేయగలను. బహిరంగంగా చెప్పాలంటే ఇప్పటికీ నీ చేత ఓ వారసుని కనిపించగలను!"

"సిగ్గు సిగ్గు.. ఇక ఆపండి"

"భార్యతో భర్త ఏమైనా మాట్లాడచ్చు, సిగ్గు బిడియాలు మరిచి, తెలిసిందా? "

"ఇప్పుడు నేను మాట్లాడనా? "

"ఊ.."

"మీకన్ని శక్తులూ వున్నాయి, కాదనడం లేదు. కానీ, చక్కెర, ఉప్పు, నూనె- ఇలా సరుకుల అంగడే మీ శరీరంలో వున్నది. ఆ సంగతి మీకు తెలుసునా? "

"వయసు మీదపడి అవన్నీ వచ్చినయి"

"ఆ! ఇప్పుడైనా ఒప్పుకుంటారా వయసు డిగిందని? "

"నిశ్చయంగా!"

"రోగాలతో శక్తి సన్నగిల్లుతున్నది. బలం తగ్గిపోతున్నది"

"ముసలితనంలో అవన్నీ సహజమేగా? "

"తెలుసుగా? ఇలాంటి సమయంలో కన్నపిల్లల్ని కాదని వేరు కాపురం వెళ్లడం మంచిదా? మనం మారిమారి అందరి దగ్గరా వుండడం వల్ల వారికి బాధ్యత కమిట్‌మెంటూ వుంటాయి. ఇప్పుడిలా విడిగా వెళ్లిపోతే మన గురించి పట్టించుకోరు. ఎన్ని కోపతాపాలున్నా పిల్లలతో విరోధం పెట్టుకోకూడదు. కన్నపిల్లలు తప్ప పరాయి వారెవరూ ముసలితనంలో ఆదరించరు! తెలిసిందా? "

"అలా అనకు కల్యాణీ! మనం ఇంకా గట్టిగా వున్నప్పుడే ఇన్ని మాటలంటున్నారే! మన శక్తులుడిగిపోయాక చూసుకుంటారన్న నమ్మకం ఏముంది? "

"నమ్మకమేగా జీవితం"

"కాదనడం లేదు కల్యాణీ! కానీ దానికో హద్దు వుంది. నాకు మనుషుల విలువలేమిటో బాగా తెలుసు. అయినా ఈ మూడు సంవత్సరాలలో జరిగింది వేరు!"

"ఏం జరిగింది? "

"నేను ఉద్యోగంలో వున్నప్పటికీ ఇప్పటికీ చాలా తేడా వుంది!"

"మీరు సర్వీసులో వుండగానే నలుగురు పిల్లలకు పెళ్లిళ్లు అయినాయిగా? "

"అవును"

"అందరికీ పిల్లలు పుట్టారుగా? "

"ఆ! అవును"

"ఏమిటి తేడా? "

"అప్పుడిలాంటి నిర్లక్ష్యభావం వాళ్ళెవరి లోనూ లేదు కల్యాణీ!"

"అదేం కాదు. అప్పుడు మీకెవరినీ పరిశీలనగా చూసే సమయం లేదంతే! పొద్దుట వెళ్లారంటే రాత్రికి తిరిగొస్తారు. ఆదివారం సెలవైనా ఆ రోజూ పనుల హడావిడిలో వున్నందువలన మీ కళ్లలో పడలేదు!"

"అంటే? "

"ఆ! అవును, ఇవన్నీ అప్పుడూ ఉన్నాయి!"

"మరి అప్పుడే ఎందుకు చెప్పలేదు? "

"ఇల్లాలు గనుక ఇంట్లో జరిగే అన్ని విషయాలూ భర్తకు చేరవేస్తూంటే కుటుంబంలో ఎప్పుడూ దెబ్బలాటలూ తగూలే! ప్రశాంతతే వుండదు"

"అంటే నువ్వు దాచావా? "

"అవును, కొన్ని విషయాలు మీదాకా రానియ్యలేదు"

"నువ్వే అవస్థపడ్డావన్నమాట!"

"నేను దాన్ని అవస్థ అనుకోలేదు. ఆడదానిగా పుట్టాక సహనం వుండాలి. ఆశలు ఎక్కువున్న మగాడు, కోపం ఎక్కువున్న ఆడది ప్రశాంతంగా బతకరంటారు! సీతాదేవి పుట్టిన భూమి ఇది, ఓర్పుకు మారు పేరు సీత. మహిళలకు సహనం, ఓర్పు లేకపోతే కుటుంబం చెదిరిపోతుంది. నేనే మీకు పిల్లలకు మధ్యనున్న వంతెనను గట్టి పరచాలి! అది పడిపోయేట్లు చేసేది తల్లి కాదు!" అని కళ్యాణి చెప్తుంటే ఆశ్చర్యంగా చూశాడాయన.

"నేను ఎప్పటికీ ఇలాగే వుండగలను! మీరా కోపగించుకున్నప్పుడు ఆమెను కోడలిగా చూస్తే ఆత్మాభిమానం, ఆత్మగౌరవం తలెత్తుతాయి. కూతురిగా భావించామనుకోండి ఏ గొడవా ఉండదు!" మళ్లీ కళ్యాణే అంది.

"మనమ్మాయి సుజి ఏమైనా అన్నా గాని ఓర్చుకొను. తిరిగి నాలుగనడం కాదు, రెండు దెబ్బలు కూడా వేస్తాను. కానీ, కోడల్ని చెయ్యెత్తి కొట్టగలనా? " అన్నాడు పరశురామయ్య.

కల్యాణి బదులివ్వకపోయేసరికి "సరే! నేను కోపం తగ్గించుకుంటాను. సహనం అలవాటు చేసుకుంటాను. కానీ దానికి ఓ లిమిట్ వుంటుందిగా? "

"అది నాకు తెలుసు. ఆ హద్దు మీరితే నేనూ చూస్తూ ఊరుకోను. సరేనా? "

"నాకు నిద్ర తేలిపోయింది కల్యాణీ!"

"నా ఒడిలో తలపెట్టుకు పడుకోండి. నిద్ర అదే వస్తుంది!"

కల్యాణి కళ్లలోకి చూస్తూ నిద్రపోయాడు పరశురామయ్య!

★ ★ ★

"అల్లుడు చెప్పే దాంట్లోనూ న్యాయం ఉంది గదుటే? " అంది మీరా తల్లి ఆరంభంలోనే.

"ఏది న్యాయం అని నువ్వు ఆయనను సమర్థిస్తున్నావమ్మా? "

"ఆయన నిన్ను ఉద్యోగం చెయ్యమంటున్న సంగతే! చదివిన చదువు వృథా అయిపోతున్నది. ఆర్థిక సమస్యలొచ్చినప్పుడు ఆయనకు నువ్వేగా ఆధారం కావాలి!"

"నిన్నేం అనాలో నాకర్థం కావడం లేదు. నీకు రెండు నాలుకలున్నాయా? "

"ఏమిటే అలా అంటావు? "

"నేను కడుపుతో ఉన్నప్పుడు నాకు రెస్టు కావాలని చెప్పినా ఎలాగో ఉద్యోగం చెయ్యాలనుకున్నానే కానీ మానెయ్యాలనుకోలేదు. కానీ, అప్పుడు చెడకొట్టింది నువ్వేగా? నన్ను మరీ పువ్వు మాదిరిగా చూసుకుని ఉద్యోగానికి వెళ్లకుండా చేశావు"

"అప్పుడదే సరైన పని! బిడ్డను ఆరోగ్యంగా కనాలిగా? "

"తరువాత బిడ్డను చూసుకునేదెవరు? నువ్వేమైనా వచ్చావా? మా అత్తగారిని తప్పు పట్టడానికి నీకు అర్హత ఉందా? "

"నోర్మయ్యవే! వారి కుటుంబ వారసుడు వారికి బాధ్యత ఎక్కువ!"

"ఇప్పుడలా ఏం లేదు, అందరూ సమాన బాధ్యులే!"

"కానీ నాకింకా బాధ్యతలున్నయి! నీ చెల్లెలి పెళ్లి, తమ్ముడి చదువు.. నాన్నగారింకా రిటైరవలేదు. వాళ్లని వదిలిపెట్టి వచ్చి వుండటానికి వీలవుతుందా? మీ అత్తమామలకలాంటి బాధ్యతలేం లేవుగా? "

"ఆపమ్మా! వారికీ నలుగురు పిల్లలున్నారు. ఈయన ఒక్కరి వద్దే పడుండడానికి వారి వల్ల కాదు"

"మీ అత్తమామలకంటూ ఓ ఇల్లూ వాకిలీ లేవు, దేశదిమ్మరి బతుకులు. అక్కడ కొన్నాళ్లు ఇక్కడ కొన్నాళ్లని తిరుగుతున్నారు. నాకు నా కుటుంబం అని ఉంది"

"కానీ ఉన్న ఊళ్లోనే వున్నావుగామ్మా, వచ్చి నా బిడ్డను చూసుకోకూడదా? "

"వాడ్నిక్కడికి తెచ్చి వదిలెళ్లు చూసుకుంటాను"

"పదిహేను కిలోమీటర్ల దూరంలో ఉన్నారు. రోజూ బస్సుతొక్కిసలాట నా వల్ల కాదు. ఆటోనో, కారో అయితే బడ్జెట్ పెరుగుతుంది. ఉన్న ఖర్చులు భరించడమే బ్రహ్మప్రళయంగా ఉంటేను!"

"అయితే నేనో ఆలోచన చెప్తా విను. మీ అత్తమామల్ని పూర్తిగా మీ ఇంట్లోనే ఉంచేసుకోండి. నెలకు పదివేల ఆదాయమూ వస్తుంది"

"అది వాళ్ల ఖర్చులకే సరిపోతుంది. ఇందులో నాకేం లాభం? "

"నువ్వు ఉద్యోగానికి వెడితే నీ కొడుకుని వాళ్లు పెంచుతారు. నీకు బరువు బాధ్యతలూ తగ్గుతాయి, రాబడీ ఉంటుంది. ఇతర సమస్యలూ పరిష్కరించుకోవచ్చు"

"అది జరిగే పనేనా అమ్మా? "

"ఏం? ఎందుకలా అంటున్నావు? "

"రుచిగా వంటలు చేస్తావంటూ వాళ్ల తరపు వాళ్లెవరెవరో వచ్చిపోతూంటారు. ఇల్లు పెద్ద సంతగా మారిపోతుంది. నా

> ## కొత్తగాలి...
>
> **ఆకాశానికి లేదు అంతం**
> **భూమాతకు లేదు పంతం**
> **మనిషి మాత్రం అనుకుంటాడు**
> **అంతా నా సొంతం!**
>
> – కాళ్ల గోవిందరావు,
> ఆముదాలవలస, శ్రీకాకుళం జిల్లా

ఇల్లు, నా కుటుంబం వారి స్వాధీనంలోకి పోవడం నాకిష్టం లేదు"

"నువ్వో మొద్దువి! ఇప్పుడు నెలలో ఇరవైరోజులు హోటలు భోజనమేగా? డబ్బు ఎంతగా ఖర్చవుతున్నదీ లెక్కలెయ్యి. నీకే తెలుస్తుంది!"

మీరా ఏం మాట్లాడలేదు.

"వాళ్ళనిక్కడే ఎప్పటికీ ఉంచుకుని నువ్వు ఉద్యోగానికెడితే నీకే లాభం"

"అదో కమిట్‌మెంట్ అయిపోతుందమ్మా! మామయ్యతో కష్టం!"

"నువ్వాయనను ఎదిరించి మాట్లాడకు. కాస్త ఆయన చెప్పినట్లు విను. మన పని అవాలంటే సర్దుకుపోవాలి. నువ్వు ఇంట్లోనే వుంటే ఆ నష్టం నీకే! నిన్నేం బలవంతపెట్టడం లేదు, నీ ఇష్టం!"

"నేను ఉద్యోగానికెళ్లాలి, మీరు మాతో ఉండండని వారిని బతిమాలమంటావా? "

"నువ్వెందుకు బతిమాలడం.? నీ మొగుడితో చెప్పించు"

"ఏమిటీ? ఆయనతోనా? "

"ఆ! అవును, కొడుకు మాట కాదనలేరు. మీ అత్తగారు స్వభావసిద్ధంగా చాలా మంచివారు. తగూలాడదు. గొడ్డుచాకీరీ చేస్తుంది. నీ తోటికోడలు సామర్థ్యంగా ఆమెను ఉపయోగించుకుంటుంది. అది నీకు చేతవలేదు"

"అయినా ఇప్పుడు ఉద్యోగం దొరుకుతుందంటావా? "

"పట్టుదలగా ప్రయత్నించాలి! వెతికిన వెంటనే పెద్ద జీతం రాకపోవచ్చు అంచెలంచెలుగా జీతం పెరుగుతుంది"

"ఆలోచిస్తా. ఆయనతో మాట్లాడాలి"

"అలాగే చెయ్యి! వాళ్లెలాగు మూడు నెలలుంటారుగా!"

"తెలీదు. నిన్న వారినన్న మాటలకు మావయ్యగారు ఎన్నాళ్లుంటారో తెలీదమ్మా!"

"నీకు నీ నోరే విరోధి. అదుపులో ఉంచుకోలేవు"

"నన్ను చివాట్లు పెట్టడం ఆపి నువ్వు చెప్పాలనుకున్నదేంటో చెప్పు"

"ముందు ఉద్యోగం వెతుకు! దొరికాక కాస్త టైమడిగి, మీ ఆయనను ముందుకు తొయ్యి. ఉద్యోగం నిలబడేలా చూసుకో! కొడుకు మాట తల్లిదండ్రులు వింటారు!"

"అందాకా ఆ తల్లిదండ్రులిక్కడుంటారా? "

"అది నీ చేతిలోనే ఉందే! నెమ్మదిగా ప్రవర్తించు. పనులన్నీ నీపైనే వేసుకుని చెయ్యి! మీ అత్తగారి మనసులో మంచిదానిగా స్థానం సంపాదించు!"

"అవన్నీ నాకు రావమ్మా"

"నువ్వేమీ నేర్చుకోవన్నమాట. అయితే నీ ఇష్టం వచ్చినట్లు చేసుకో! మధ్యలో నాకెందుకీ గోల? "

"ఎందుకమ్మా అంత కోపం? "

"మంచి సలహా చెప్తే వినాలి, ఆలోచించాలి! పెద్దచేప వలలోకి పడేట్టు గట్టి ఎర వెయ్యాలి. ఒక్కో సమయంలో మనమే కాస్త తగ్గాలి. అందులో తప్పు లేదు. అగౌరవం అనుకోకూడదు. ఎప్పుడూ ఒకే పట్టుతో కూర్చున్నావంటే జీవితంలో ఓడిపోతావని గుర్తుంచుకో"

మీరా ఆలోచనలో పడటం చూసి "నువ్వు చదువుకున్నావు, తెలివైన దానివి. ఆలోచించు మీరా! నీ పని కావాలంటే సర్దుకుపోవాలి, తెలిసిందా? "

"ప్రయత్నం చేస్తానమ్మా!"

"ఇవ్వాళే నెట్‌లో చూడు"

"ఆకలిగా ఉంది, నిద్ర వస్తోంది"

"టిఫిన్ చేసి పెడతాను తిను, సాయంత్రం బయలుదేరుదువుగాని"

"కాదులే! బాబు స్కూలు మూడు గంటలకు అయిపోతుంది. నేవెళ్లి తీసికెళ్లాలి!"

"సరే, ఇప్పుడే వేడివేడిగా బజ్జీలేస్తాను" అని తల్లి వంటింట్లోకెళ్ళింది.

మీరా అలాగే సోఫాలో వాలింది. ఓ విధమైన సోమరితం అలవాటు చేసుకుంది మీరా. సగం రోజులు ఇంట్లో వంట చెయ్యదు. ఒళ్లు వంచి ఇంట్లో పనులు చెయ్యదు. ఉద్యోగాలు చేసే ఆడవారైనా మగవారైనా విశ్రాంతి అనేది మరచిపోయి కష్టపడి పని చేస్తున్నంత కాలమే సంపాదన. ఓసారి సోమరితనం వచ్చేసిందంటే, ఇంట్లోనే కూర్చోడం అలవాటైందంటే బయటికెళ్లి ఉద్యోగం చెయ్యడానికి మనసొప్పదు. పర్యవసానం డబ్బు చాలకపోవడం, అవమానాలు.. దెబ్బతిన్నప్పుడే ఇలా చేసుండకూడదనిపిస్తుంది. గాయపడ్డాక బాధపడేం ఉపయోగం?

మీరా బయలుదేరి ఇంటికొచ్చేసరికి అయిదయింది.

కల్యాణి బాబుకోసం పాలు, టిఫిను రెడీగా పెట్టింది. పిల్లాడు ఆవురావురుమంటూ తిని పాలు తాగాడు.

"ఒరేయ్! ఎక్కువగా తిన్నావంటే పొట్ట ఉబ్బుతుంది. ఆ తరువాత నేను ఇబ్బంది పడాలి!" అంది మీరా.

"లేదమ్మా! వీటిలో శనగపిండి లేదు ఎక్కువగా! రాగిపిండి ఎక్కువగా కలిపి చేశాను. ఒకటి రెండు ఎక్కువ తిన్నా ఏం అవదు మీరా!" అంది కల్యాణి.

"కల్యాణీ! నీకెందుకీ అనవసర మాటలు? రేపు బిడ్డకు కడుపునొప్పి

ఏదైనా వస్తే బాబుకు ఏవేవో పెట్టి పొట్ట పాడుచేసిందన్న నేరం మోపడానికా? పని చేసి మాటలు పడాలనుందా? " అన్నాడు పరశురామయ్య.

ఆయన నోరు ఊరుకోదు. బదులు చెబుదామనుకున్న మీరా.. పడగెత్తిన పాము నాగస్వరం ఊదగానే అణిగి పోయినట్లు తల్లి బోధ గుర్తుకొచ్చి ఆగిపోయింది.

పిల్లాడిని తీసుకు లోపలికెళ్లింది మీరా. బట్టలు మార్చి, వాడి డైరీ తెరిచి హోమ్ వర్కు ఏమిచ్చారని చూసింది.

సాయంత్రం కల్యాణి కోడలి దగ్గరికొచ్చి "రాత్రికి వంట ఏం చేయనమ్మా? " అంది.

"సిస్టమ్ చూసొచ్చి, నేనే వండుతానత్తయ్యా!" అంది మీరా.

"నీకేమైనా పనుంటే చూసుకో! ఏం చెయ్యాలో చెప్పు నేను వండుతాను!"

"మీ అబ్బాయికి ఏం ఇష్టమో మీకు తెలియదా? అవి చెయ్యండి!" మెత్తని మాటలలో అత్తగారికి చెప్పింది మీరా.

కల్యాణి మహదానంద పడిపోయి "దొండకాయ వేపుడు, నిమ్మకాయ చారు, పెసరపప్పు పచ్చడి చేస్తా" అంది.

"అలాగే అత్తయ్యా! అవి నాకూ చాలా ఇష్టం" అంది మీరా.

కల్యాణి ఉత్సాహంగా కిచెన్‌లోకెళ్లింది.

వెనకే పరశురామయ్య వచ్చి "కోడలు మెనూ చెప్పిందా? " అన్నాడు.

"లేదండీ! నా ఇష్టం వచ్చినవి చెయ్యమంది!"

"అహ! అలాగా? ఆశ్చర్యంగా వుందే! తప్పుగా ఏం అనలేదూ? "

"ఏమీ అనలేదు"

"ఇద్దరం అలా మాట్లాడుకుంటూ వాకింగ్ వెడదామనుకున్నానే!"

"మీరు వెళ్లిరండి. నాకిక్కడ పనుంది"

"అదేమిటి కల్యాణీ? నువ్విలా మానాభిమానాలు లేకుండా.."

"సొంత కుటుంబంలో మానాభిమానాలంటూ చూస్తే నష్టపోయేది మనమే, గానీ ముందు మీరు బయలుదేరండి" అని ఆమె పనిలో పడింది.

ఏడు గంటలకు వసంత్ వచ్చాడు. స్నానం చేసి వచ్చేసరికి తండ్రి టీవీ చూస్తున్నాడు. 'కొడుకు కోడలు' సినిమాలో వాణిశ్రీ, అక్కినేని వాదించుకుంటున్నారు..

"వాణిశ్రీ లాంటి అమ్మాయిలు ప్రతి ఇంటా వున్నారు, ఇలాంటివారిని ఏంచేసినా పాపం లేదు. అత్తింటివారిని నడిరోడ్డుకు లాగాలని కంకణం కట్టుకున్నారు" అన్నాడు పరశురామయ్య.

ఉలిక్కిపడి చూసింది మీరా.

అప్పుడే హాలులోకొచ్చిన కల్యాణి "ఊరుకోండి, అవన్నీ కథలేగా? " అంది.

"నిజ జీవితాలలో వున్న వారినేగా పాత్రలుగా చిత్రీకరిస్తున్నారు" అన్నాడాయన.

"అదే కుటుంబంలో చంద్రకళవంటి వారున్నారుగా! ఆమె మంచి కోడలేగా? మనం ఎప్పుడూ మంచినే చూడాలి!" కల్యాణి కంగారుగా సమాధానం చెప్పింది.

"అమ్మా! ఆకలేస్తోంది" అన్నాడు వసంత్.

"వేడిగా ఊతప్పం వేసియ్యనా బాబూ? " కల్యాణి హడావిడిగా వంటింట్లోకెళ్లి ఊతప్పం ప్లేటు తెచ్చి కొడుకు చేతికిచ్చింది.

"బ్రహ్మాండంగా వుందమ్మా"

"మీరా, నువ్వూ తిను.. వేసుకొస్తాను" అంది కళ్యాణి.

"వద్దు అత్తయ్యా! మనిద్దరం కలిసి భోజనం చేద్దాం" అన్న మీరా మాటలకు వసంత్ ఆశ్చర్యపోయాడు.

"అలా కాదమ్మా, వేడివేడిగా తినాలి!" అంటూ కోడలిని కూర్చోబెట్టి చేసి వడ్డించింది కల్యాణి.

భర్తకు, మనవడు ప్రసన్నకు తినిపించింది కల్యాణి.

పదిగంటలకు అందరూ పడుకున్నారు.

"ఊతప్పమ్, కుర్మా రుచి నాలుక మీద ఇంకా అలాగే వుంది. అబ్బ! ఏం రుచి? ఏం రుచి..!" అన్నది మీరా.

వసంత్‌కు ఉత్సాహంగా "అమ్మకి రుచిగా వండడం, కొత్త కొత్త వంటలు చెయ్యడం అంటే ఎంతో ఇష్టం" అన్నాడు.

"అందులోనూ కొబ్బరి వంటకాలు చెయ్యడంలో అత్తయ్యగారు ఎక్స్‌పర్ట్! ఆమె చేసినట్లు ఎవరూ చెయ్యలేరు"

వసంత్ తనని గిల్లి చూసుకుని 'ఈమె మీరాయేనా? ఎప్పుడూ అమ్మను విమర్శిస్తూ మాట్లాడుతుందే' అనుకుని "ఏమిటిది? సరే.. అడగకూడదు బేతాళుడు మళ్లీ ములగచెట్టు ఎక్కకూడదు.. పెద్దవారితో మంచి మర్యాదలతో మాట్లాడుతూంటే సంతోషంగా వుంది" అన్నాడు.

కొంతసేపు ఏవేవో విషయాలు మాట్లాడుకున్నారు. ఆ సంతోషంలో ఆమెకు దగ్గరవబోతూంటే, "వద్దండీ!" అంది మీరా.

"ఏం మీరా? "

"వీడికి ఐదేళ్లు రానీయండి. ఇపుడే మరొకరు వద్దు. వున్న సమస్యలు చాలవా? "

"వాడికి తోడు మరొకరుండద్దా? "

"కచ్చితంగా వద్దు!"

"నువ్వెటూ ఇంట్లోనే వుంటున్నావుగా.. ఇద్దరిని పెంచలేవా? "

"లేదు వసంత్! నేను ఉద్యోగం చేద్దామని ఈ రోజే నిర్ణయించుకున్నాను"

"ఏమిటి? షాకు మీద షాకిస్తున్నావే!"

"కాదండీ! మీరు బడ్జెట్ గురించి వాదించినపుడు నేను ఉద్యోగానికి వెళ్లననే చెప్పాను. కానీ తరువాత తీరికగా ఆలోచిస్తే భయమేసింది. నెట్‌లో వెతికి నాకు సూటబుల్ అయ్యే జాబ్సుకు అప్లై చేశాను!"

"అబ్బో! ఇంత తొందరగా!? "

"వేరే దారిలేదు. అవసరాలు పెరిగినపుడు సంపాదించే తీరాలిగా!"

అతనికి ఆశ్చర్యం ఎక్కువైపోతున్నది.

## కొత్తగాలి...

**రైతు**
**దేశానికి వెన్నెముక!**
**అందుకేనేమో**
**ఎప్పుడూ బక్కచిక్కే ఉంటాడు!**

– మునగవలస సత్యనారాయణ,
శ్రీకాకుళం

"ప్రస్తుతానికీ విషయం మనిద్దరి మధ్యనే వుండనీ వసంత్!"

"అలాగే మీరా!"

బాబు అటూ ఇటూ చేయి తడుముతూంటే "ఇక్కడే వున్నానురా!" అంటూ వాడి దగ్గరగా జరిగి పడుకుంది మీరా.

వసంత్ లైట్ ఆఫ్ చేసి పడుకున్నాడు. 'మీరా ఉద్యోగం చెయ్యాలని నిశ్చయించుకుందా? అందుకేనా అమ్మతో ఇంత బాగా మాట్లాడడం, పొగడడాలు? పని జరుపుకోడానికి ఇది ఎంతకైనా తెగిస్తుంది. ఇంతకీ ఉద్యోగం దొరుకుతుందా? దొరికేది దొరకంది అలా వుంచితే అసలు అమ్మానాన్నలు ఇక్కడే ఎప్పటికీ వుంటారా? నాన్న ఏమంటాడో? ఆయన్ను ఏ విషయంలోనూ ఎవరూ బలవంత పెట్టలేరు!

వాళ్ళుంటే మంచిదే! కుటుంబాన్ని బాధ్యతాయుతంగా చూసుకుంటారు.. రోజూ మంచి భోజనం చెయ్యొచ్చు. ప్రసన్న కూడా చక్కగా చురుగ్గా పెరుగుతాడు. ఇవన్నీ జరిగేనా? ' ప్రశ్న పెద్దదిగా కనిపించింది. భయంగానూ అనిపించింది.

'సరేకానీ! ఎప్పుడు ఏం జరగాలనుంటే అలాగే జరుగుతుంది' మనసులో అనుకున్నాడు.

మర్నాడు మీరాలో మరింత మార్పు.

కఠినంగా ఒక్క మాటా మాట్లాడలేదు. ఎక్కడా అహంకారం తొంగిచూడలేదు. అత్తగారికి వంటలో సాయం చేసింది. మామగారికి కాఫీ, టిఫిన్లు తనే తీసికెళ్లి ఇచ్చింది. ఎప్పుడూ నవ్వు మొహంతో కన పడుతున్నది. చాలా సేపు కంప్యూటరు ముందుంటున్నది. ఒకటి రెండు గంటలు బయటికెళ్లి వస్తున్నది.

"కల్యాణీ! ఏం జరుగుతున్నది? పెళ్ళయి వచ్చినప్పటి నుంచీ కోడలుపిల్లను ఇలా ఎప్పుడూ చూసిందే లేదు, విచిత్రంగా వుందే!" అన్నాడు పరశురామయ్య.

"నెమ్మది.. ఆమెకు వినపడుతుంది. ఇలా వుంటే మంచిదేగా, మనబ్బాయి సంతోషంగా వుంటాడు!"

"కానీ ఆమె మనసు మార్చుకోదనే రూలేం లేదుగా? అనుమానంగానే వుంది కల్యాణీ! పూర్తిగా నమ్మలేకపోతున్నాను"

"మీ అనుమాన గుణాన్ని ముందు మార్చుకోవాలి"

ఓ వారం గడిచింది.

ఆ రోజు పొద్దున్నే నిద్రలేచి మీరా తయారైంది. చేతిలో ఫైలుతో కల్యాణి వద్దకు వచ్చింది.. "అత్తయ్యా! ఇలా రండి! మామయ్యా మీరు కూడా" అని వారి కాళ్లకు నమస్కరించింది.

"ఏమిటమ్మా..? " అడిగింది కల్యాణి.

"ఇంటర్వ్యూకి వెడుతున్నాను. పెద్ద కంపెనీ. ఆన్‌లైన్‌లో అప్లై చేశాను. మెయిల్‌లో ఇంటర్వ్యూ లెటరు పంపించారు. నన్ను ఆశీర్వదించండి!" అంటూ రెండు ముక్కల్లో విషయం చెప్పింది మీరా.

"విజయోస్తు! నువ్వు తప్పకుండా విజయం సాధిస్తావు" అత్తగారు కోడల్ని మనసారా దీవించింది. మామగారేం మాట్లాడలేదు.

వసంత్ భార్యకు షేక్‌హ్యాండ్ ఇచ్చి ఆల్ ది బెస్ట్ చెప్పాడు. ఇద్దరూ కలిసే బయలుదేరారు. బాబు ఇంకా నిద్ర లేవలేదు.

పెద్దవాళ్ళిద్దరూ లోనికొచ్చారు.

"నా సందేహం నిజమైంది. ఉద్యోగం చెయ్యాలనుకుంటున్నది!" అన్నాడు పరశురామయ్య.

"మంచిదేగా? తనకీ జీతం వస్తే వాడంత ఇబ్బంది పడక్కరలేదుగా! సంతోషించండి!" అంది కల్యాణి.

"చాల్లే వూరుకో! అది ఉద్యోగానికెడితే పిల్లాడినెవరు చూస్తారు? ఇంటి పనెవరు చేస్తారు? "

"అందుకు వాళ్లు ఏదైనా ఆలోచించకుండా వుంటారా? "

"ఆ! ఆ! ఆలోచించకేం? బాగానే ఆలోచించారు! మనిద్దరినీ వాళ్ల దగ్గరే వుంచేసుకోవాలని. దాని ఫలితమే ఈ గౌరవాలు.. కాళ్లకు దండం పెట్టడాలు.."

కల్యాణి మాట్లాడలేదు.

"బాధ్యతలన్నీ మన తలపైన పెట్టి ఆమె ఉద్యోగానికెడుతుంది!"

"మీరాగండి, తొందర పడద్దు. వాళ్ల నిర్ణయం బయటకు రానియ్యండి!"

"వచ్చేసిందే! వాళ్ల అమ్మకు కుటుంబ బాధ్యతలు. ఆమె రాలేదు. మనమేగా దేశ దిమ్మరులం!"

"ఎందుకలా అనుకుంటారు? మనబ్బాయికి మనం సాయపడితే అందులో తప్పేం లేదుగా? "

"ఓహో..! నువ్వు కూడా నిర్ణయించేసుకున్నావన్న మాట!"

"ఎందుకు కోపం? వాళ్లొచ్చి చెప్పనీయండి! ఎలాగూ మూడు నెలలు ఇక్కడే ఉంటాం"

"అలా అగ్రిమెంటేం లేదుగా కల్యాణీ! రేపే మనం బయలుదేరి వెళ్లిపోదాం"

"ఇదిగో! అనవసర పట్టుదలతో ఏవేవో ప్రసంగాలు చెయ్యొద్దు. ఏ నిర్ణయానికీ రావద్దు తెలిసిందా? "

"సరే! నువ్వే ఏదో ఒకటి చెయ్యి.

**అక్షరం**

నీ బాధకు కారణం ఏదైనా కావచ్చు
కానీ ఆ కారణంతో
ఇతరులకు హాని చేయొద్దు

– బుద్ధుడు



మనకు వయసుడిగినంతలో ఎవరూ చులకన చేయకూడదు"

ఇంతలో మనవడు లేస్తే కల్యాణి గదిలోకెళ్లింది.

★ ★ ★

రాజీవ్ గాంధీ రోడ్డులో ఉన్న పెద్ద ఇంటర్ నేషనల్ కంపెనీ.

మీరా ఆ తొమ్మిదంతస్తుల భవనంలోకెళ్లింది. ఎన్నో పరిశీలనలు ముగిశాక లోనికనుమతించారు.

సుమారు నలభైమంది వచ్చారు. అన్నీ ఆన్‌లైన్ టెస్టులే! ఒక్కొక్కరికీ ఒక్కో కంప్యూటరు, ప్రింటరు ఇచ్చారు. ఉదయం పదిగంటల నుంచి మధ్యాహ్నానికి ఏడు టెస్టులు. ఒకదాంట్లో పాసయితేనే తరువాతి దానికి వెళ్లడానికి సాధ్యపడుతుంది! చాలా టఫ్‌గా ఉంది. అతివేగంగా స్పందించాలి. జరిగిన ఏడు పరీక్షల్లో పాసయినవారు ఏడుగురే! అందులో మీరా ఒకతి!

రుచికరమైన ఖరీదైన లంచ్ ఏర్పాటుచేశారు. మళ్లీ మూడు గంటలకు టెస్టులు మొదలయ్యాయి. ఆరు గంటలకు మిగిలింది ఇద్దరే. ఆ ఇద్దరిలో మీరా ఒకరు. మీరాకు గుండె దడదడా కొట్టుకుంది. ఆ ఇంకొకరు గుప్తా, నార్త్ ఇండియన్. తెలుగు రాదు, హిందీ, ఆంగ్లం భాషలే వచ్చు. మీరాకు రెండు భాషలు తెలుసు. ఆరున్నరకి ఇద్దరికీ వేరువేరు గదులలో ముఖాముఖీ ఇంటర్వ్యూ! బేనరులో ముగ్గురు మగవారు ఇద్దరు మహిళలు.. మొత్తం ఐదుగురు అధికారులు మార్చి మార్చి ప్రశ్నలడిగారు. ఇద్దరూ నెగ్గారు, ఇద్దరినీ అపాయింట్ చేసుకుంటామన్నారు.

'డ్యూటీ పొద్దున పది గంటలకు మొదలయితే ఒక్కోరోజు రాత్రి పది గంటల వరకు చెయ్యాల్సి వుంటుంది. సెలవు దినాలలోనూ చెయ్యాల్సి రావచ్చు. మరో ఊరు, మరో దేశం కూడా వెళ్లాల్సి ఉంటుంది. కుటుంబానికి కొన్ని రోజులు దూరం కావచ్చు. ఇదో తపస్సనుకుని చేయగల్గితే ఈ ఉద్యోగంలో చేరవచ్చు' అంటూ నియమావళి చెప్పారు.

అన్నింటికీ మీరా అంగీకరిస్తున్నట్లుగా తలాడించింది.

ఆమె ఆంగ్లం మాట్లాడే విధానం, అంతకుముందే ఆన్‌లైన్‌లో ఆమె జయించిన తీరు.. అన్నీ అధికారులకి నచ్చాయి.

కాసేపు వెయిట్ చెయ్యమని అపాయింట్‌మెంటు ఆర్డరు ఇచ్చారు.

మీరాకు కలలోలాగా ఉంది. లక్షన్నర నెల జీతం! డ్రైవరుతో కారు వసతి. ఆమె ఇంటి టెలిఫోను బిల్లు కంపెనీ కడుతుంది. లంచ్ ఫ్రీ! అంతేకాదు ఇన్సూరెన్సు, పిల్లల చదువుల ఖర్చులు, మెడికల్ బెనిఫిట్సు, సంవత్సరానికొకసారి ఎల్.టి.సి. - ఇలా ఎన్నో సౌలభ్యాలు! మీరాకు నమ్మశక్యం కావడం లేదు.

"మిమ్మల్నిప్పుడు మా కంపెనీ కారులో డ్రాప్ చేస్తాం. ఎప్పుడు డ్యూటీలో జాయినవుతారు? " అనడిగారో అధికారి.

"ఎల్లుండి. బుధవారం జాయినవుతా"

"అభినందనలు!"

బయటకొచ్చేసరికి చీకటి పడింది. రిసెప్షన్‌లో వసంత్ ఎదురు చూస్తున్నాడు.

## కొత్తగాలి...

**హీరోహీరోయిన్లంతా**
**జీరోసైజు కోసం పోటీ**
**ముతక బియ్యం సైతం**
**వారికి గట్టి పోటీ!**

– సొంపాక సీత,
భద్రాచలం

కంపెనీ కారు సిద్ధంగా ఉందని చెప్తే "కారెందుకు? నా బైకుందిగా! బైకులో వెడదాం పద!" అన్నాడు.

"వద్దు, నేను కంపెనీ కారులో వస్తాను. మీరు బైకులో రండి" అంది మీరా.

వసంత్ మొహం మాడిపోయింది. ఏం మాట్లాడకుండా బయలుదేరాడు.

మీరా ఖరీదైన కారులో దిగింది. దారిలో స్వీట్లు, పండ్లు కొని తెచ్చింది. అవన్నీ అత్తగారికిచ్చి ఉద్యోగ వివరాలన్నీ చెప్తుండగా వసంత్ వచ్చాడు.

అపాయింట్‌మెంటు ఆర్డరు భర్త చేతికిచ్చింది. అది చూసిన వసంత్ ఆశ్చర్యపోతూ "లక్షన్నర జీతమా? అబ్బా! నన్నే మించిపోయావే! ఇంతిస్తారని నేననుకోనే లేదు" అన్నాడు.

"దాదాపు పది గండాలను విజయవంతంగా దాటి పర్సనల్ ఇంటర్వ్యూకి వచ్చాను. చాలా టఫ్‌గా ఉంది వసంత్!" అంది మీరా.

"అయినా సాధించావు కదమ్మా! ఎప్పుడు చేరాలి? " అడిగింది కల్యాణి.

"రేపు మంగళవారంగా! ఎల్లుండి బుధవారం చేరతాను. మీరు కాస్త పంచాంగం కూడా చూసి చెప్పండి"

కల్యాణి పంచాంగం చూసి "బుధవారం శుక్లపక్ష పంచమి. రోజంతా శుభ గడియలే! రాహు కాలాలు, యమగండాలు ఏమీ లేవు. ఇంతకన్నా మంచి రోజు ఇంకేం కావాలి? అమ్మా మీరా! చాలా మంచిరోజు.. నిస్సంకోచంగా వెళ్లి ఉద్యోగంలో చేరు" అంది.

పరశురామయ్య ఆర్డరు మొత్తం చదివి "ఏ సమయంలో పిల్చినా రావాలన్నారు. పొద్దున పది నుంచీ రాత్రి పది వరకూ డ్యూటీ వేళలన్నారు. మరో ఊరు, మరో దేశం టూర్లు ఉంటాయన్నారు" అన్నాడు.

"ఆ! అవును మామయ్యగారూ! ఆ జీతమే కాకుండా ఇంకా కారు, పిల్లల ఫీజుల్లాంటి ఎన్నో బెనిఫిట్లు ఇస్తున్నారుగా! అలాంటప్పుడు వాళ్లు చెప్పినట్లు మనం చెయ్యాలిగా!" అంది మీరా.

"అది బాగానే ఉంది. కానీ నీకు రెండున్నరేళ్ల కొడుకున్నాడే. వాడిని చూసుకోవాలిగా నువ్వు? "

"అవును చూసుకోవాలి. మీరు, అత్తయ్యగారు ఉన్నారుగా! మాతోనే ఉండి చూసుకుంటారుగా!" అంది మీరా.

వసంత్ భార్యను తీక్షణంగా చూశాడు.

"మామయ్యగారూ! ఇకపైన మీరు, అత్తయ్యగారూ ఎక్కడికీ వెళ్లొద్దు. ఎప్పుడూ మా దగ్గరే ఉండండి. కుటుంబ బాధ్యత, బాబు బాధ్యత మీవే.. ఏం అత్తయ్యా? "

"అలా మమ్మల్నెవరూ కట్టిపడేసి వుంచలేరమ్మా. అందుకు అనువైన వయసు కాదు మాది" అన్నాడు పరశురామయ్య.

మీరా మొహంలో రంగులు మారాయి. కోపాన్ని బలవంతంగా నిగ్రహించుకుని "మీరు కాకపోతే మాకింకెవరున్నారు మామయ్యా! మిమ్మల్నేగా మేం హక్కుగా అడగగలం? " అంది అతి శాంతంగా మీరా.

"కానీ అమ్మా! ఈ మర్యాద, నెమ్మదితనం ఇన్నాళ్ళూ ఏమైపోయినయి? సరుకులు, కాయగూరలు తెచ్చిమరీ వంట చేస్తే వచ్చిన రోజునే నిలబెట్టి దులిపేశావే? " అన్నాడాయన.

"సరే, ఇప్పుడవన్నీ ఎందుకులెండీ వదిలె

య్యండి". కల్యాణి అన్నది.

"నువ్వు మాట్లాడకు కల్యాణీ! ఎవరికీ సపోర్టు రాకు. నిన్న మనతో పనిలేదు కనుక ఎందుకొచ్చారా అనుకుంది. ఇప్పుడు ఉద్యోగం దొరికింది కనుక మన సహాయం అవసరం. సారీ వసంత్! నేను మాట్లాడకుండా వుండలేకపోతున్నాను. మీరా ఉద్యోగ ప్రయత్నాలు మొదలుపెట్టి నప్పటి నుంచే నటించడం మొదలుపె ట్టింది. అవసరాలు వచ్చినప్పుడే ఇతరులకు విలువ ఇవ్వడం పచ్చి స్వార్థదం కాదా? " అనేశాడు పరశురామయ్య.

"ఎందుకలా మాట్లాడతారు? " కల్యాణి భర్తను ఆపబోయింది.

"నువ్వుండు కల్యాణీ! ఆమె మాట్లాడిన ప్పుడు ఎవరూ నోరెత్తలేదు. నాకు మాత్రం అందరూ చెప్పొచ్చేవారే"

"పోనియ్యండి నాన్నా! జరిగినదానికి నేను మన్నించమని అడుగుతున్నాను" అన్నాడు వసంత్.

మీరాలో కోపం భగభగమంటున్నది.

భర్త ఇంకా మాట్లాడ్తే విపరీతానికి దారి తీస్తుందని భయపడ్డ కల్యాణి "సరే భోజ నాలు చేద్దామా? " అంది.

"నాకాకలిగా లేదు, మజ్జిగ మాత్రం తాగుతాను అత్తయ్యా" అని మీరా బట్టలు మార్చుకునేందుకు లోనికెళ్లింది.

అందరూ మొక్కుబడిగా తిని లేచారు.

గదిలోకొచ్చిన కల్యాణి మొహంలో కళ లేదు. "ఎందుకిలా మొహం మీద కొట్టి నట్టు మాట్లాడతారు? నే చెప్పిందేదీ మీ చెవులకెక్కలేదా? " అంది.

"ఏమిటే నువ్వనేది? ఏ ఒక్కనాడైనా మర్యాదగా మాట్లాడిందా? విలువ ఇచ్చిందా? ఇక్కడ ఉన్నన్నాళ్లు పనంతా నువ్వే చేస్తావు. అయినా మనం ఇక్కడుం డటం తనకు ఇష్టం ఉండదు. నువ్వు న్నంత కాలం ఇక్కడి గ్లాసు అక్కడ పెట్టదు. పనంతా నీ నెత్తినే! కనీసం సొంతంగా నిన్ను ఏం చెయ్యనియ్యదు. అలాంటిది ఇప్పుడు మాత్రం ప్రేమ పొంగుకుంటూ వచ్చిందా ఏమిటి? నాటకా లు. గొప్ప జీతంతో ఉద్యోగం వచ్చింది కనుక పని జరుపుకోడానికి వెన్న రాస్తు న్నది. ఆమెకు సేవలు చెయ్యడానికి దేవు డు నిన్ను పుట్టించలేదు" అన్నాడు పరశు రామయ్య.

కల్యాణి మౌనంగా వుండిపోయింది.

"మాట్లాడవేం? నేను చెప్పింది తప్పా? "

"లేదు లేదు.. ఏం తప్పు లేదు. కానీ వయసుడిగాక ఇంత అహం ఉండకూ డదు.. అంతే!"

"అదేం కాదు"

"ఇంతకీ ఇప్పుడేం చేద్దామని? "

"బుధవారం మనం బెంగళూరు బయ లుదేరుదాం. ఇందిరకు ఫోను చేస్తాను"

"తొందర పడకండి. మీరా ఉద్యోగంలో చేరే రోజునే మనం బయలుదేరితే బాగుం డదు. తప్పుగా ఉంటుంది. వాడొక్కడేం చెయ్యగలడు? కొడుకుతో అవస్థలు పడాలి. అదెలాగైనా ఉండనీ, వాడు మన బ్బాయి! వాడినలా అవస్థల పాలు చెయ్యడం మనకి న్యాయం కాదండి!"

"అయితే నువ్వు రావన్నమాట!"

"మనం వెళ్లద్దండీ!"

"కాదు, నేను ఇందిర దగ్గరకు వెడ తాను. నువ్విక్కడే పనిమనిషిలా ఉండు"

"ఏం మాట్లాడతారు? మనమెప్పుడూ విడిగా ఉండలేదు"

"మరి నాతో రా!"

"ఇదిగో చూడండి! పొద్దున్నే మాట్లా డదాం. మనం ఇక్కడుండాల్సిన మూడు నెలలు ఉందాం"

"ఆ తరువాత వెళ్లలేం. పిల్లాడి బాధ్యత తలమీద పడ్డాక వదిలించుకు వెళ్లగ లమా? అప్పుడు మరీ నిష్ఠూరం అవు తుంది. ఇప్పుడే వెళ్లిపోతే వాళ్లే ఏదో ఒకటి ఏర్పాటు చేసుకుంటారు!"



"బాగుండదు. దీని గురించి వసంత్‌తో మాట్లాడాలి. కోడలి మీది కోపంతో వాడిని నిర్లక్ష్యం చేసి వెళ్లిపోకూడదు. మనబ్బాయి అమాయకుడు, మంచివాడు. వాడి మనసు నొప్పించడం నాకిష్టం లేదు"

"నువ్వు నన్ను బతకనియ్యవు, చావనియ్యవు. నేను అవమానాల పాలైతేనే నీకు సంతోషం"

"లేదండీ! మీరు నన్ను అర్థం చేసుకోండి. స్త్రీకి కొడుకు, భర్త ఇద్దరూ ముఖ్యమే! ఏ సంబంధాన్నీ కాదనుకోలేదు"

ఇక్కడ కల్యాణి బాధపడుతూంటే అక్కడ మీరా అగ్నిపర్వతం అయింది.

"విన్నారుగా! మీ నాన్నగారు అడిగే ప్రశ్నలు? నన్ను వదిలెయ్యండి. నా కోసం ఏమీ చెయ్యద్దు. కానీ, మీరు వారి బిడ్డ. మీకోసం అయినా చెయ్యాలి. చెయ్యద్దా? వీడు మీ బిడ్డ, మీ సర్వస్వం. మీ మీద ప్రేమ ఉంటే చేస్తారు" అంది.

"చాల్లే! డబడబా మాట్లాడెయ్యకు. తొందరొద్దు. అన్నివిధాలుగా ఆలోచించాలి"

"నేనూ అదే అంటున్నాను వసంత్! పెద్ద ఉద్యోగం, పెద్ద జీతం.. ఎన్ని రకాల సౌలభ్యాలు! స్కూలులో బాబుని చేర్పించాలి. రెండు లక్షల ఫీజు మొదట కట్టినా, తరువాత దాన్ని క్లెయిమ్ చేసుకోవచ్చు. డ్రైవరుతో కారు సౌకర్యం, వాడి చదువు ఖర్చు, టెలిఫోను బిల్లు, ప్రపంచమంతా తిరిగి రావడానికి ఎల్.టి.సి. ఇంతకన్నా ఇంకేం కావాలి? మన బడ్జెట్టుకు తక్కువైంది నలభైవేలు. దానికి మూడు రెట్లు వస్తుంది. ఇక ప్రశాంతంగా ఉండచ్చు. మరో ఇల్లు కూడా కొనుక్కోవచ్చు. వసతులు పెంచుకోవచ్చు. మన బాబు భవి



వృత్తు బాగుంటుంది. ఇవన్నీ సంతోషాలు కావా? మీరే చెప్పండి? "

"నీ మాటలు పూర్తిచెయ్యి"

"నేనింకేం మాట్లాడాల్సింది లేదు. కష్ట పడి విజయం సాధించుకొచ్చాను. ఆ ఫలి తాన్ని మనం అనుభవించాలంటే నేనీ ఉద్యోగంలో చేరాల్సిందే వసంత్"

"వెడుదువుగానిలే మీరా! ఊరికే రెచ్చి పోక ప్రశాంతంగా ఉండు!"

"అలా కాదండీ, మీ నాన్నగారు మాట్లా డేది చూస్తే వారి సహాయం మనకుంటుం దాని నాకు అనుమానంగానే ఉంది"

"కొంచెం నిదానించు తొందరపడకు"

"ఆయన మొండి మనిషి! ఎవరు ఏం చెప్పినా వినరు"

"నువ్వూ అలాంటిదానివేగా? "

"మీరేం మాట్లాడుతున్నారు? "

"ఉన్నదే అంటున్నాను మీరా! నువ్వెప్పు డైనా వారు చెప్పింది విన్నావా? వాళ్ల మాటకు విలువ ఇచ్చావా? మొదటినుంచీ మా అమ్మనాన్నలను శత్రువులుగానే చూశావు. ఇక్కడున్నంతకాలం ఇంటి పనం తా అమ్మే చేస్తుంది. కనీసం సాయం కూ డా చెయ్యవు. దాన్ని నువ్వు కాదనలేవు"

"అది నేను కాదనను. ఒప్పుకుంటాను"

"వాళ్ళెప్పుడూ తమకి నచ్చినట్లు చేయ రు. నిన్నడగకుండా ఏమీ చెయ్యరు. పరు షంగా మాట్లాడి నొప్పించరు. మొహాలను ముటముటలాడించుకోరు. నవ్వు మొహా లతో పార్వతీ పరమేశ్వరుల్లా వుంటారు. ఇదంతా నీకు బాగా తెలుసు మీరా!"

"కానీ మీ నాన్నగారు వాటన్నిటికీ బదులు తీర్చుకుంటారుగా? "

"నువ్వాగు మీరా! నేను అమ్మలోని

## కొత్తగాలి...

**మనిషిని**
**పడగొట్టేందుకు**
**మారణాయుధాలవసరం లేదు**
**ఒక్క చిరునవ్వే చాలు!**

*- ధరణికోట శివరాంప్రసాద్,*
*హైదరాబాద్*

సుగుణాలు చెబుతూంటే నాన్నగారిలోని మైనస్ పాయింట్లను ఎత్తి చూపిస్తావే? "

"అవీ చెప్పాల్సిందేగా!"

"అలా అయితే నేను నిదానంగా ఉన్నాను, నువ్వున్నావా? మాటకి మాట ఎదురు చెప్పకుండా ఉంటావా? "

"ఉరుము ఉరిమి మంగలం మీద పడ్డట్లు తిరిగి తిరిగి నా మీద వేస్తున్నారా నేరాలన్నీను? "

"లేదమ్మా తల్లీ! ఇన్నాళ్ళూ ఉద్యోగానికి వెళ్లనన్నావు! ఇప్పుడేగా అమ్మాయిగారికి జ్ఞానోదయం అయింది"

"సరే! వాళ్లు మనకి సహాయంగా ఉంటారని నమ్మాను! కానీ, అయ్యేలా లేదు. నా ప్రసవ సమయంలోనూ అంతే.. వారు రాలేదు, మా అమ్మేగా వచ్చింది? "

"నువ్వేగా వాళ్ళని రానియ్యలేదు"

మాటలు పెరిగి, వాదాలు ఎక్కువై వాగ్యుద్ధంగా మారుతోంది.

"చాలు గానీ ఇంతటితో ఆపుదాం. ఇలా జగడాలతో పరిష్కారం దొరకదు. ఏం చేయాలో ఆలోచించాలి. పరిష్కారమేంటో నువ్వే చెప్పు.."

"చెప్పేశానుగా! ఇంత పెద్ద జీతాన్ని ఇన్ని బెనిఫిట్స్‌ని వదులుకోలేను"

"నేను వదలమనడం లేదు"

"కానీ, వాళ్లు సహాయపడకపోతే ఏం చెయ్యాలన్నదే ఆలోచించాలి"

"నేను మాట్లాడి చూస్తాను" అన్నాడు వసంత్.

"ఒప్పుకోకపోతే మనం బతకలేకపోం!"

"ఇదిగో.. చూడు! ముందు నువ్వు ఈ పొగరు తగ్గించుకోవాలి"

"ఇది పొగరు కాదు వసంత్, నిజం!"

"సరే! బాబుని బేబీ కేర్ సెంటర్లో వది లెల్లాలి. అందుకు నువ్వు రెడీయేనా? "

"వేరే దారి లేదా? వాళ్లు బాగా చూసు కుంటారా? "

"పెద్ద మొత్తం జీతంగా వస్తున్నదిగా! కాస్త ఎక్కువ డబ్బులిచ్చి ఓ మనిషిని ఏర్పాటు చేసుకుందాం.. నేనెవరినీ బతిమి లాడదలచుకోలేదు!"

"సరే! నీ ఇష్టప్రకారం చెయ్యి"

"ఇదేమిటి వసంత్! మీరు ఇలా అంటే ఎలా? "

"నేనేం తప్పుకోవడం లేదు మీరా! పని జరగాలంటే మన్ననగా వుండమని వారం నుంచీ నచ్చ జెప్తున్నాను. తీరా నాన్నగారు మాట్లాడేసరికి నీ కోపం కాస్తా బుసలు కొడుతూ పైకి వచ్చిందే! ఇప్పుడైనా కాస్త తగ్గించుకోవాలి నీ కోపాన్ని? "

"వారి కాళ్ల మీద పడాలా? "

"పడితే తప్పేం లేదు, పెద్దవారేగా? "

"ఆశీర్వదించకపోయినా మీ నాన్నగారు తన్నకుండా ఉంటే చాలు"

"నేను చెప్పింది విను! కొన్ని విషయాల్లో నువ్వు సర్దుకుపోతే ఈ విషయం తేలికగా పరిష్కారమవుతుంది"

"ఎలా? "

"వాళ్లు పెద్దవారైపోయారు. రోజంతా పనిచెయ్యలేరు. పొద్దున తొమ్మిదింటికి నువ్వు బయలుదేరాలి. అంతవరకు చెయ్యాల్సిన పనులు- పొద్దుటి టిఫిను, బాబుని స్కూలుకెళ్ళడానికి రెడీ చెయ్యడం వంటి పనులు నువ్వు చెయ్యి"

"ఆఫీసు నుంచి వచ్చి పడుకునేసరికే రాత్రి పదకొండవుతుంది.. పొద్దున్నే

తొందరగా లేవగలనా నేను? "

"లేవాలి! అమ్మ పొద్దున అయిదు గంటలకు లేచి రాత్రి పదకొండు వరకూ పనులు చేయగలదా? అది న్యాయమా? మనకు మాత్రం మనసొప్పుతుందా? "

"నేనక్కడికెళ్లి ఆఫీసు పనితో కుస్తీపట్టాలి. మళ్లీ.."

"ఎవరికోసం? నీ కుటుంబం కోసమేగా! ఉద్యోగాలు చేసే మహిళలెవరైనా సరే.. తను, తన కుటుంబం బాగుండాలనుకుంటే కష్టపడే తీరాలి. విసుక్కున్నందువల్ల లాభం ఉండదు. నేను నీతో పాటు అన్ని పనులలోనూ సాయం చేస్తాను.. సరేనా? "

"ఆс సరే!"

"మరో సంగతి, నాన్నగారు డబ్బులిస్తే తీసుకోకూడదు. ఆయనసలు డబ్బులెందుకియ్యాలి? మనకోసం కష్టపడేవాళ్ల దగ్గర డబ్బు లెక్కకట్టి తీసుకోవడం ఏమిటి? అంతగా మనకెప్పుడైనా డబ్బు అవసరపడితే అడిగి తీసుకుని మళ్లీ ఇచ్చేద్దాం. మనకింత డబ్బు వస్తున్నప్పుడు వాళ్ల నుంచి వసూలు చెయ్యడం ఏమిటి? మన కన్నపిల్లల కోసం లక్షలకొద్దీ ఖర్చు చేస్తూ, మనల్ని కని, పెంచి, ఇంతవాళ్లని చేసిన తల్లిదండ్రుల కోసం ఆ మాత్రం ఖర్చు పెట్టలేమా? కన్నవారికి అన్నం పెట్టడానికి, తోడ పుట్టినవారికి పసుపు కుంకుమల ఖర్చుకు వెనకాడటం అంటే.. తల్లిపాలకు వెలకట్టడంలా ఉంటుంది. ఇవన్నీ డబ్బుతో విలువ కట్టలేనివి మీరా"

మీరా మౌనంగా ఉండిపోయింది.

"నువ్వేం మాట్లాడకు, నేను ప్రేమగా మాట్లాడతాను" చెప్పాడు వసంత్.

"మీరెంత ప్రేమగా మాట్లాడినా మీ నాన్నగారేం కరిగిపోరు. వాదులాడుతారు"

"అవన్నీ నేను చూసుకుంటాగా! నువ్వు ఉద్యోగంలో చేరు. నేను మాట్లాడతాను"

మీరా తలాడించింది.

"రేపు పొద్దున్నే ఐదు గంటలకు లేచి ఇంటిపనులు ప్రారంభించు"

"చూద్దాం"

"చూద్దామనడం కాదు, చెయ్యాలి. నువ్వనుకున్నవన్నీ జరగాలనుకుంటే.."

★ ★ ★

పొద్దున ఐదుగంటలకు అలారం మోగింది. మీరాకు బద్ధకంగా వుంది. ఏడు వరకు పడుకునే అలవాటు. ఒళ్లు సహకరించడం లేదు.

వసంత్ లేపి కూర్చోబెట్టాడు.

మొహం కడుక్కొనొచ్చింది. వంటగదిలో లైటు వెలుగుతోంది. కల్యాణి తలస్నానం చేసి తలకు తడి టవలు చుట్టుకుని పాలు కాస్తున్నది. ఇంకోవైపు కుక్కరు.

"అత్తయ్యా! అప్పుడే లేచారా? "

"నేను రోజూ అయిదుకే లేస్తానమ్మా!"

పూజా మందిరంలో దీపారాధన కాంతులు! సాంబ్రాణీ కడ్డీల పరిమళాలు! ఇక్కడ కుక్కరు ఈలలు..!

"నువ్వెళ్లి పడుకో మీరా!"

"లేదత్తయ్యా! రాత్రే చెప్పకపోవడం నాది పొరపాటు"

"ఏం చెప్పాలనుకున్నావు? "

"రేపటి నుంచీ పొద్దున్నే చెయ్యవలసిన పనులు, కాఫీ, ఫలహారాలు నేను చేస్తాను. రాత్రి రావడానికి ఆలస్యం అవుతుంది కనుక అప్పుడెటూ మీరే చేయాల్సొస్తుంది మీకు శ్రమ అవుతుంది" అంటున్న కోడలిని అభిమానంగా చూసింది కల్యాణి.

"చేస్తాను, శ్రమ కాదు. నా చేతనైనంత వరకూ చేస్తాను. పొద్దున్నే ఇంట్లో చేసి ఆఫీసుకెళ్లి పగలంతా కష్టపడి పని చెయ్యాలి. నువ్వూ మనిషివేగా? నా కూతురికైతే చెయ్యనా? నీకూ అంతే మీరా? "

"అత్తయ్యా!" పరవశించింది మీరా.

"కోడలు కాపురానికి రాగానే అత్తలు విశ్రాంతి తీసుకోవాలనేం లేదు. నేను చేసు

## కొత్తగాలి...

**తెల్లారింది**
**పక్షుల కిలకిలారావాలు**
**కళ్లు తెరిచి చూసేను**
**సెల్‌ఫోన్ల రింగుహోర్లు!**

– జి. విజయశ్రీ,
అరసవల్లి, శ్రీకాకుళం జిల్లా

కోలేకపోతే నువ్వేగా చెయ్యాలి!"

"సరే అత్తయ్యా! నేను స్నానం చేసి వచ్చి మీకు సహాయం చేస్తాను!"

"పద్దమ్మా! బాబు సంగతి చూడు!"

"అత్తయ్యా!"

"ఏమిటో చెప్పమ్మా!"

"నేనీ ఉద్యోగంలో చేరనా? "

"తప్పకుండా చేరమ్మా. ఇంత మంచి ఉద్యోగాన్ని ఎవరైనా వదులుకుంటారా? "

"అది కాదత్తయ్యా! మీరిక్కడ నుంచి వెళ్లిపోతే ఎలా అనే!"

"వెళ్లం.. "

"మామయ్యగారు ఒప్పుకుంటారా? "

"మాట్లాడతాను. అవన్నీ నేను చూసు కుంటాను. మగవారి కోపాలు ఎక్కువ కాలం వుండవు. ఆడవారి తీరుని బట్టి వారి కోపం పెరుగుతుంది, తగ్గుతుంది!"

మీరా బయటికొచ్చింది. 'ఇంతకన్నా మంచి అత్తగారెవరూ వుండరు. నేను త గినట్టు నడుచుకోవాలి' అనుకుంటూ బయ టకొస్తే తలుపు నానుకుని వసంత్.

"ఏమిటండీ? "

"అమ్మ వల్ల ఏ సమస్యా రాదు. నాన్న గారిని అమ్మ చూసుకుంటుంది. నువ్వు కాస్త నెమ్మదిగా వుంటూ సర్దుకుపోవాలి.. తెలిసిందా? "

సరేనంటూ మీరా స్నానానికెళ్లింది.

పొద్దుటి ఫలహారానికి అందరూ డైనింగు టేబులు ముందు ఆశీనుల య్యారు. పొగలు చిమ్ముతున్న వేడివేడి పొంగల్, వడలు, అల్లం కొబ్బరి చట్నీలతో ఘుమఘుమలాడుతున్నాయి.

పరశురామయ్య తింటూ "వసంత్! పచారీ సరుకులకు ఆరువేల అయిదువం దలు ఖర్చు పెట్టాను. తతిమా మూడువేల అయిదు వందలు నీ చేతికిస్తాను!" అన్నాడు.

"ఎందుకు నాన్నగారూ! మీరివ్వడం? మీరు ఖర్చు చేసిన డబ్బులు సాయంత్రం తిరిగిస్తాను"

"ఏం? ఎందుకు? "

"ఇంక పైన మీరేం డబ్బులు ఇవ్వద్దు. మీ ఇద్దరినీ చూసుకోవడం నా బాధ్యత"

"ఇదేమిటి కొత్తగా? "

"అదంతే!"

పరశురామయ్య భార్య వైపు తిరిగి "కల్యాణీ! మహదానందపడిపోకు. రోజం తా మనం చేసే చాకిరీకి ఆ పదివేలు వాళ్లిచ్చే జీతం డబ్బులు!" అన్నాడు.

"మామయ్యగారూ!"

"ఆగు మీరా! మాట్లాడద్దు! ఇందులో జోక్యం చేసుకోవడానికి నీకు, అమ్మకు హక్కు లేదు. తెలిసిందా? "

ఆమె నోరు మూసుకుంది.

"నాన్నగారూ! మీరెలా అనుకున్నా సరే! నిన్న జరిగిందాని గురించి మాట్లాడడం వల్ల ఏ లాభమూ లేదు. జరిగిపోయింది తిరిగి రాదు. వదిలెయ్యండి. మీకు చెయ్యా డం మా బాధ్యత! మాకు సహాయం చేయ మని మీ కొడుకుగా మిమ్మల్ని అడిగే హక్కు నాకున్నది!"

"నీ అవసరాలు చాలా వున్నాయి గనుక ఇలా నాజూకుగా అడుగుతున్నావు" అ న్నాడు పరశురామయ్య.

"సరే నాన్నా! అలాగే అనుకుందాం. మేం వెళ్లి పరాయివాళ్లని అడగగలమా? "

"మమ్మల్ని ఇంతకాలంగా పరాయి వా

## మరణించిన వ్యక్తిని పెళ్లి చేసుకోవచ్చా!?

చతుర సమాచారం

ప్రతి సమాజంలో పెళ్ళిళ్ళు తప్పనిసరి. పెళ్ళికి సంబంధించిన కొన్ని విశేషాలు..

★ బీద దేశాల్లో కంటే అభివృద్ధి చెందిన దేశాల్లో పెళ్ళి కాకుండా కలిసి ఉండటం అధికమవుతోంది!

★ పెళ్ళయ్యాక మొదటి ఏడాది దంపతుల మధ్య సెక్స్ 68.5 సార్లు, అంటే సగటున వారానికి ఒక్కసారి కంటే ఎక్కువసార్లు జరుగుతోంది.



★ పెళ్ళికి మునుపే సెక్స్ సంబంధం ఉంటే, విడాకులకి దారితీసే అవకాశాలు డెబ్బై ఐదు శాతం దాకా ఉన్నాయి.

★ ప్రతి ఐదుగురు దంపతుల్లో ఒక జంట మధ్య సెక్స్ సంవత్సరానికి 10 సార్లు మించి ఉండదు. ఇది నెలకి ఒకసారి కంటే తక్కువ.

★ చరిత్రలో బయటి సంబంధాలకంటే రక్తసంబంధీకుల మధ్య వివాహాలే అధికం!

★ ఇంగ్లీష్‌లో బ్రైడ్ (పెళ్ళికూతురు) అనే పదం పాత జర్మన్ భాష నుంచి వచ్చింది. దీని అర్థం టు కుక్ అంటే వంట చేయడం!

★ ఫ్రాన్స్‌లో మరణించిన వ్యక్తిని వివాహం చేసుకోవచ్చు (ఆస్తి కోసం)!

★ ఐన్‌స్టీన్, డార్విన్, సద్దాం హుస్సేన్, ఎడ్గర్ అలెన్‌పో తమ మొదటి కజిన్స్‌నే పెళ్ళి చేసుకున్నారు.

★ లాస్‌వెగాస్‌లో సగటున రోజుకి మూడు వందల పెళ్ళిళ్ళు జరుగుతాయి!

★ తమిళనాడులో ఒకతను తను చేసిన తప్పుకి పరిహారంగా కుక్కని పెళ్ళి చేసుకున్నాడు!

★ 2007లో ఎరికాలా ఘూర్ ఐఫెల్ అనే మహిళ ఈఫిల్ టవర్‌ని పెళ్ళి చేసుకుంది!

★ అమెరికాలో వాషింగ్టన్ డి.సి.లో పెళ్ళిళ్ళు తక్కువగా జరుగుతాయి.

★ అమెరికాలో పెళ్ళికూతురి సగటు వయసు 25 సంవత్సరాల 6 నెలలు, పెళ్ళికొడుకు సగటు వయసు 27 సంవత్సరాల 7 నెలలు.

★ ఇటాలియన్ పెళ్ళిళ్ళలో పెళ్ళికొడుకు, పెళ్లికూతురు కలిసి ఓ గ్లాస్‌ని పగల కొడతారు. అది ఎన్ని ముక్కలైతే వారు అన్ని సంవత్సరాలు ఆనందంగా జీవిస్తారని విశ్వాసం!

ళ్లుగానేగా చూశారు? అప్పుడంతా ప్రేమాభిమానాల కంటే స్వార్థానికే ఎక్కువ విలువ? "

"అలా అనకండి నాన్నా!"

"నిజం మాట్లాడుకోవాలిగా వసంత్!"

"సరే జరిగినవేవో జరిగాయి. మేం మన్నించలేనంత మహాపరాధం ఏం చెయ్యలేదు. అన్నింటికీ కాలమే సమాధానం చెప్పాలి! కొంతకాలం సహాయంగా వుండండి! మీరుండే అదే మూడు నెలల కాలం వుండండి! ఆ తరువాత వెళ్లాలా వద్దా? మీరే నిర్ణయించుకోండి!"

"సరే! అలాగే! కానీ అప్పుడు అనాథలుగా మధ్యలో వదిలేసి వెళ్లిపోయారని నువ్వు మా మీద నేరారోపణ చేస్తావే!"

"లేదు నాన్నా! అలా జరగదు. మీరిక్కడే వుండిపోవాలని బలవంతం చేసే హక్కు నాకెప్పుడూ లేదు. మీ అబ్బాయికి సాయం చెయ్యాలని మీకనిపిస్తే చెయ్యండి! అది ఒక రోజా, నెలా, సంవత్సరమా లేక ఎప్పటికీనా? అన్నది మీ ఇష్టం. మీరు సదా మాతోనే వుంటే అది మా అదృష్టం! లేకపోతే మేం చేసుకున్నదింతే అనుకుంటాం!" ఆఖరి మాట అంటున్నప్పుడు

వసంత్ స్వరంలో బాధ..
కల్యాణికి కళ్లలో నీరు!
"మీరా! ఈ రోజు బాబు అడ్మిషన్ చూసుకొద్దాం. రేపటి నుంచీ నీకు రావడానికి వీలు పడదుగా!" అన్నాడు వసంత్.
ఇద్దరూ అరగంటలో రెడీ అయి బయలుదేరి వెళ్లారు.
కల్యాణి భర్త దగ్గరకు వచ్చింది.
"ఇంతకంటే ఎవరూ బతిమలాడలేరండీ! ఇప్పుడు కాదంటే మన మర్యాద పోతుంది!"
"అంతా నాటకం!" కొట్టిపారేశాడు పరశురామయ్య.
"పొరపాటు.. వాడు మనరక్తం! మరీ విరోధిగా ఉండడం మంచిది కాదు. మన కాలికో చేతికో వస్తే చూసుకోవలసింది వాడే! అది కాదనలేంగా? ఎప్పటికీ అదే గర్వం, పట్టుదలతో మనం ఉండకూడదు!"
"ఇప్పుడు నువ్వు అనేదేమిటి? "
"ఇప్పుడిక్కడ మనకీ వాళ్ళకీ కూడా బాధ్యతలున్నాయి, అవసరాలున్నాయి. ఉభయులకూ న్యాయాలున్నాయి, స్వార్థపరత్వం వుంది. కనుక కోపంగా వుంటే మర్యాద పోతుంది! మనం కాదంటే మనుషులను పెట్టుకు పనులు చేసుకుంటారు. డబ్బుకోసం ఎవరైనా వచ్చి చేస్తారు. ఆ తరువాత మనం ఏ మొహం పెట్టుకు ఈ గడప తొక్కుతాం? మన సహాయం కావాలని అడుగుతున్నప్పుడు చేస్తే మన మీద గౌరవం పెరుగుతుంది, కాదంటే ద్వేషంగా మారుతుంది. నేను చెప్పవలసింది చెప్పాను. తరువాత మీ ఇష్టం!"
భార్య మాటకు బదులివ్వలేదాయన.
కల్యాణి పని వుండి లోనికెళ్లింది.
పరశురామయ్య ఒంటరిగా కూర్చున్నాడు. ఒక పక్కన పట్టుదలగా వున్నా ఆలోచిస్తే భార్య చెప్పిందాంట్లో న్యాయం వున్నట్లనిపించింది ఆయనకు. కొడుకు స్థితి జాలిగొలిపింది.

'వాడలా బతిమిలాడుతున్నప్పుడు మీరా మధ్యలో కలుగచేసుకోలేదు. తల వంచుకునే వుంది. నిజమే, మీరా ప్రసవ సమయానికి తామిక్కడుండి ఆమెకి సాయపడని మాట నిజమే! బాధ్యత ఆడపిల్లలను కన్నవారికే కాదు, కొడుకుల్ని కన్నవారికీ వుంటుంది. పదిలో ఆరు తప్పులకు ఆమె బాధ్యురాలయితే, నాలిగింటికి తాము బాధ్యులు. కల్యాణి ఏ టెన్షన్ పడకుండా ఈ సమస్యను సంబాళిస్తున్నది. తనకంత ఓర్పు లేదు. తన భార్య చెప్పింది నిజం, వయసుడిగింది. కోపాల్ని తగ్గించుకోవాలి! దూకుడుగా వుండే వయసుకాదు. వివేకంతో ఆలోచించుకోవాలి. కల్యాణి చెప్పినట్లు ఈ మూడు నెలలు ఇక్కడుండి చూద్దాం! ఆ తరువాత తతిమావారి తీరుతెన్ను, పని బరువు, సులువులు చూసి అప్పుడు నిర్ణయించుకోవచ్చు' అనుకుని ఓ నిర్ణయానికొచ్చాడు.
మీరా, వసంత్‌లు కొడుకు స్కూలు అడ్మిషన్ నిర్ధారించుకొచ్చారు.
కొత్త జాబ్, పెద్ద పదవి అని ఓ అరడజను ఖరీదైన డ్రెస్సులు కొని తెచ్చుకుంది. వాటికి లోదుస్తులు, మాచింగ్ పాదరక్షలు, మేకప్ సామగ్రి.. కొనుక్కుంది మీరా తిరిగొస్తూ. సుమారు ముప్పైవేలైంది ఖర్చు సాయంత్రం ఆరింటికి ఇల్లు చేరారు.
మర్నాడు ఉద్యోగంలో చేరడానికి వెళ్లేందుకు అవసరమైన ఏర్పాట్లలో మీరా, రాత్రి వంటపనుల్లో కల్యాణి నిమగ్నులయ్యారు.
వసంత్ అన్ని విషయాలూ తండ్రితో చెప్పాడు. ఆయన ఎలాంటి ఎదురుప్రశ్నలూ వెయ్యలేదు.
తల్లి వద్దకు వెళ్ళి "అమ్మా! నాన్నగారికి నువ్వు నచ్చచెప్పావా? " అనడిగాడు.
"నేనేం మాట్లాడలేదు. ఆయనే ఆలోచించుకునుంటారు. చూడు బాబూ! మీ నాన్న ఎవరికీ విరోధి కారు. దేన్నీ కాదనరు. మీ నలుగురూ చిన్నపిల్లలుగా వున్నప్పుడే మీరడిగిందేదీ కాదనలేదు ఆయన.

అలాంటిది ఇప్పుడు కాదంటారా? నేను ఎన్నోసార్లు 'అప్పుచేసి మరీ వాళ్ళడిగినవి ఎందుకు కొనిస్తారు? వద్దు' అన్నాను. కానీ ఆయన ఆగలేదు. చూడు నాన్నా! మాకోసం అని ఏమీ దాచిపెట్టుకోలేదు. మీ నలుగురి కోసమే బతుకుతున్నాం. మీరు చదువుకున్నవాళ్లు.. సమాజంలో ఓ అంతస్తుంది. మిమ్మల్ని ఇంతటి ఉన్నత స్థానంలోకి తీసుకొచ్చింది ఆయనేగా? " అందావిడ.

"నాకు తెలీదా అమ్మా? "

"ఆయనను ఎదిరిస్తే, వితండవాదం చేస్తే సహించలేరు. తనను గౌరవించి విలువ ఇవ్వకపోతే మనసు విరిగి పోతుంది. ఒకసారి ఆయన మనసు చేదె క్కితే అది పోవడం కష్టం!"

మీరా ఏదో పని చేస్తూనే అత్తగారు చెప్పినవన్నీ విన్నది.

"ఆయనను ఎవరూ బలవంతపెట్టలేరు. ఆర్డరు వెయ్యలేరు. ఆయనిష్టానికి వది లేస్తే మనం అనుకున్నదానికన్నా ఎక్కువే చేస్తారు. తెలిసిందా? "

"ఆ! తెలిసిందమ్మా"

"నా చేతనైనంత చేసి సహకరిస్తాను. ఆయన వెళ్ళకుండా ఆపడం అనేది మీచే తులలోనే వుంది!"

రాత్రి ఎనిమిది గంటలకు ఓ ఆడమనిషి వచ్చింది. ఇల్లు ఊడ్చి, తుడిచి, అంట్లు తోమి, బట్టలుతకడం- ఇంటి పనులన్నీ చేస్తుంది! నెలకు మూడువేలు జీతం. మీరా ఏర్పాటు చేసింది.

"ఎందుకమ్మా! ఖర్చు? " అంది కల్యాణి.

"ఫరవాలేదత్తయ్యా! మీరీ పనులన్నీ చేసి కష్టపడొద్దు. వంటపనే మీది. అదీ మధ్యాహ్నం, రాత్రి మాత్రమే! పొద్దున నేను చేస్తాను. బాబు స్కూలు నుంచి తిరిగి వచ్చాక చూసుకోవచ్చు! టెలిఫోను బిల్లు, కరెంటు, నీళ్లబిల్లు అన్నీ ఇప్పుడు ఆన్‌లైన్లో చెల్లించవచ్చు. పచారీ సరుకు లన్నీ ఇంటికే వచ్చేస్తాయి. కూరలు, పాలు, పండ్లు ఓ కుర్రాడు ఇంటికే తెచ్చిస్తాడు. మీరు దేనికీ శ్రమపడకుండా ఏర్పాటు చేస్తాను!" అని మీరా చెప్తోంటే కళ్యాణి ఆశ్చర్యపోయింది.

> ## కొత్తగాలి...
>
> **ప్రపంచంలో తానుండే వాడు**
> **మనిషి!**
> **తనలో ప్రపంచాన్నుంచే వాడు**
> **మనీషి!**
>
> - పి.వి. రమణకుమార్,
>
> చిలకలూరిపేట, గుంటూరు జిల్లా

"సంపాదన పెరిగినప్పుడు బాగా ఖర్చు పెట్టడంలో తప్పు లేదు. మీరిద్దరూ మాకు తోడుగా వుంటే చాలత్తయ్యా.. సరేనా? " అంది మీరా.

పరశురామయ్యకూ ఆశ్చర్యం కలిగింది.

ఎనిమిదిన్నరకు మీరా తల్లి, తమ్ముడు, చెల్లెలు వచ్చి అభినందనలు తెలిపారు.

"అన్నింటికీ పనిమనుషులను పెట్టుకో! ఎవరినీ నమ్మకు" అంది మీరా తల్లి.

గబుక్కున మామగారు ఇటు తిరిగారు.

"నిన్ను అసలు నమ్మం. నాకు అత్తయ్య, మామయ్య వున్నారు. వాళ్లు చూసుకుం టారు" అంది మీరా.

కూతురి మాటలు తల్లికి షాకిచ్చాయి.

"భోజనం చేసి వెళ్ళండి వదినగారూ!" అంది కల్యాణి.

"లేదండీ! ఆయన వచ్చేస్తారు. నేను వంట చేసి వచ్చాను" అంది మీరా తల్లి.

"అత్తయ్య నన్నేపనీ చెయ్యనియ్యడం లేదు. నాకిష్టమైనవే వండి పెడుతున్నారు" మురిపెంగా చెప్పింది మీరా.

తల్లి బయలుదేరి వెళ్లింది. గుమ్మం వరకూ మీరా వెళ్లలేదు.

వసంత్ ఆశ్చర్యపోయాడు. ఆ రాత్రి పడుకోబోయేటప్పుడు "మీరా! నీలో చాలా మార్పులొచ్చాయి" అన్నాడు.

సమాధానంగా మీరా నవ్వింది.

ఉదయం నాలుగున్నరకు అలారం పెట్టుకు లేచింది మీరా. స్నానం చేసి, కుక్కర్ పెట్టేసరికి కల్యాణి హడావిడిప డుతూ లేచి వచ్చింది.. "ఇదేమిటమ్మా? ఇంత తెల్లారకట్ట లేచి నువ్వే పనులన్నీ చెయ్యడం ఏమిటి? నేను చెయ్యనూ? "

"వద్దు మీరు పొద్దున ఏడుకంటే ముందు లేవద్దు"

"నేనీ పనంతా సంతోషంగానే చేస్తాను"

"ఉహూ..! వెళ్లి పడుకోండి"

కళ్యాణి ఆశ్చర్యం పరాకాష్టకే చేరింది.

ఎనిమిదిన్నరకి సిద్ధమైంది మీరా.

బాబు స్కూలు ప్రారంభం అవడానికి ఇంకా నెల వుంది. పడుకునే వున్నాడు.

"మీరా! గుడికి వెళ్ళి అట్నుంచి ఆఫీసుకె ళ్లమ్మా!" చెప్పింది కల్యాణి

"సరే అత్తయ్యా!"

"నువ్వూ వెళ్లరా వసంత్.."

"సరేనమ్మా.."

అత్తమామలకు చెప్పి మీరా బయలుదే రింది.

"ఏమండీ! మీరా బాగా మారింది"

భర్త గబుక్కున ఏదైనా అంటాడేమో అనుకుంది. ఏమీ అనలేదు. వెళ్లి స్నానం చేసి వచ్చాడు.

"ఇదిగో! చూడండి, పనులన్నీ చెయ్యడా నికి మనుషులను పెట్టింది. ఇక వంట, పసివాడిని చూసుకోవడం అంతకష్టం ఏం కాదు. ఇక్కడే వుండి చూసుకుందాం" అని కల్యాణి చెప్తుండగా సెల్‌ఫోను మోగింది.

బెంగళూరులో వున్న చిన్నకూతురు ఇందిర భర్త రమేష్ పేరు చూసి "చెప్పండి అల్లుడుగారూ!" అన్నాడు పరశు రామయ్య.

"మామయ్యగారూ! మీ అమ్మాయికి అబార్షనయింది"

"అయ్యో, ఎప్పుడు? "

"నిన్న.. ఆసుపత్రిలో చేర్పించాను. ఈ సాయంత్రం ఇంటికి తీసుకొస్తాను"

"సారీ అల్లుడూ! చాలా బాధగా వుంది"

"ఇప్పుడు వసంత్ ఇంట్లోనేగా వున్నారు!"

"ఆ! అవును!"

"మీరిద్దరూ వెంటనే బయల్దేరండి. టికెట్లు బుక్‌చేసి మొబైల్‌కి పంపుతాను. రాత్రిలోగా ఇక్కడకు వచ్చెయ్యొచ్చు"

"ఒక్క నిముషం అల్లుడూ! మీ అత్త య్యతో మాట్లాడు బాబూ"

"మామయ్యగారూ! నాకు టైము లేది ప్పుడు. మీరొచ్చాక ముఖాముఖీ మాట్లాడు కుందాం. అరగంటలో టికెట్ల గురించి సమాచారం వస్తుంది" అని ఫోను పెట్టే శాడు రమేష్.

"ఏమిటండీ? " అనడిగింది కల్యాణి.

"ఇందిరకు అబార్షన్ అయిందట" అని చెప్పి "వెంటనే రమ్మన్నారు" అన్నాడు.

"ఎలా? ఎలా వీలు పడుతుంది? "

"అదక్కడ తపిస్తుందే!"

"ఏం? దాని అత్తగారు లేదూ అక్కడ? "

"మనం అలా అడగడం బాగుంటుందా కల్యాణీ? "

"వద్దు, అడగద్దు! కానీ మనం ఇప్పుడు వెళ్ళడానికి వీలు పడదే!"

"ఏం? "

"ఏం తెలీనట్లు అలా అడుగుతారే? ఈ రోజే మీరా ఉద్యోగంలో చేరింది. బాబు ఇంట్లో వున్నాడు. వసంత్ ఆఫీసుకెళ్లాలి. బాబుని వదిలి మనం వెళ్ళడానికి వీలు ప డుతుందా? "

"కానీ అల్లుడు తప్పుగా అనుకోడూ? "

"వివరంగా చెప్పండి"

"మాట్లాడే అవకాశం ఇస్తేనా? టికెట్టు బుక్ చేసి పంపిస్తానన్నాడు!"

"కుదరదని చెప్పండి"

"తప్పవుతుంది కల్యాణీ!"



"ఏది తప్పు? మీరా ఏదైనా ఒక మాటంటే తప్పు పట్టి ఏవేవో అంటారుగా! అల్లుడి దగ్గరకొచ్చేసరికి బుట్టలో పాములా తోక ముడుస్తారేం? "

"అక్కడ దానికెవరు చేస్తారే? "

"ఇక్కడ కోడలికీ అంతేగా? వసంత్, ఇందిరలిద్దరినీ తొమ్మిది నెలలు మోశాను, పెంచాను సమానంగా. ఈ పరిస్థితిలో వీ ళ్లని వీళ్ల పాటికి వదిలేసి మనం వెళ్లిపో వడం సరికాదు"

"రమేష్ నిష్టూరంగా మాట్లాడతాడే!"

"మాట్లాడనీయండి, అతనిది అధికార ధోరణి! అన్నీ తనకే తెలుసన్నట్లు, మేధావి నన్నట్లు మాట్లాడతాడు! ఆయనను ఓ హీరోగా అందరూ పొగడాలి, ఆకాశానికి ఎత్తెయ్యాలనుకుంటాడు. అహంకారం ఎక్కువ"

"ఆయన్నెందుకు విమర్శిస్తున్నావు? "

"విమర్శించక? దురహంకారం, గర్వం లాంటి గుణాలన్నీ పోతపోసిన రూపమే మన అల్లుడు రమేష్! అందరిమీదా అధికా రాలు వున్నాయనుకుంటాడు"

పరశురామయ్య మౌనంగా వుండిపోగా "అతని తండ్రి షష్టిపూర్తి బెంగళూరులో జరిగినప్పుడు ఏమైంది? మనందరం కుటుంబాలతో వెళ్తే ఇందిరను తీసుకుని స్టేషనుకు వచ్చారు. హోటలులో గది బుక్ చేస్తే డబ్బులు మీరిచ్చారు. ఫంక్షను పూర్తయి తిరిగెళ్లేప్పుడు కనీసం ఆటో పిల్చి ఎక్కించలేదే? ఎవరికీ ఏ మర్యాదలూ చెయ్యలేదు. మన వసంత్, వేణులు వాళ్లింటి పనివాళ్లలా అన్నీ చేశారు! వాళ్లు మాట్లాడిన మాటలు, చెప్పుకున్న గొప్పలు వినలేకపోయాం! ఇందిరైనా చెప్పాలిగా? ఉహూ, నోరు తెరిస్తేనా? "

"వాళ్లని అనడం చాలుగాని ఇప్పుడేం చేద్దాం? అదిచెప్పు!" అంటుండగా వాట్స ప్‌లో టికెట్ల వివరాలు వచ్చాయి. ఆ వెంటనే ఫోన్ మోగింది.

"మామయ్యా! మీ రైలు రాత్రి పదిగంట లకు బెంగళూరు చేరుతుంది. స్టేషనుకు కారు పంపిస్తాను" అన్నాడు రమేష్.

"అల్లుడూ..!" అని చెప్పబోతుంటే

"రాత్రికి ఇంటికొచ్చాక మాట్లాడు కుందాం!" అని ఫోన్ పెట్టేశాడు రమేష్.

"ఇప్పుడేం చేద్దామే!" కాస్త విసుగ్గా అడి గాడు పరశురామయ్య.

"చెయ్యడానికేం లేదు. వెళ్ళడానికి వీలు పడదు"

"అదేమిటలా అంటావు? టికెట్లు కూడా కొని పంపించాడు కల్యాణీ!"

"మనల్ని అడిగి తీసుకున్నారా? ఇదేం అధికారం? తప్పు కదూ? "

"కల్యాణీ! ఓ హక్కుగా చేసి వుంటాడు అల్లుడు. ఎందుకింత రాద్ధాంతం? "

"హక్కా పాడా? మనకోసం అని బాధ్య తగా ఇంతవరకూ ఏనాడైనా ఏమైనా చేశాడా? ఇప్పుడీ హక్కు ఎక్కడి నుంచి వచ్చిందేమిటి? తతిమా పిల్లల దగ్గర వున్నప్పుడుకన్నా ఇందిర దగ్గరున్నప్పుడు మనకి ఖర్చెక్కువ.

అధికారం చెలాయించడం తప్పితే ఒక్క రూపాయి ఖర్చుపెట్టడు. కానీ మన నాలుగు కుటుంబాల బాధ్యతలూ తనే మోస్తున్నట్లుగా గొప్పలు చెప్పుకుంటాడు. వచ్చీరాని హిందీ కన్నడ భాషలు తప్పులు తడకలుగా మాట్లాడ్తూ తనకన్నీ తెలుస న్నట్లు గొప్పలు చెప్పుకుంటాడు! మీకు మీ అబ్బాయిలేమో ఇష్టం వుండదు! అధికారం చూపించే అల్లుడికి మాత్రం వంగివంగి సలాములు కొడతారు! మధ్యతరగతి కుటుంబాలకిదో శాపం!"

"అయితే ఇప్పుడేం చేద్దాం? "

"ఫోన్ చేసి ఇయ్యండి. అల్లుడితో నేను మాట్లాడతాను" అంది కల్యాణి.

"ఏదైనా సమస్యగా మారితే? "

"అదంతా నేను చూసుకుంటాను"

రమేష్ నంబరుకు డయల్ చేయగానే "చెప్పండి మామయ్యా? " అన్నాడతను.

"మామయ్య కాదు అల్లుడూ, అత్తయ్య" అంది కల్యాణి.

"ఇప్పుడు టైం లేదు. రాత్రికి వచ్చాక మాట్లాడుకుందాం అత్తయ్యా"

"అల్లుడూ, ఒకే మాట.. మేం ఇవ్వాళ రావడానికి వీలు పడదు"

"ఎందుకని? టికెట్లు పంపించానే!"

"మమ్మల్ని ముందుగా ఓ మాట అడి గుండాల్సింది అల్లుడూ!"

"ఎందుకడగాలి? మీ అమ్మాయికి అబా ర్షన్ అయితే మీరు రావాలిసిందేగా! ముందుగా ఎందుకడగాలి? "

"మేం ఇక్కడ నుంచి వచ్చే పరిస్థితులలో లేం అల్లుడూ"

"ఏమిటా పరిస్థితులు? " అడగడంలో దర్పం తాండవమాడుతున్నది.

"మీరాకు ఉద్యోగం దొరికింది. ఈ రోజే జాయినయింది. బాబుని చూసుకోవడానికె వరూ లేరు. వాడిని చూసుకునేందుకు మేం వుండాలి"

"మీరా వాళ్ళ అమ్మని రమ్మనచ్చుగా? "

"ఇందిరను చూసుకునేందుకు మీ అమ్మ గారు రావచ్చునుగా? "

రమేష్‌కు కోపం వచ్చేసింది "మీరేం అంటున్నారు అత్తయ్యా? ఎవరితో ఏం మాట్లాడుతున్నారు? "

"మీతోనే! అందరికీ ఎన్నో సహాయాలు కావాల్సి వస్తాయి అల్లుడుగారూ! ఎప్పుడూ ఒక్కరికే ప్రత్యేకంగా సాయపడలేరు. కోపం తెచ్చుకోకండి. ఇక్కడి పరిస్థితుల్ని అనుసరించి నేనే ఫోన్ చేస్తాను"

"మీకు కొడుకే ఎక్కువా అత్తయ్యా? "

"అందరూ ఎక్కువే! ఇప్పుడు వీడి దగ్గర వుండాల్సిన అవసరం!"

"ఇది ఇందిర విన్నదంటే బాధ పడు తుంది! అసలే గర్భస్రావం అయిందన్న బాధ. దానికితోడు ఇదొక పెద్దషాక్.. 'మీ అమ్మానాన్నలు నిన్ను ముఖ్యం అనుకో వడం లేద'ని చెప్తాను"

"సరే! అల్లుడుగారూ!" అని కల్యాణి ఫోన్ కట్ చేసింది.

"ఏమంటున్నారు అల్లుడు? " అడిగాడు పరశురామయ్య.

కల్యాణి అతనేమన్నాడో చెప్పగా "తప్పు చేశావు కల్యాణీ! అతను మన అల్లుడు. నోటికొచ్చినట్లు అనేశావు"

"అదేం లేదు, అతనే కోపంగా మాట్లా డాడు. పిల్లలందరూ తల్లిదండ్రులకు సమా నమే అన్నాను. ఒప్పుకోలేదు. కోపం తెచ్చు కున్నారు. అందుకు నేనేం చెయ్యను? "

"నీకేమైంది? "

"మీరు మీరాపైన కోపంగా ఉన్నప్పుడు ఇది తోచలేదా? నేనంటే మాత్రం తప్పుగా అనిపించిందా? అల్లుడేం గొప్పవాడు? కోడలేం తక్కువ? మన కుటుంబంలో కొచ్చి మన వంశాభివృద్ధి చేసేది కోడలే! ఓ రకంగా చూస్తే అల్లునికంటే కోడలే ఎక్కువ. అలాని అల్లుడు తక్కువ అనడం లేదు. అడగకుండా టికెట్లు బుక్ చెయ్యడం పొరపాటు అంటున్నానంతే! వచ్చి తీరాలనడం అతి! మనం అతనికింద

> **కొత్తగాలి...**
>
> **మాటలు కానీ**
> **చేతలు కానీ**
> **హద్దులు దాటినప్పుడే**
> **యుద్ధాలు వస్తాయి!**
>
> – బిక్కునూరి రాజేశ్వర్,
> నిర్మల్, ఆదిలాబాద్ జిల్లా

బతుకుతున్నామా? "

"ఇదో పెద్ద ఇష్యూగా మారేట్లుంది. ఇందిర ఏం అంటుందో? ఏం బాధ పడు తుందో? పోనీ, ఒకటి చెయ్యి నేనిక్కడుం టాను నువ్వెళ్ళు!"

"కాదులెండి ఇక్కడ బాబుకు నేను కావాలి. కావాలంటే మీరెళ్ళండి!"

"గర్భస్రావం! ఆడవాళ్ళ విషయం. నేనెళ్ళి ఏం సహాయం చెయ్యగలనే? "

"ఇదిగో చూడండి! అల్లుడిగారి తల్లి, అ క్కయ్య అందరూ అక్కడే వున్నారు. వారె వరికీ ఏ కష్టం కలక్కుండా అల్లుడు అన్నీ మన నెత్తిన రుద్దాలనుకుంటున్నాడు. మంచికి వారిని పిల్చుకుంటాడు, కష్టం వస్తే చాకిరీ చెయ్యడానికి మనం కావాలి. మనం వెళ్ళకుంటే వాళ్ల వాళ్లే వస్తారు!"

"పాపం! అది మనమ్మాయి"

"ఇక్కడా మనబ్బాయే! నేను అన్నీ చెప్పాను!" అనేసి కల్యాణి లోపలికెళ్ళి మనవడి పనులు చేస్తున్నది.

అదే సమయంలో వసంత్ ఫోన్ మోగింది.

ఆఫీసు పనుల ఒత్తిడిలో వున్నా చేసింది రమేష్ కనుక ఫోను ఎత్తాడు వసంత్.

"చెప్పండి బావా!"

"ఇందిరకు అబార్షన్ అయింది"

"సారీ రమేష్! ఇప్పుడు ఇందిర ఎక్క

డుంది? " అడిగాడు వసంత్.

"ఆసుపత్రిలో! మీ అమ్మకీ విషయం చెప్పగానే.." అంటూ రమేష్ కోపంతో రగిలిపోతూ జరిగింది చెప్పి "రైలు టికెట్లు కూడా రిజర్వు చేశాను. వీలుపడదంటే ఏంటి అర్థం? అత్తయ్య ఇలా మాట్లాడడం మునుపెన్నడూ వినలేదు. ఎందుకీ అలక్ష్యం? నువ్వు బెదిరించావా? అందుకే రామంటున్నారా? " అని అన్నాడు.

"ఏం మాట్లాడుతున్నారు బావా? నేనెందుకు అమ్మానాన్నలను బెదిరిస్తాను? "

"అయితే మీరా ఉద్యోగంలో చేరిందని రాలేమంటున్నారేమో? నీలానే ఇందిర వారి కన్నబిడ్డేగా? ఆమె ప్రశాంతంగా, సంతోషంగా వుండాలనుకోవడం లేదా? "

"మేం ఎవరినీ ఆపలేదు. వాళ్ళిక్కడికొచ్చి రెండు రోజులే అయింది"

"నువ్వు వారితో మాట్లాడి ఈరోజే ఇక్కడకు పంపించు"

"సారీ రమేష్! అమ్మ ఆ మాట చెప్పాక నేను వారినెలా బలవంతం చెయ్యగలను? "

"ఏం? తోడపుట్టిన చెల్లెలి మీద ఆ మాత్రం ప్రేమ లేదా వసంత్? "

"అలాని ఎవరన్నారు? ఇక్కడ నా కొడుక్కి ఇబ్బంది కదా? "

"తండ్రివి నువ్వేం చేస్తున్నావు? ఏ గుడ్డి గుర్రానికి పళ్లు తోముతున్నావు? "

"సారీ రమేష్! మొగుడిగా మీరే గుడ్డి గుర్రానికి పళ్లు తోముతున్నారో నేనూ అదే గుర్రానికి పళ్లు తోముతున్నాను"

"ఏం మాట్లాడుతున్నావ్? "

"వద్దు, నేను బదులు చెప్పడం మొదలు పెడితే అన్నీ తప్పుగా వస్తాయి. మన సంబంధాలు పాడు చేసుకోడం నాకిష్టం లేదు. ఇక ఫోన్ పెట్టేయండి!"

వసంత్‌కి మండిపోయింది. 'కుటుంబీకులు, స్నేహితులు అందరూ తన చెప్పుచేతల్లో వుండాలనుకుంటాడు రమేష్. తను దబాయించి మాట్లాడేసరికి తట్టుకోలేకపోయాడు, పాపం!' అనుకున్నాడు.

తన తల్లి అలా మాట్లాడినందుకు వసంత్ ఆశ్చర్యపడలేదు. 'అమ్మకు తెలిసినంతగా న్యాయంధర్మం ఎవరికీ తెలియవు. అల్లుడు, కొడుకు అన్న తేడాలు అమ్మకు లేవు. నాన్నగారు కూతుళ్ళిద్దర్నీ నెత్తినెక్కించుకుంటారు. వాళ్ళని సంతోషపెట్టడానికి అల్లుళ్ళను ఎక్కువగానే పొగుడుతారు. అమ్మ అలా చెయ్యదు!

ఇది ఇంతటితో ఆగదు. ఈ డిక్టేటరు తన అధికారాన్ని అన్నివైపుల నుంచీ ప్రయోగిస్తాడు.

ఇందిరని ఉసిగొలిపి సెంటిమెంటుతో సాధించాలనుకుంటాడు. చేప వలలో పడడానికి ఎరలు వేస్తాడు. ఈ మహానుభావుణ్ణి ఇంద్రుడు చంద్రుడు అని పొగిడి ధూపం వేసి, వింజామరలు విసిరే తోడల్లుడు ఊటీలో వున్న సుజి మొగుడు! ఆయనగారు షడ్డకుడు చెప్పిందే వేదమంటూ ఛత్రం పట్టే అసమర్థుడు.

వీరందరినీ ఈ స్థితికి తెచ్చి చెరిపిందే నాన్న! ఇప్పుడు రమేష్ నాన్నను పట్టుకుని వేధిస్తాడు. వదిలి పెట్టడు.' అనుకుని వసంత్ ఒక పూటకు సెలవు పెట్టి ఇంటికొచ్చేశాడు.

"వసంత్! రమేష్.." అంటూ తండ్రి చెప్పబోతే..

"తెలుసు నాన్నా! నాకు ఫోన్ చేశాడు. అమ్మని నోటికొచ్చినట్లు మాట్లాడాడు!" అన్నాడు వసంత్.

"నాకు బాగా భయంగా వుందిరా!"

"నాన్నా! మీరు వెళ్ళదల్చుకుంటే వెళ్ళండి. మిమ్మల్ని వెళ్ళకుండా ఆపామన్న నింద మాకు రాకూడదు!"

"నువ్వెలా సంబాళించుకోగలవురా వసంత్? అందుకే మేం వెళ్లాలనుకోవడం లేదు! ఇంకపైన చాలా విషయాల మీద నిర్ణయాలు తీసుకోవాలి! అంది కల్యాణి.

"అమ్మా!" అన్నాడు వసంత్.

"అవును బాబూ! అల్లుళ్ల బెదిరింపులు, కోడళ్ల ఎదిరింపులు.. జగడాలు, పోట్లాటలు వీటన్నింటికీ ఓ పరిష్కారం ఆలోచించాలి!" అంది కల్యాణి.

ఆ మాటల్లో తీవ్రత ఉంది.

★ ★ ★

రాత్రి తొమ్మిదింటికి మీరా ఇంటికొచ్చింది.

అలసిపోయిన కోడలితో "మొహం కడుక్కు రామ్మా! భోజనం చేద్దుగాని.. అన్నీ వేడిగా వున్నాయి" అంది కల్యాణి.

మీరా ఫ్రెషప్ అయి వచ్చింది.

"ఏమ్మా, పని ఎక్కువా? "

"అవును అత్తయ్యా! పెద్ద పదవి, ఎక్కువ జీతం ఇస్తున్నవాళ్లు తేలికగా వదులుతారా? " అంది నవ్వుతూ.

"రా! వచ్చి తిను"

"మామయ్యగారికి ఒంట్లో బాగాలేదా? "

"నువ్వు తిను.. నేను చెప్తాను"

ఇంతలో ఫోను మోగింది.

పరశురామయ్య ఫోనెత్తి "చెప్పమ్మా ఇందిరా! ఇంటికి వచ్చేవా? " అన్నాడు.

"ఊ! ఫోన్ అమ్మకియ్యండి"

"ఇంద కల్యాణీ! ఇవ్వాళ నీ పనైనట్లే! నువ్వు చచ్చావు పో!" అంటూ ఫోన్ కల్యాణికి అందించాడాయన.

కల్యాణి ఫోన్ తీసుకుని, స్పీకరు ఆన్ చేసి "ఇందిరా! ఎలా వున్నావమ్మా? " అడిగింది కూతుర్ని.

"ఇలా అడగడానికి నీకు సిగ్గుగా లేదూ? నేను నీ కూతుర్నేనా? కాదా? అబార్షనయి ఆస్పత్రి నుంచి ఇప్పుడే వచ్చాను. మీకోసం ఆయన టికెట్లు కొని పంపితే రానని చెప్పావటగా? ఆయన బాగా కోపంగా ఉన్నారు. కన్నకూతురి కంటే ఉద్యోగానికెళ్లే కోడలు ఎక్కువైపోయిందా నీకు? ఆయన కోపం ఎక్కడిదాకా పోతుందో నీకేమైనా తెలుసా? " అంటూ రుసరుసలాడింది ఇందిర.

## కొత్తగాలి...

**పొంచి ఉన్న**
**నీ శత్రువు**
**మృత్యువు**

– యు. చిట్టిబాబు,
న్యూపాల్వంచ, ఖమ్మం జిల్లా

"నేను మాట్లాడనా ఇందిరా? మాట్లాడనిస్తావా? లేదంటే నువ్వే అరుస్తావా? "

"ఆహా..! మాట్లాడు"

"ఆ ఊళ్ళోనే మీ అత్తవారివైపు వారందరూ ఉన్నారు. వాళ్ళెవరైనా నీకు సాయం చేయొచ్చు! నాగ్గనుక ఈ బాధ్యత లేకపోయుంటే తప్పకుండా వచ్చేదాన్ని. ఇక్కడ మీరాకు సాయంగా ఉండక తప్పనిస్థితి"

"నేను నీ కూతుర్ని"

"మీరా కోడలైనా నా కూతురనే అనుకుంటాను"

"నిన్ను అవమానించి వాళ్లమ్మను ఆకాశానికెత్తింది వదిన. మర్చిపోయావా? "

"మా అల్లుడు.. అదే నీ మొగుడు కూడా అదే చేశాడు. అవసరాలకు మమ్మల్ని వాడుకుని పనైపోయాక తీసి పారెయ్యడం లేదూ? పోయినసారి మేము కృణ్ణించి బయలుదేరే ముందు మీ నాన్నగారికి బాగా జ్వరం. ఆగుదాం అనుకుంటే వాళ్లమ్మ వస్తుందని టికెట్లు తెచ్చిచ్చి మమ్మల్ని గెంటినట్లుగా పంపించెయ్యలేదూ? అప్పుడు నువ్వేం మాట్లాడకుండా చూస్తూ వూరుకోలేదూ? "

మీరా అంతులేని ఆశ్చర్యంతో ఆ మాటలు వింటోంది.

"అల్లుడు మమ్మల్ని అడక్కుండానే టికెట్లు తెచ్చేస్తాడు. తన పని జరగాలంతే.

ఎన్నాళ్లని ఆయనకు తలాడించగలం? సుజీ మొగుడూ ఇదే తీరు! ఇదిగో, ఇందిరా! ఇంకపైన ఈ అల్లుళ్ల అధికారా లేవీ చెల్లవు! అల్లుడు కొడుగ్గా వుంటే విలువ ఇస్తాం. ప్రేమాభిమానాలు కురిపిస్తాం. జులుం చేస్తే మొహాలు కూడా చూడం తెలిసిందా? "

"అమ్మా ఏం అంటున్నావమ్మా? "

"న్యాయమే మాట్లాడుతున్నాను. నువ్వు నీ మొగుడ్ని ఎదిరించద్దు. కానీ నిజం ఏమిటో తెలియచెప్పు. మేమేమైనా నౌకర్లమా? చూడమ్మా! మేం ఎవరింట్లో ఉన్నా వారికి డబ్బులిచ్చే తిండి తింటున్నాం. ఉచితంగా కాదు. చాకిరీ కూడా చేస్తున్నాం. మేం మీ దగ్గర ఉండడం వల్ల మీ నలుగురికీ లాభమే కానీ నష్టం లేదు. ఏమాత్రం లేదు.

మీకోసం మేం ఖర్చు చేసినదంతా దాచుకునుంటే మేడలే కట్టగలిగేవాళ్లం. కానీ, కన్నవాళ్ళకి సకలం సమకూర్చి పరిపూర్ణులుగా తీర్చిదిద్దాం. మీరేమో మమ్మల్ని మీ బానిసలుగా అనుకుంటున్నట్లున్నారు!"

వసంత్ లేచి నిలబడ్డాడు.

మీరా కూడా గాభరాగా లేచింది.

"మీ నాన్నగారికి కోపం కాస్త ఎక్కువే! కాదనను. కానీ ఆ నోరు లేకపోతే మీ ఎనమండుగురు కలిసి ఆయనను మార్కెట్టులో వేలం పాడేవారు! ఆయన నోరు, జేబులో నోట్లే ఇంతవరకూ ఆయనను కాపాడుతున్నాయి"

ఇందిర "అమ్మా!" అంది.

ఈసారి ఆమె స్వరం బేలగా వుంది.

"ఇందిరా! స్పీకరు ఆన్ చెయ్యవే! అల్లుడు వింటాడు" అంది కల్యాణి.

ఇందిరకిదంతా షాకుగా ఉంది.

"చాలమ్మా చాలు.. మనిషికో విధంగా మమ్మల్ని ఆడిస్తూంటే ఎందుకు సహిస్తున్నాం? భయమా? బెదురా? చేతకానితనమా? అవేవీ కావు! ప్రేమ, పాశం కడుపు తీపి! మీ మీద ఇంకా మిగిలున్న మమకారం.. రావడం కుదరదంటే అల్లుడు కోపగించుకుంటాడా?

మా మీది కోపంతో మిమ్మల్ని కాదంటే, వెళ్ళి రోడ్డుమీద నిలబడండి! అందుకు మేం బాధ్యులం కాము. కన్నవారు తప్పులు చేస్తే మొగుడితో మనసు విప్పి చెప్పుకోండి. మొగుడే తప్పు చేస్తే, కన్నవారిని అనకండి. తాకట్టు పెట్టకండి.."

కల్యాణి మాట్లాడ్తూనే వుంది.

ఇందిరకు స్పృహ తప్పుతోంది.

"ఇదిగో, ఇందూ! ఇప్పుడు మేమిక్కడుండడం మా బాధ్యతగా భావిస్తున్నాం. అందుకే ఉన్నాం. ఇక్కడ చాలని అనుకున్న వెంటనే బయలుదేరుతాం"

మీరా మళ్లీ గాభరా పడింది.

"ఇక్కడ పనులన్నీ చెయ్యడానికి పనిమనషులను పెట్టింది మీరా. మాకెలాంటి శ్రమా ఇవ్వలేదు! తనకు నెలకు లక్షన్నర జీతం. వాళ్లకు వంటకో మనిషి, పిల్లాడిని చూసేందుకు బేబీ సిట్టరు దొరుకుతారు. కానీ మీరా మేం కావాలనుకుంటున్న ది" చెప్పింది కళ్యాణి.

"మీరా మమ్మల్ని ఎన్నో మాటలు అన్నది. మేం నోరు మూసుకు భరించలేదు, సమాధానాలు చెప్తూనే ఉన్నాం. తప్పులు రెండు వైపుల నుంచీ వుంటాయి. అన్ని కుటుంబాలలోనూ ఇంతే.. ఇందిరా! గౌరవించలేని కోడళ్లను, గర్వాన్ని చూపించే అల్లుళ్లను ఇహ మీదట భరించే శక్తి మాకు లేదు.

ప్రేమగా ఉంటే ఉంటాం. అలా కాకపోతే మా నిర్ణయం వేరుగా వుంటుంది. తెలిసిందా? అల్లుడితో చెప్పు" ఫోన్ కట్ చేసింది కల్యాణి.

పరశురామయ్యకు మైకం కమ్మినట్లుగా వుంది- 'కల్యాణి ఇలా కూడా మాట్లాడగలదా? ' అనుకున్నాడు.

"వెళ్లి పడుకోండి చాలా పొద్దుపోయింది!"

అంది కల్యాణి.

ఎవరి గదిలోకి వాళ్లు వెళ్లారు.

"అత్తయ్య ఇందిర వదినకు చెప్పినా అది అందరికీ వర్తిస్తుంది!" అంది మీరా.

"అర్థమయిందిగా?" అన్నాడు వసంత్.

"ఇంత విన్నాక నేను పాత మీరాగానే వుంటే నాది మనిషి జన్మే కాదు.."

వసంత్ వెన్ను విరుచుకున్నాడు.

ఓ నెల రోజులు గడిచి పోయాయి. ఆ ఇంట్లో ఏ సమస్యా రాలేదు.

బాబు స్కూలుకు వెళ్తున్నాడు.

ఆ ఆదివారం పరశురామయ్య పుట్టిన రోజు.. శనివారం పిల్లలందరూ వచ్చారు. ఇద్దరబ్బాయిలు, కోడళ్లు, ఇద్దరమ్మాయిలు అల్లుళ్లు, మనుమలు, మనవరాళ్లతో కోలా హలంగా వుంది.

మీరా అన్ని ఏర్పాట్లూ చేసింది. తల్లిదం డ్రులకు ఎన్నో బహుమతులు తెచ్చారు పిల్లలు. పండుగ వాతావరణంతో ఇల్లు కళకళలాడుతోంది.

కల్యాణి, పరశురామయ్యలు శనివారం ఉదయాన బయటికెళ్లి సాయంత్రం ఆరు గంటలకు సంచులతో ఇంటికొచ్చారు.

మర్నాడు వారి పాదాలకు నమస్కరించి పిల్లలు ఆశీస్సులు తీసుకున్నారు.

గర్వీష్టి అల్లుడు అత్తమామలకు నమ స్కరించి నిదానంగా ప్రవర్తించాడు. వేడుక పూర్తయింది. సాయంత్రం నాల్గిం టికి అందరూ బయలుదేరే వేళ..

"మాదగ్గరి కెప్పుడొస్తారు?" అడిగాడు రమేష్ మర్యాదగా.

కల్యాణి పెట్టెలు హాలులో పెట్టింది.

"ఎవరింటికి?" అంది కల్యాణి.

మీరా ముందుకొచ్చి "అత్తయ్యా! మిమ్మ ల్ని నేను వద్దనను, మనుషులను ఏర్పాటు చేసుకుంటాను! మీరిద్దరూ ఎవరికీ కట్టు బడి వుండనవసరం లేదు. స్వతంత్రంగా వుండాలి. ఇది నేను మనస్ఫూర్తిగా అంటున్న మాట" అంది.

భర్తను "చెప్పండి!" అంది కల్యాణి.

"నువ్వే చెప్పు కల్యాణి!" అన్నారాయన.

"ఓల్డేజ్ హోమ్‌లో వుండాలనుకుం టున్నాం. మనిషికి నెలకు పదివేలు. అన్ని వసతులూ, సౌకర్యాలూ వున్నాయి"

"ఓల్డేజ్ హోమ్ ఎందుకు?"

"మొదట ఓ ఇల్లు అద్దెకు తీసుకు వుండాలనుకున్నాం. కానీ అద్దె ఇంట్లో వుండి కుటుంబ బాధ్యతలు వహించే వయసు, ఓపిక లేవు. హోమ్ అన్ని విధా లా అనుకూలంగా వుంది. మంచి భోజనం, సెపరేట్ రూమ్, వైద్యం, వేడు కలు, కాలక్షేపం, సేవాదృక్పథం వున్న వారు- ఇలా మా చుట్టూ బోలెడంతమంది వుంటారు గనుక ఒంటరితనం లేకుండా ప్రశాంతంగా వుంటాం! ఇష్టమైతే ఏమైనా పనులు చేయొచ్చు, ఒంట్లో ఓపిక, ఉత్సాహం వుంటేను!

అనుబంధాలకోసం సర్దుకు బతకలేమను కున్నాం అంతే. అందువల్ల మీ ఎవరిమీదా మాకే విధమైన కోపమూ లేదు!"

"అమ్మా!" అంది ఇందిర.

"అవునమ్మా, మేమికపైన ఎవరిళ్లకూ రాం. మమ్మల్ని చూడడానికి మీరే అక్క డికి రండి! కావాలంటే గెస్టుగా ఓ రోజు వుండచ్చు ఆ ఖర్చు మేం భరిస్తాం!" అందావిడ.

ఎవరూ ఏం మాట్లాడలేదు.

"చెప్పాలంటే ఆత్మాభిమానంతో నిండిన ఓ కొత్త అధ్యాయం మా జీవితాల్లో ప్రారంభం అవుతున్నది. మేమీ నిర్ణయం తీసుకోడానికి మీరెవరూ కారణం కాదు. ఇది జీవితం. ఎవరి ఇష్టాలు వారివి. ఎవరి నిర్ణయాలు వాళ్లే తీసుకోవాలి! ఏమండీ! మనం బయలు దేరుదామా?" అంది కల్యాణి.

"పద కల్యాణీ" అన్నాడు పరశురామయ్య.

ఇద్దరూ పెట్టెలు పట్టుకుని ఇంటి గడప దాటి రోడ్డు మీద నడిచెడుతున్నారు! Ⓒ



# తెలివి తెచ్చిన చేటు

- దూరి వెంకటరావు

సర్వీసులో ఉన్నంతకాలం ఎప్పుడు రిటైరవుతానా? ఎప్పుడు కాస్త స్థిమితంగా జీవనం సాగిస్తానా? అనుకునే వాణ్ణి. తీరా పదవీ విరమణ చేశాక అసలు ఉబుసుపోవడం లేదు. 'ఐడిల్ మ్యాన్స్ బ్రెయిన్ ఈజ్ డెవిల్స్ వర్క్‌షాప్' అన్నారు. ఊరికే కూర్చుంటే వెర్రిమొర్రి ఆలోచనలు వస్తుంటాయి. వాటి నుండి బయటపడాలంటే ఏదో ఒక వ్యాపకం ఉండాలి. నా స్థితి మా శ్రీమతి పసిగట్టేసిందేమో ఈ మధ్య నన్ను ఉత్తినే ఉండనివ్వడం లేదు. మిల్లుకని, పార్కుకని, కిరాణంకని వీధిలోకి పంపుతోంది. మునుపైతే ఇలాంటి పనులన్నీ మా పనిమనిషి చేసేది. ఖాళీగా ఉండటం వల్ల మా ఆవిడ నన్ను చిన్న చూపు చూస్తోందేమోననిపించి ఇబ్బంది పడ్డాను. తర్వాత అనిపించింది పొద్దస్తమాను గోళ్లు గిల్లుకుంటూ కూర్చునేబదులు ఏదోక పని చేయడం మంచిదే కదా అని. ఏం వ్యాపకం పెట్టుకోవాలి? అని ఆలోచిస్తున్న నాకు ఓ పరిష్కారం సూచించినట్లయింది. అందుకే మరి నోరు మెదపకుండా చెప్పినపని చేసుకుపోతున్నాను.

అంతకుముందు కూరల మార్కెట్‌కి తనే వెళ్లేది. రానురాను ఆరోగ్యం సహకరించకపోవడంతో ఆ పనులూ నాకే పురమాయించసాగింది. అంతవరకు బాగానే వుంది. పోతే పట్టుకొచ్చిన సరుకుల దగ్గరే మా ఇద్దరి మధ్య పేచీ వస్తోంది. అదే నాకు తలనొప్పి అయిపోయింది.

'పక్కింటావిడ వంకాయలు కిలో పాతిక రూపాయలకే కొందట! మీరేమో నలభైరూపాయలు పెట్టేసారు. బేరమాడాలని తెలీదా?' అంది.

ఆ మాటకు నా వళ్లు మండిపోయింది. ఆవిడ పుచ్చులో, ముదురువో పట్టుకొచ్చి ఉంటుంది. వస్తువు నాణ్యతను బట్టి ధర ఉంటుందన్న ఇంగితం ఈవిడ గార్కి ఉండొద్దూ?

ఇల్లాలితో గొడవెందుకని దానికో విరుగుడు కనిపెట్టా. ఆ రోజు లగాయతూ ఏ వస్తువు పట్టుకొచ్చినా కొన్న ఖరీదు కంటే తక్కువ చెప్పడం మొదలుపెట్టాను. దాంతో ఆమె మోము వెయ్యి వోల్టుల విద్యుత్ బల్బులా వెలిగిపోయింది.

ఇలా ఉండగా ఓసారి పెద్ద పండక్కి కొత్తచీర కొనుక్కురమ్మంది. తీరా తెచ్చాక ఏం పేచీ పెడుతుందోనని 'నువ్వూ రాకూడదు? నీకు నచ్చింది తీస్కోవచ్చు' అన్నాను యధాలాపంగా.

'అక్కర్లేదు. మీకు నచ్చితే నాకు నచ్చినట్లే' అంది. నా మీద అంత భరోసా ఉంచినందుకు సంతోషిస్తూ పన్నెండు వందల యాభై రూపాయలు పెట్టి కళకళలాడే కళాంజలి చీర కొనుక్కొచ్చాను. ఆమె నైజం తెలుసు కాబట్టి ధరెంతని అడగ్గానే ఆరువందలన్నాను తడుముకోకుండా. తన ఆనందానికి ఎల్లలు లేవు. అంత తక్కువ

## చతుర కతలు

ధరలో అంతమంచి చీర పట్టుకొచ్చినందుకు నన్ను ఆకాశానికి ఎత్తేసింది. సంతోషం పట్టలేక పదిమందికి టాంటాం చేసేసింది.

ఆ మరునాడు..

'మీరు తెచ్చిన చీర చూసి ఇరుగుపొరుగు వాళ్లంతా తెగ మెచ్చుకున్నారండి. చీరల ఎంపికలో వాళ్ల భర్తల కన్నా మీరే నయం అన్నారు. మరండీ..' గోముగా అంటూ నా షర్టుగుండీలు పట్టుకుని లాగుతోంది.

'ఏమిటో చెప్పు' అన్నాను చిరాగ్గా.

'మరేం లేదండీ! నాకు తెచ్చిన చీరలాంటిదే వాళ్లకూ కావాలంట. డబ్బులిచ్చారు. రంగులు వేరైనా ఫరవాలేదు, పట్టుకురండి" అంటూ పక్కలో బాంబు పేల్చింది.

ఒకరా ఇద్దరా! అడిగినవాళ్లందరికీ ఆ రేటుకే చీరలు తేవడం మాటాలా? దీనికెలా గుళిక వేయాలో తెలీక తలపట్టుకుని ఉన్న చోటే చతికిలబడ్డాను. నా అవస్థ ఆ దేవుడికే తెలియాలి. ©

# ఎర

- కె.వి. లక్ష్మణరావు



కాంతారావు పేపర్ చదవడంలో పడితే చాలు నెత్తిమీద పిడుగు పడినా పట్టించుకోడు. అలవాటులో భాగంగా ఆ రోజు కూడా పేపర్ ముందేసుకుని వాలు కుర్చీలో వాలిపోయి చదవడం మొదలుపెట్టాడు. అప్పుడే సెల్ రింగైంది. పట్టించుకోలేదు మళ్లీ కొంతసేపటికి రింగైంది. మళ్లీ పట్టించుకోలేదు అయినా సెల్ పదే పదే రింగవుతోంది. పేపర్లో దూర్చిన తల బైట పెట్టలేక కిచెన్ రూమ్‌లో కాఫీ కలుపుతున్న మిసెస్ కాంతారావుతో.. నా సెల్ రింగవుతోంది. చూడు.. నాకోసం ఎవరడిగినా లేనని చెప్పు.. మా ఆఫీస్ బాస్ సెలవడిగితే నో చెప్పి ఫైల్స్ పట్టుకు రమ్మని మరీ చెప్పాడు. ఆయన అయితే మాత్రం.. సెల్ వదిలి బైటికెళ్లాననీ, ఇంట్లో లేనని తెలివిగా చెప్పు.. అతి తెలివి ప్రదర్శించకంటూ డైరెక్షన్స్ ఇచ్చాడు.

'మీరు మరీ అంతలా చెప్పాలటండీ! చూడండి.. నేనెలా మేనేజ్ చేస్తానో?' అంటూ మిసెస్ కాంతారావు ఫోన్ లిఫ్ట్ చేసి

'హలో' అంది.

అట్నుంచి 'హలో! మిసెస్ కాంతారావేనా మాట్లాడేది?'

'అవునండీ... మీరెవరు?' అడిగింది.

'నేనమ్మా! మీ వారి బాస్‌ని!'

'చెప్పండి!

'కాంతారావు ఇంట్లో లేరా?'

'లేరండీ.. అర్జెంట్ పని వుందంటూ బైటికెళ్లారు. ఆ హడావిడిలో సెల్' మర్చిపోయారు!

'ఎంతసేపట్లో వస్తారమ్మా?'

'చెప్పలేదండీ!'

'సరేనమ్మా! ఫోన్ పెట్టేసేముందు ఒక మాట!'

'చెప్పండి'

'నిన్న ఆఫీస్ స్టాఫ్ అందరికీ రాబోయే సంక్రాంతి కోసమని 5000 + ఫెస్టివల్ అడ్వాన్స్ ఇచ్చామమ్మా. మీ ఆయన నీతో చెప్పారా?'

అంతే ఆ మాట వినగానే మిసెస్ కాంతారావు ఆశ్చర్యపోయింది.

'ఆ! అలాగా సార్! మా ఆయన చెప్పలేదండీ!'

ఫోన్ ఆఫ్ చేయకుండానే.. 'కాంతారావుతో.. చీర కొనమంటే డబ్బుల్లేవని అబద్ధమాడతారా?'. భర్తపై చిన్నగా కన్నెర్ర చేయసాగింది.

ఫోన్ లో బాస్.. 'అమ్మా! మిసెస్ కాంతారావుగారూ! ఫోన్ ఒక్కసారి కాంతారావుకివ్వండి' అన్నాడు.

ఇదిగో ఇస్తున్నానంటూ..

'ముందు ఫోన్‌లో బాస్‌గారితో మాట్లాడండి తరవాత చెబుతాను. మీ పని' అంటూ ఫోన్ కాంతారావుకిచ్చింది.

తేలు కుట్టిన దొంగలా ముడుచుక్కూర్చున్న కాంతారావు.. 'హలో సార్!' అన్నాడు. దీనంగా! 'ఏంటి సార్..! ఫెస్టివల్ అడ్వాన్స్ అంటూ అబద్ధం చెబుతారా..?'

'ఏ.. ఎందుకాడకూడదు..? ఇంట్లో ఉండి కూడా లేనని నీవబద్ధం ఆడచ్చా! ఒక అబద్ధానికి మరో అబద్ధం ఆడితేనే అసలు నిజం బైట పడ్తుందనీ..' చెప్పాడు బాస్.

మిసెస్ కాంతారావు... కాంతారావు వంక గుర్రుగా చూస్తోంది..

ఇప్పుడు ఇంట్లో ఉండడం కన్నా ఆఫీస్‌కు వెళ్లడమే మేలనుకుంటూ ఆఫీస్‌కు బయలుదేరాడు కాంతారావు!






నందుల సుశీలాదేవి

# సరళీస్వరాలు

నిర్వహణ :
వి. రాజారామమోహనరావు

**'సరళీస్వరాలు' నవల రచనాకాలం 1960వ దశకం. ఆడపిల్లల గురించి ఆ కాలంలో చాలా కుటుంబాల్లో ప్రధానంగా రెండు విషయాల మీద ఆలోచన సాగేది. ఒకటి చదువు, రెండు పెళ్లి. ఆడపిల్లకి తొందరగా పెళ్ళి చేసేస్తే బరువు తీరుతుందన్న భావన గట్టిగా వుండేది. సంబంధాలు వెతికి, పెళ్ళిచూపులు ఏర్పాటు చేసి, నిశ్చితార్థాలు చేసుకోవటమే అనేది పెద్దవాళ్ల ధోరణిగా ఉంటే.. జీవిత భాగస్వామిని ఎంచుకోవటంలో తమకి స్వతంత్రం ఉండాలని యువతలో నూతన భావజాలం అభివృద్ధి చెందుతున్న సమయం అది. ఈ సంధి కాలాన్ని ఒడుపుగా పట్టుకుని, నవలను అతి సరళంగా నడిపారు నందుల సుశీలాదేవి.**

సరళీస్వరాలు నవల ఎంతో ప్రాచుర్యం పొందడమేకాక ప్రతి ఒక్కరినీ కుతూహలానికి గురిచేసింది. పెద్దలు కుదిర్చిన పెళ్ళి నుంచి ప్రేమ వివాహాలు ఎన్ని రకాలుగా ఉండే అవకాశముందో చర్చించింది. వివిధ మనస్తత్వాల సంఘర్షణని విపులంగా విశదీకరించింది. 'పెళ్ళి కాకుండా శృంగార భావనలే తప్పు' అన్న అమలిన శృంగారపు కాలంలో యువ హృదయాల ఉద్వేగాన్ని అక్షరబద్ధం చేసిన నవల 'సరళీస్వరాలు'.

నవలా వస్తువుకి, 'సరళీస్వరాలు' అన్న పేరుకి విచిత్ర బంధముంది. సంగీతం నేర్చేటప్పుడు సరళీస్వరాలతోటే ఆరంభిస్తారు. యువతుల స్వతంత్ర జీవనరాగం ఆరంభమయ్యేదీ ప్రేమ భావనలతోటే. ఇవి రెండూ శ్రుతిబద్ధంగా ఉన్నప్పుడే సంగీతమైనా, జీవితమైనా సత్ఫలితాన్నిస్తుంది. అపశ్రుతి నిండిన జీవితం వెతలపాలు, సంగీతం నిష్ఫలం. ప్రతీకాత్మకంగా నవలకి ఈ పేరుపెట్టి న్యాయం చెయ్యటమే కాక నూతన ధ్వనిని, పోకడని సాధించారు రచయిత్రి.

నవలలో అనేక పాత్రలున్నప్పటికీ ప్రధానంగా కథ శారదపరంగా నడుస్తుంది. సుందరమ్మగారికి ముగ్గురు ఆడపిల్లలు. ఆర్థికంగా బాగున్న కుటుంబమే. భర్త పోవడంతో తల్లీ తండ్రీ తానే అయి పిల్లలను పెంచింది. పెద్దమ్మాయికి, రెండో అమ్మాయికి చిన్నవయసులోనే పెళ్లిళ్లు చేసింది. ఆఖరి అమ్మాయి శారద. మారుతున్న కాలం, బంధువుల ప్రోద్బలం, శారద పట్టుదలతో యూనివర్సిటీలో ఎం.ఏ ఫైనల్ కి వచ్చింది. మేనబావ శేఖరం వ్యక్తిత్వం నచ్చక అతనితో పెళ్ళిని నిర్ద్వంద్వంగా వ్యతిరేకించింది. దాంతో 'ఎలాంటి వ్యక్తి కావాలి? ' అని తమ వాళ్ళందరి సమక్షంలో శారదని ప్రశ్నించింది తల్లి.

'నిండు మానవత్వంతో, బలమైన అభిప్రాయాలతో నా వ్యక్తిత్వాన్ని గౌరవిస్తూ, తన వ్యక్తిత్వాన్ని కాపాడుకునే వ్యక్తి పరిచయమైతే తప్ప నేను వివాహమే చేసుకోను. వివాహమొక్కటే నా జీవిత ధ్యేయం కాదు. ఈ సంఘానికి ఎన్నో విధాలుగా ఉపయోగపడొచ్చు' అంది శారద. కూతురి నిర్ణయానికి సరే అనక తప్పలేదు తల్లికి.

అంతటి వ్యక్తిత్వం వున్న శారద ప్రాణస్నేహితురాలు మాధురి. ఆమె మనస్తత్వం పూర్తిగా వేరు. మాధురి రఘుని ప్రేమించింది. ధైర్యం చేసి పెద్దవాళ్ళకి చెప్పలేకపోయింది. దాంతో మాధురి పెళ్ళి వేణుగోపాల్ తో చేశారు పెద్దలు. పెళ్ళయితే జరిగింది కానీ అది మాధురి పట్ల పెద్ద దెబ్బ అయింది. భర్తకి మానసికంగానే కాదు, శారీరకంగానూ చేరువ కాలేకపోయింది. ఓ జడత్వం ఆవహించిందామెను. రోజురోజుకీ

క్షీణించిపోతున్న ఆమెని చూస్తూ బాధపడటం వేణుగోపాల్ వంతైంది.

వేణుగోపాల్ కూడా కాలేజీ రోజుల్లో పద్మజని ప్రేమించాడు. కానీ ఆమె వాసుని ప్రేమించింది. పెద్దవాళ్లను ఎదిరించి వాసుని కులాంతర వివాహం చేసుకుంది. వాళ్ళ సంసారం ఎంతో కాలం సవ్యంగా సాగలేదు. వాసుకి క్షయ వచ్చి ఉద్యోగం మానేశాడు. పద్మజ, వాసు, వేణు క్లాస్ మేట్స్. వేణు సాయం అందించబోతే, ఆత్మాభిమానంతో వద్దన్నారు. వేణుని నిరాశ కమ్ముకుంది. వాసు, పద్మజలకి ఓ కూతురు, రాధ.

ఆ తర్వాత వేణుకి యూనివర్సిటీలో వాసవి పరిచయమైంది. ఆమె కూడా అతని ప్రేమని తెలుసుకోకుండా వేరే పెళ్ళి చేసుకుంది. అలా వేణు ప్రేమ ఫలించలేదు. అప్పుడే మాధురి సంబంధం కుదిర్చారు పెద్దలు. ఆ అనుభవాలన్నీ మరిచిపోయి, మాధురిని మనస్ఫూర్తిగా ఇష్టపడే పెళ్లి చేసుకున్నాడు. కానీ వారి దాంపత్యం అపశ్రుతుల పాలైంది.




పరిస్థితులు సరిగాలేకపోవటం వల్ల కూతురు రాధని తప్పనిసరై స్నేహితురాలి ఇంటికి పంపేసింది పద్మజ. తమ కొడుకు పరిస్థితికి కారణం తనేనని దూషిస్తారని తెలిసీ మెరుగైన వైద్యం కోసం అత్తమామలకి వాసు పరిస్థితి తెలియజేసింది పద్మజ. వాసుని శానిటోరియంలో చేర్పించారు. ప్రేమించి చేసుకున్న వివాహాలు, పెద్దలు కుదిర్చిన పెళ్ళిళ్లు.. ఏవైనా అపశ్రుతులకి అతీతం కాదన్నట్టు కథ నడిపారు రచయిత్రి సుశీలాదేవి.

ఓసారి కాకినాడ వెళ్లిన మాధురి, తన ప్రియుడు రఘురాం ఇంటికి వెళ్లింది. స్ఫురద్రూపి అయిన అతను తాగుడు వల్ల పుల్లలా అయిపోయాడు. మాధురికి చెప్పలేనంత బాధ కలిగింది. 'నన్ను ఎక్కడికైనా తీసుకుని వెళ్లిపో రఘూ! నీ ఆరోగ్యం బాగుపడేలా చేసుకుంటాను. నేను ఇంక ఈ నరకాన్ని భరించలేను' అంది అతనితో.

'ఒకనాడు ఈ మాట నేను నీతో అన్నాను. అపుడు నువ్వు సాహసించలేకపోయావు. ఇప్పుడు ఇరువంశాల ప్రతిష్ట నీ మీద ఆధారపడి వుంది' అన్నాడు రఘురాం. ఆ మాటలతో మాధురిలో సర్వశక్తులూ ఉడిగిపోయాయి. విషాదంతో నిండిన వీడ్కోలు అయింది ఆ సమావేశం వారికి.

శారద మరో స్నేహితురాలు విజయ. విశ్వాన్ని ప్రేమించింది. చదువు మానొద్దని శారద ఎంతగా చెప్పినా వినలేదు. రెండు నెలల్లో ఎమ్మెస్సీ ఫైనల్ పరీక్షలున్నా లెక్కచెయ్యకుండా విజయ విశ్వాన్ని పెళ్ళి చేసుకుని కర్నూలులో కాపురం పెట్టింది. ఓసారి రైల్లో కలిసిన శారదతో తను చదువు ఆపెయ్యటం తొందరపాటు పనేనని అంటుంది విజయ. భర్త ఒక్కడి రెక్కల కష్టం, చాలీచాలనీ డబ్బు, ఇంటి ఇబ్బందులు.. 'ఏమిటో శారదా! పెళ్ళీ ప్రేమా.. ఈ పదాల వ్యామోహమేకాక వాస్తవ జీవితంలో ఎన్నో బరువు బాధ్యతలుంటాయి' అంది విజయ. తన పిల్లల్ని ప్రాణంకన్నా మిన్నగా చూసుకుంటోన్న విజయను చూసి.. 'ప్రపంచంలో ఇలాంటి మాతృమూర్తులే వైవాహిక జీవితంపై లోభాన్ని, మోహాన్ని కలగచేస్తారు' అనుకుంది శారద.

తన అనుభవాలు ఎన్ని విభిన్న భావాలు కలగచేసినా శారద నిర్ణయంలో మాత్రం మార్పు లేకపోటమే ఈ నవలలో ప్రత్యేకత!

వైద్యం చేయించినప్పటికీ వాసు చనిపోయాడు. వాసు తల్లితండ్రులు పద్మజని వదిలేసి వెళ్ళిపోయారు. భర్త కోరికమేరకు ఆత్మహత్య చేసుకోకుండా జీవచ్ఛవంలా మిగిలిపోయింది పద్మజ. ఆమె కోరిక ప్రకారం రాధ బాధ్యతని వేణుగోపాల్ తీసుకుంటాడు. రఘురాం క్యాన్సర్‌తో మరణించాడు. అది తెలిసిన మాధురి మరింత క్షీణించి చనిపోయింది.

చదువు పూర్తి చేసి లెక్చరర్ అయింది శారద. శారద అక్క కూతురు రమణకి పెళ్ళి నిశ్చయమైంది. 'పదహారేళ్ళ రమణకి అప్పుడే పెళ్లా?' అనిపించింది శారదకి. శారద పనిచేస్తున్న కాలేజీలోనే మార్గరెట్ పనిచేస్తోంది. ఇద్దరూ మంచి స్నేహితులు. ఆమె అన్న జోసెఫ్. అతనికి శారద అంటే ఆరాధన. ఆ విషయం తెలియచేశాడు కూడా. రమణ పెళ్ళికి అమలాపురం వెడుతూ, ఆఖరి లాంచీ తప్పిపోడం వల్ల, ఆ రాత్రికి మాధురి ఇంటికి వెళ్లింది శారద. అప్పుడు తెలిసింది మాధురి మరణవార్త. మాధురి, రఘురాంల మరణం, వాళ్ళిద్దర్నీ కలపాలనుకున్న తన ప్రయత్నం చెప్పాడు వేణుగోపాల్. అతని ప్రవ

# రచయిత్రులకు నాడు స్వర్ణయుగం!



'సరళీస్వరాలు' నవల 1968-69లలో ఆంధ్ర ప్రభలో ధారావాహికంగా వచ్చింది. అంతకు ముందు కొన్ని రచనలు ప్రచురించినా 'సరళీస్వరాల'కు లభించిన ఆదరణ అపూర్వం. నవల ప్రచురించినంతకాలం- మరుసటి వారం పత్రిక కోసం ఎదురు చూసేదాన్ని. అచ్చులో నా పేరు చూసుకోవాలని కాదు, నా రచనకు బాపుగారు ఏం బొమ్మ గీశారోనని! 1991 ప్రాంతాల్లో రచయిత్రుల సమ్మేళనం వరంగల్‌లో జరిగింది. ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ, రామలక్ష్మి ఆరుద్ర, వాసిరెడ్డి సీతాదేవి వంటి హేమాహేమీల సమావేశమది. అక్కడ రామలక్ష్మి నన్ను చూసి 'స్టార్ రైటర్‌వి అన్నమాట!' అన్నారు. అప్పట్లో ప్రజలు రచయితలను సినీస్టార్లలా అభిమానించేవారు. అదో చక్కటి జ్ఞాపకం!

ఈ నవలలో ఓ సందర్భంలో కథానాయిక 'మీ క్లాస్‌మేట్ కూతురు పుట్టినరోజుకి పిలిచాడు! సహాధ్యాయులందరికీ ఓపిగ్గా పరిచయం చేసేడు. భార్య వంటింట్లోనే ఉండిపోయింది. చదువున్న ఆడవాళ్లంటే పబ్లిక్ ప్రాపర్టీలన్నట్లుగా ఉంది' అని అంటుంది. 'చదువుకున్న అమ్మాయిలంటే అబ్బాయిలకు తేలిక భావం. అదే పురుష మెంటాలిటీ - ఇట్లు కొంతమంది అమ్మాయిలు, ఆంధ్రా యూనివర్శిటీ-' అని పత్రిక కార్యాలయానికి ఓ లేఖ వచ్చింది. మరుసటి వారం 'ఆడవాళ్లంతా సంకుచిత మనస్తత్వం గలవారు లేరు - ఇట్లు అబ్బాయిలు, ఆంధ్రాయూనివర్శిటీ' అని మరో లేఖ వచ్చింది. యూనివర్శిటీలో పోస్టర్లు అంటించి గొడవ చేసినప్పటికీ పబ్లిక్ పరీక్షలప్పుడు అంతా చల్లబడిపోయింది. ఎమెస్కో వారు 'ఇంటింటి గ్రంథాలయం' స్కీమ్ కింద నా నవలను ప్రచురించారు. డీలక్స్ పబ్లికేషన్స్ వారు రెండో ముద్రణగా వేశారు. ఏమైనా నా ఈ 'సరళీస్వరాలు' నవల పట్ల నాకు ప్రత్యేకమైన అభిమానం.

**– నందుల సుశీలాదేవి,** కాకినాడ

ర్తన, ఔదార్యం శారదని కదిలించాయి. రాధను పెంచుతున్న తీరుకు ముచ్చటేసింది. అసంకల్పితంగానే జోసెఫ్‌ని, వేణుగోపాల్‌ని పోల్చి చూసుకుంది శారద. ఇద్దరిలో వేణుగోపాల్ వ్యక్తిత్వం నచ్చిందామెకు.

తన వ్యక్తిత్వాన్ని గౌరవిస్తూ, నిండైన మానవత్వం, పరిపూర్ణ వ్యక్తిత్వం ఉన్న యువకుని కోసమే తన తపన.. వ్యక్తిగా తనని ప్రేమించి, మానవతావాదం, ఉదాత్త భావాలు కలిగిఉన్న యువతికోసం వేణుగోపాల్ ఆరాటం.. తామిద్దరి అన్వేషణలు ఒక్కటే అని అనుకోగానే శారద మనసు ఉద్విగ్నమైంది.

తన వివాహం గురించి తల్లి ఏమీ అనలేక మౌనంగానే బాధపడుతోందని, కన్యగానే మిగిలితే అవసరమైన ఆర్థిక భద్రత ఏర్పరుస్తోందని తెలిసి, ఆత్మపరిశీలన చేసుకుంది శారద. తనకి ఇరవైఆరో ఏడు నడుస్తున్నది. తను జీవితాంతం ఒంటరిగానే ఉండిపోతుందన్న దిగులుతో వుంది తల్లి. 'అవివాహితగా ఉండి తను సాధించింది ఏముంది? ఇంక దారి మార్చాలి' అనుకుంది.

శారదకు జోసెఫ్, వేణుగోపాల్ పట్ల సద్భావం వుంది. ఓ రోజు జోసెఫ్‌ని అతని ఆఫీసులో కలిసింది. తనకింద వారిని కించపరిచే అతని అమానుషత్వ ప్రవర్తన శారద నిర్ణయాన్ని తల్లకిందులు చేసింది. స్వార్థరహితంగా తన కర్తవ్యం నిర్వహిస్తున్న వేణుగోపాల్ ఔన్నత్యం తెలిసివచ్చింది. జోసెఫ్‌ని నిర్ద్వంద్వంగా నిరాకరించింది శారద.

వేణుగోపాల్ బాధాతప్త హృదయానికి ఓదార్పు అయింది శారద. అతనికి తన ఆహ్వానాన్ని తెలియచేసింది. వేణూ తన అదృష్టానికి పొంగిపోయాడు. ఇద్దరిలోనూ చేరువ ఏర్పడింది. పెళ్ళి చేసుకోవాలన్న నిర్ణయం జరిగిపోయింది.

నవలను పేరుకి తగినట్టు భావస్ఫోరకంగా తీర్చిదిద్దటం అరుదు. సంగీతం నేర్చుకునే వాళ్ళందరికీ ఆరంభం అక్కడే. కానీ కొందరే కృతకృత్యులవుతారు. ఇంచుమించు అనురాగ జీవితమూ అంతే. అందరికీ కోరికలుంటాయి. సవ్యంగా తీరేది కొందరికే. జీవితమైనా, సంగీతమైనా సరైన దృష్టి వుండాలి. సాధన వుండాలి. ఈనాటి స్త్రీ స్వతంత్ర భావజాలానికి, యాభైఏళ్ళ క్రితమే పునాది వేసిన 'సరళీస్వరాలు' ఆడపిల్లల అభిప్రాయాలకి అద్దం లాంటిది! ©

# చతుర ప్ర.జ.

పాఠకుల ప్రశ్నలకు
ఉపన్యాసశిరోమణి, అభినవ వ్యాస
డా. కె. రామానుజాచార్య
సమాధానాలు



**ప్ర. స్వర్గస్థులైన తల్లిదండ్రుల పేరిట ఆలయాల్లో అర్చనలు, అభిషేకాలు, పూజలు చేయించవచ్చా? వారి ఫొటోలను దేవుళ్లతోపాటు పూజామందిరంలో ఉంచవచ్చా?**

– తటవర్తి రామకృష్ణ,
తాళ్లగడ్డ, హైదరాబాద్

**జ.** తల్లిదండ్రుల ఉత్తమగతుల కోసం, వారి అనుగ్రహం కోసం వారి పేరిట ఆలయాలలో పూజలు చేయించవచ్చు. దేవాలయాలలో వారి పేర పూజల కంటే, వారి పేరుతో పేదలకు, దీనులకు, అనాథలకు అన్నదానం, వస్త్రదానం, విద్యాదానం చేయిస్తే పితరులు చాలా సంతోషిస్తారు. బ్రాహ్మణులకు, గురువులకు పూజలు.. దానాలు ఇంకా ఫలితం ఇస్తాయి. శ్రాద్ధ ప్రక్రియలో ఆంతర్యం ఇదే. అది సంవత్సరానికి ఒక సారే చేస్తారు. కానీ మన ఇంట్లో ఏ ఉత్సవం జరిగినా, ఏ పర్వదినం కానీ పండుగలలో కానీ అందరూ సంతోషంగా ఉన్నప్పుడు మొదట కృతజ్ఞతలు చెప్పుకోవలసింది తల్లిదండ్రులకే కదా! మనకి శరీరాన్ని వారే కదా ఇచ్చింది. శరీరమే లేకుంటే ఈ సంబరాలు, సంతోషాలు, ఉత్సవాలు ఎలా వస్తాయి? అందుకే తల్లిదండ్రుల పేర ఎన్ని దానాలు ధర్మాలు చేసినా తక్కువే! వారి ఫొటోలు పూజామందిరంలో నిరభ్యంతరంగా పెట్టుకోవచ్చు. ఇంత మంచి ఆలోచన వచ్చినందుకు, తల్లిదండ్రులపై మీ పవిత్ర భావానికి అభినందనలు.. ఆశీస్సులు!

**ప్ర. కులదైవం ఎవరో తెలియని కుటుంబాల వారు తెలుసుకోవడం ఎలా? లేకపోతే అనర్థాలు జరుగుతాయట! పరిష్కారం ఏమిటి?**

– బి. చల్లమ్మ, చెన్నై

**జ.** కులదైవం తెలియనివారు వారి పెద్దలను అడిగి తెలుసుకొని ఆరాధించండి. పెద్దలకూ తెలియకపోతే ఇంటి పురోహితుని అడగండి. ఇంటిలో అన్ని కార్యక్రమాలను వారే చేయిస్తారు కాబట్టి వారికి తెలిసి ఉంటుంది. ఒకవేళ వారు లభించకుంటే, వారికీ తెలియకుంటే ఏడుకొండల వేంకటేశ్వరుడు కలియుగానికే దైవం. ఆ దైవాన్ని ఆరాధిస్తే ఏ సమస్య ఉండదు. మీరు ఏ దైవాన్ని బాగా నమ్ముతారో, బాగా ప్రేమిస్తారో ఆ దైవాన్నే పూజించండి. అదే చక్కని పరిష్కారం.

**ప్ర. మానవాళి ప్రవర్తనపై ఆయా యుగాల ప్రభావం ఉంటుందా?**

– డా.సి. జనార్దనసింగ్,
నల్లకుంట, హైదరాబాద్

**జ.** యుగం అంటే కాలమే! కాల ప్రభావం మనుషులపై, మృగాలపై, సకల ప్రాణులపై ఉంటుంది. యుగాల దాకా ఎందుకు? సమయ ప్రభావం మీరు చూడటం లేదా? ఉదయం లేవగానే ప్రసన్నంగా, మధ్యాహ్నం కొంచెం అప్రసన్నంగా ఉంటాం. రాత్రిపూట ఉద్వేగం, ఉద్రేకం కలుగుతుంటాయి. వర్షం పడితే, చలిగా ఉంటే మబ్బుగా.. సుస్తీగా ఉంటాం. ఎండ, వెలుతురూ ఉంటే ఉత్సాహంగా, ఉల్లాసంగా ఉంటాం. ప్రకృతి నుండి మహత్తత్త్వం, మహత్ తత్త్వం నుండి అహంకారం, అహంకారం నుండి మనసు పుట్టింది. మనసు పుట్టినదే ప్రకృతి నుండి కదా! ప్రకృతి కాలాధీనం కదా! అందుకే ప్రకృతిలోని, కాలంలోని ప్రభావం మానవాళి ప్రవర్తనపై ఉంటుంది. కృతయుగం సత్త్వగుణ ప్రధానం, త్రేతాయుగం సత్త్వ, రజోగుణ ప్రధానం, ద్వాపరం రజోగుణం, కలియుగం తమో, రజోగుణ ప్రధానం. ప్రకృతి గుణాలు కాలంపై ప్రసరిస్తాయి. ఆ కాలంలో పుట్టిన వారి మనస్తత్త్వం,




# చతుర ప్ర.జ.7



ఆచార వ్యవహారాలు.. పురాణాలు, ఇతిహాసాలు.. శ్రుతులు.. స్మృతుల పరంగా కలిగే మీ సందేహాలను క్లుప్తంగా రాసి పంపండి. మీ పేరు, చిరునామా, ఫోన్ నంబరు కూడా ప్రశ్నతో రాసి పంపండి. ఉపన్యాసశిరోమణి, అభినవవ్యాస **డా. కె. రామానుజాచార్య** ఈ ప్రశ్నలకు సమాధానాలు ఇస్తారు. ప్రతి ప్రశ్నకు ఈ కూపన్ తప్పనిసరిగా జతపరచాలి. కూపన్ జతపరచని ప్రశ్నలు పరిగణనలోకి తీసుకోబోమని గ్రహించ మనవి.

చిరునామా : **చతుర ప్ర.జ.** చతుర, ఈనాడు కాంపౌండ్,
సోమాజిగూడ, హైదరాబాద్ - 082

ఆయా గుణాలకు అనుగుణంగా ఉంటుంది. కోరికలు, కోపాలు, స్వార్థాలు, పరోపకారం, పరనింద.. ఇవన్నీ రజస్తమో గుణాల ప్రభావం. ధర్మం అధర్మంగా, అధర్మం ధర్మంగా విపరీత జ్ఞానం.. న్యాయం అన్యాయంగా, అన్యాయం న్యాయంగా విపర్యయ జ్ఞానం కూడా కాల ప్రభావమే! మనం నిమిత్తమాత్రులమే!

*ప్ర. మన పుణ్యం కోసం నోరులేని గోమాతను నిత్యం గంటలు గంటలు నిలబెట్టి, పసుపు కుంకమలు పూసి, హారతులిచ్చి నిర్బంధించి పూజించడం ఎంతవరకు సమర్థనీయం?*

*– వి. శ్రీలక్ష్మి, నల్లకుంట, హైదరాబాద్*

జ. గోమాతను నిర్బంధించి పూజించమని ఏ శాస్త్రాలు చెప్పలేదు. నిర్బంధించి చేసినది పూజ కాదు. దాని వలన పుణ్యం రాదు. ఇప్పటి కాలంలో గోపూజను, దైవపూజను కూడా వ్యాపార దృష్టితో చూస్తు మరింత సందేహాన్ని కలిగిస్తున్నారు. గోవు నిలబడి ఉంటే నిలబడినంతలోనే పూజచేయాలి.. పడుకుని ఉంటే పడుకొన్నపుడే చేయాలి. 'స్థితః స్థితాం ఉచ్చలితః చలన్తీం...' నిలబడితే నిలబడి, నడుస్తుంటే తాను నడుస్తూనే పూజించాలి. గోవులకు అనుకూలమైన స్థితిలోనే ఆరాధించాలి. మన పూజ కోసం గోవును లెమ్మనడం, ఏ శాస్త్రమూ చూపలేదు. 'తిష్ఠంతీం స్వపన్తీంచ చరన్తీంచ తథా! గాం పూజయేత్ ధర్మిష్ఠః' అని స్కాందపురాణ వాక్యం. అందుకే గోవుకు అనుకూలమైన స్థితిలోనే పూజించాలి. అందరి గోత్ర నామాలు చెప్పి, పూజారి పూజ చేసిన తరువాత, అందరు తాకి నమష్కరిస్తే సరిపోతుంది. కావాలంటే పసుపు కుంకుమ వేయవచ్చు.

*ప్ర. దేవి త్రిమూర్తులను పుష్పక విమానంలో అన్ని భువనాలు తిప్పి, ప్రతి భువనంలో సరిగ్గా అదే రూపంలో ఉన్న త్రిమూర్తులను చూపినట్లు దేవీభాగవతంలో ఉందని విన్నాను! ఏమిటిది వివరించగలరు?*

*– సంతోష్‌కుమార్,*

జ. పురాణాలు మూడు విధాలుగా ఉంటాయి. సత్త్వగుణం ప్రధానంగా ఉన్న పురాణాలు ఆరు. రజోగుణ ప్రధానంగా ఉన్న పురాణాలు ఆరు. తమోగుణ ప్రధానంగా ఉన్న పురాణాలు ఆరు. ఇవిగాక కొన్ని ఉపపురాణాలున్నాయి. సత్త్వగుణ ప్రధానమైన పురాణాలలో శ్రీమన్నారాయణ ప్రాధాన్యాన్ని చెబుతారు. రజోగుణం ప్రధానంగా గల పురాణాలలో బ్రహ్మ, శంకర ప్రాధాన్యాన్ని చెపుతారు. తమోగుణ ప్రధానమైన పురాణాలలో శివశక్తి ప్రాధాన్యాన్ని చెపుతారు. ఉపపురాణాలు శక్తిని ప్రతిపాదిస్తాయి. శక్తి తత్త్వాన్ని చేప్పే దేవీభాగవతం ఉపపురాణాల కోవలోనికే చేరుతుంది. ఇందులో కొందరు దేవీభాగవతమే అసలు భాగవతం, శ్రీమద్భాగవతం అప్రధానం, ఉపపురాణం అనేవారూ లేకపోలేదు. ఇక్కడ ఆ వివాదం, ఆ చర్చ అప్రస్తుతం. ఒకరికి ప్రాధాన్యం ప్రతిపాదించనపుడు తక్కినవారు అప్రధానులే అవుతారు. దేవి ప్రధానమై, త్రిమూర్తులు ఆమె అంశ అనేవారు చాలామంది ఉంటారనేది ఇక్కడ ప్రస్తుతం. సృష్టిలో అనంతకోటి బ్రహ్మాండాలున్నాయి. బ్రహ్మాండాలంటే అనంతకోటి బ్రహ్మలు, అనంతకోటి రుద్రులు, అనంతకోటి ఇంద్రులు ఉంటారు కదా! విష్ణు ప్రాధాన్యంలో అతను మాత్రం ఒక్కడే. అట్లే శివ ప్రాధాన్యంలో అతను ఒక్కడే. తక్కినవారు అనంతకోట్లు. శక్తి ప్రాధా

## రూ.116/- బహుమతి పొందిన ఉత్తమ ప్రశ్న

ప్ర. వందేళ్లకు పైగా జీవిస్తున్నవారు భయంకర వ్యాధులతో సతమతమవుతున్నారు. అలాంటివారికి మరణాన్ని ఇవ్వకుండా, చిన్నారులకు, అప్పుడే పుట్టిన శిశువులకు మరణాన్ని ఇవ్వడంలో భగవంతుని ఆంతర్యమేమిటి?

– నల్లపాటి సురేంద్ర,
పెద్దగంట్యాడ, విశాఖపట్నం

జ. మరణాన్ని, జన్మను భగవంతుడు ఈయడు. అంటే తనకు తానుగా స్వతంత్రంగా, స్వేచ్ఛగా ఈయడు. అలా ఇవ్వగలిగితే అందరినీ అమరులుగానో, జన్మలేని వారిగానో ఎందుకు చేయడం లేదు? భగవానుడు కూడా మనం చేసిన కర్మకు అధీనుడే. మనం చేసిన కర్మకు అనుగుణంగా ఆయా జాతులలో, లింగాలలో.. అంటే స్త్రీ పురుషులుగా, సుఖ దుఃఖ, జ్ఞాన అజ్ఞాన, శాంత క్రోధ, దాత, లోభి, ఇత్యాది భేదాలతో పుట్టాలని.. అలాంటి పుట్టుకే ఇస్తాడు. అనుభవించాల్సిన కర్మశేషాన్ని అనుసరించి ఆయుష్షు ఉంటుంది. వారు దుఃఖాన్ని, బాధలను నూరు సంవత్సరాలు అనుభవించేటంత ఉంటే నూరేండ్లు బాధలతో బతుకుతారు. కొందరికి గర్భంలో పడటంతో కర్మ అయిపోతే గర్భస్రావం జరుగుతుంది. దాంతో ఇద్దరికీ కర్మానుభవం, తల్లికి తండ్రికి పుత్రశోకం, శిశువుకు గర్భవాస దుఃఖం. ఇలా ప్రతిదానిలో చాలా ఆంతర్యం ఉంటుంది. కొందరు పుట్టగానే పోతారు. వారికి జన్మ దుఃఖంతో ఆ పాపం అయిపోతుంది. ఇలా తాను చేసిన పాప పుణ్య కర్మల అనుభవానికి ఎంత సమయం కావాలో అంత సేపుంటారు. అది తీరగానే పోతారు. భగవంతుడు సాక్షి మాత్రమే.

---

న్యంలో అమ్మ ఒక్కరే. తక్కినవారు మాత్రం అనంతకోట్లు. ఈ రహస్యాన్ని తెలిపేదే ఆ కథ! తత్త్వజ్ఞానం కలిగినపుడు అసలు తత్త్వం బోధపడుతుంది. అపుడు ఈ కథలు భేదాలు, వాదాలు తొలగి వాస్తవాన్ని గ్రహించగలుగుతారు.

ప్ర. ఎనిమిదో నెల దాటిందంటే చాలు శుభ ముహూర్తం చూసుకొని ఆపరేషన్ చేయించుకునే ముహూర్తపు కానుపుల్లో మంచిచెడ్డలను వివరించగలరు?

– వెల్మల భాగ్యలక్ష్మి,
పూడూరు, కరీంనగర్ జిల్లా

జ. 'ముహూర్తం చూసుకొని, ఆపరేషన్ చేయించుకొని..' అని మీరే అన్నారు కదా! ఆ ముహూర్త నిర్ణయమే వాని కర్మను అనుసరించి జరుగుతుంది. మీరు పెట్టుకొన్న ముహూర్తం పుట్టబోయే వాని కర్మకు సరిపోతే సరి! సరిపోకపోతే ఆ ముహూర్తంలో ఆపరేషన్ జరగదు. ఆపరేషన్ సమయంలో కరెంటు పోవటమో, ఆపరేషన్ చేసే డాక్టర్‌కు అస్వస్థతో, జనరేటర్ పనిచేయకపోవటమో, ఆక్సిజన్ అందుబాటులో లేకపోవటమో, అమ్మాయి ఆరోగ్యం ఆపరేషన్‌కు అనుకూలంగా లేకపోవటమో.. ఇలా బోలెడు కారణాలు అడ్డు వస్తాయి. ముహూర్తం పెట్టేవారి బుద్ధిలో భగవానుడు ప్రవేశించి వాని కర్మానుగుణమైన సమయాన్నే నిర్ణయిస్తారు. నిర్ణయం 'మనం చేస్తున్నాం' అనుకుంటాం! మనలో చేరి నిర్ణయింపచేసేది ఆ భగవానుడే! ఒక్క ముహూర్తమే కాదు, ప్రతివిషయం భగవత్సంకల్పంతోనే జరుగుతుంది.

ప్ర. ఆత్మకు చావు, పుటకలు లేవు కదా! మరణించినవారు కలలో ఎందుకు కనిపిస్తారు? మరణించక ముందు సత్కార్యాలు చేసినవారి ఆత్మలు ఆపదలో ఉన్న తమవారికి సహాయపడతాయా?

– నండూరి లీలాప్రసూనాదేవి,
సికింద్రాబాద్

జ. ఆత్మకు చావు పుటకలు లేవు అంటూనే మరణించినవారు అంటున్నారు. మరణించినవి ఆత్మలా? కలలో కనిపించినవి ఆత్మలా? ఆత్మకు చావు పుట్టుకలే కాదు, ఆకారం కూడా లేదు. కర్మానుగుణంగా వచ్చిన శరీరాన్ని ధరించి కర్మ ఫలాన్ని అనుభవించి, ఫలం అయిపోగానే ఆ శరీరం మరణిస్తుంది. ఆ శరీరానికే అమ్మ, నాన్న, తాత, ముత్తాత, ఇతర బంధుమిత్రులు. ఆత్మకు బంధుత్వాలు, భవబంధాలు, అపేక్షలు ఉండవు. కలలో కనిపించేవి ఆ శరీరాలే! ఆ రూపంలో పంచుకున్న.. పెంచుకున్న బంధాలు, అనుబంధాలే! కలలు అంటే మన అనుభవాలు, ఆశలు, ఆలోచనలే! ఎవరి గురించి బాగా ఆలోచిస్తామో ఆ రూపాలే కనిపిస్తాయి. అవి ఆత్మలు కావు. ©

# అవార్డులు



నవంబరు 13న హనుమకొండ ఆర్ట్స్ కళాశాలలో ప్రముఖ కవి అందెశ్రీకి కాళోజి నారాయణరావు స్మారక పురస్కార ప్రదాన దృశ్యం. చిత్రంలో కాళోజి సోదరులు యాది, అంపశయ్య నవీన్, నాగిళ్ల రామశాస్త్రి, బన్న అయిలయ్య, రామేశ్వర్ తదితరులు



నవంబరు 6న భద్రాచలం రాజుల సత్రంలో సీనియర్ కథకులు డా. శాంతినారాయణకు కామిశెట్టి రాష్ట్రస్థాయి సాహిత్య పురస్కారాన్ని అందజేసిన దృశ్యం. చిత్రంలో ప్రముఖ కథకులు పెద్దింటి అశోక్‌కుమార్ తదితరులు



అక్టోబరు 23న కడప సీపీ బ్రౌన్ భాషాపరిశోధన కేంద్రంలో సీనియర్ కథకులు డా. కేతు విశ్వనాథరెడ్డికి జానమద్ది హనుమచ్ఛాస్త్రి సాహితీ పీఠం పంచమ సాహితీ పురస్కారాన్ని అందజేసిన దృశ్యం. చిత్రంలో ఆంధ్రప్రదేశ్ సర్వోన్నత న్యాయస్థానం న్యాయమూర్తి జస్టిస్ ఎస్వీభట్, ఆంధ్రప్రదేశ్ శాసనమండలి ఉపసభాపతి ఎస్వీ సతీష్‌రెడ్డి, జె. తిరువేంగళాచార్యులు, జానమద్ది విజయ భాస్కర్, డా. మల్లెమాల వేణు గోపాల్ రెడ్డి తదితరులు

కాలాతీతం

గాబ్రియెల్ గార్సియా మార్క్వెజ్

# క్రానికల్ ఆఫ్ ఎ డెత్ ఫోర్‌టోల్డ్

పేద్రో, పాబ్లో సోదరులు సాంటియాగో నాసర్‌ను హత్యచేసిన వైనం 'క్రానికల్ ఆఫ్ ఎ డెత్ ఫోర్‌టోల్డ్' నవలలోని కథావస్తువు. ఆ హత్య పరిస్థితులను వివరించిన క్రమమే ఈ నవల అని రచయిత మార్కెజ్ ముందే స్పష్టం చేశారు. 'క్రానికల్..' ఒక క్రైం/మిస్టరీ నవల అనటంలో ఎవరికీ సందేహం ఉండదు. కానీ మార్కెజ్ చేతిలో అది అంతర్లీనంగా, రాజకీయ వ్యాఖ్యానంగా ధ్వనిస్తుంది.

హత్య చేస్తామని ప్రకటించారు. పబ్లిగ్గా హత్య చేశారు. అయినా ఒక్కరూ అడ్డుకోవటానికి ప్రయత్నించలేదు.

హత్య జరిగిన ఇరవై ఏడేళ్ల తర్వాత, ఆనాటి ప్రత్యక్ష సాక్షులతో మాట్లాడతాడు కథకుడు. పబ్లిగ్గా ఓ మనిషిని చంపుతుంటే అందరూ చేతులు ముడుచుక్కూచున్నారెందుకన్నది అసలు పరిశోధన. హంతకులకు నిజంగా చంపాలని కోరిక లేదు. బెదిరించారు. ఎవరైనా అడ్డుపడితే పరిస్థితి అంతదాకా వచ్చేదే కాదు. మరి ఎవరూ, ఎందుకు పల్లెత్తుమాటనలేదు?

ఒకరోజు అరణ్యంలో నడుస్తున్నప్పుడు వర్షం పడి, తను తడిసి ముద్దయినట్టుగా కలొస్తుంది నాసర్‌కు. దిగ్గునలేచి కూర్చుంటాడు. ఏ స్వప్నం, జరగబోయే ఏ వాస్తవ సంఘటనకు సంకేతమో చెప్పగల నేర్పుందతని తల్లికి. అయినా మరో గంటలో తన కొడుకు హత్యకు గురికాబోతున్నాడని పసిగట్టలేదామె.

ఉదయంపూట జరిగింది హత్య. ఆనాడు ఊళ్లోని జనం ఎక్కడెక్కడున్నారో, ఏమేం చేస్తున్నారో వివరిస్తాడు రచయిత. నిజానికి హంతకులు ప్రొఫెషనల్ కిల్లర్స్ కాదు. పేద్రో, పాబ్లోలకు పరస్పర అభిప్రాయ భేదాలుంటాయి.

తమ సోదరి ఏంజిలాతో సంబంధం పెట్టుకుని, మోసం చేసినందుకు పేద్రో, పాబ్లోలు నాసర్ మీద పగ తీర్చుకుంటారు. అంతకు ముందు ఆమెకు బాయార్డోసాన్ రోమన్‌తో వివాహం జరుగుతుంది. బ్రహ్మాండంగా విందు ఇస్తారు. కానీ ఆ తర్వాత పెళ్లికొడుక్కు వధువు కన్య కాదని తెలిసి ఆమెను పుట్టింటికి పంపించి



వేస్తాడు. ఇంత నీచమైన పని చేసి, కుటుంబం పరువు మంటగలిపినందుకు తల్లి ఆమెను చావ గొడుతుంది. అన్నలు అడిగినప్పుడు, నాసర్‌తో రహస్య ప్రేమ వ్యవహారం గురించి చెబుతుంది. ఇంకేం సాక్ష్యం కావాలి?

ప్రతీకారం తీర్చుకోక తప్పదు. పందులను చంపే కత్తులు రెండు సిద్ధం చేసుకుంటారు. కసాయి కొట్టులో పదును పెడతారు. ఆ తర్వాత క్లాతిల్డా పాల దుకాణంలో నాసర్ కోసం నిరీక్షిస్తారు. ఆ రోజే బిషప్ ఆ వూరికి వస్తున్నాడు. నాసర్ ఇంట్లోంచి కాలు బయట పెట్టగానే తమ పని కానిచ్చేస్తారు. ఒక రకంగా ఇది పరువు హత్య.

'వాస్తవ సంఘటన మీద ఆధారపడిన కథ ఇది' అని చెప్పాడు మార్కెజ్. పెళ్లయిన వెంటనే భార్య శీలాన్ని శంకించి భర్త వదిలెయ్యటం స్వయంగా చూశాడు. ఆమె సోదరులు ఇలాగే, ఆమె మాజీ ప్రియుణ్ని చంపి జరిగిన అవమానానికి ప్రతీకారం తీర్చుకున్నారు. '1951లో జరిగిన ఈ హత్యకు మార్కెజ్ కూడా ప్రత్యక్ష సాక్షి' అన్నారు కొందరు.

అయితే మార్కెజ్ ఈ కథ రాయటానికి కారణం.. కళ్ల ముందు జరిగిన ఒక ఘోరాన్ని నివారించటానికి ఎవరూ ప్రయత్నం చేయకపోవటమే. అంటే ముఖ్య సమయాల్లో ప్రజలు సామాజిక బాధ్యతను, నైతికతను విస్మరిస్తారు.

యూరోప్‌లో వచ్చిన 'సర్రియలిజం' ధోరణికి ప్రత్యామ్నాయంగా వచ్చిందే లాటిన్ అమెరికాలోని 'మాజిక్ రియలిజం'. 1920లలోనే 'మాజిక్ రియలిజం' అనే మాట వాడినప్పటికీ దీనిని ప్రాచుర్యంలోకి తెచ్చింది మార్కెజ్. ఈ ధోరణిలో అద్భుతమే అతి సామాన్యం- 'ఫెంటాస్టిక్ ఈజ్ ఆర్డినరీ'.

'క్రానికల్..'లోని పాత్రలూ అలాంటివే. హత్యను నివారించటానికి ఎలాంటి ప్రయత్నమూ చెయ్యరు ఆ వూరి జనం. లాటిన్ అమెరికాలో నియంతలు పుట్టగొడుగుల్లా పుట్టుకు రావటానికి, రాజకీయాల పట్ల ప్రజలకున్న నిరాసక్తతే కారణమంటాడు మార్కెజ్. హత్యలు జరుగుతాయి. మారణహోమాలు నిత్యకృత్యమవుతాయి. దోపిడీ కొనసాగుతుంది. ప్రజాస్వామికంగా ఎన్నుకున్న ప్రభుత్వాలను కూలదోసి సైనిక నియంతృత్వాలు అధికారం చేజిక్కించుకుంటాయి. కానీ ప్రజలు స్పందించరు. అవి తమకు సంబంధించిన విషయాలు కాదనుకుంటారు. ఒక్కొక్క నియంతా కొన్ని లక్షలమంది హంతకుల పెట్టు. అవినీతి, ఆశ్రిత పక్షపాతం, దోపిడీ నిరాటంకంగా కొనసాగుతాయి. పరిస్థితిని చక్కదిద్దటానికి ఏ యుగపురుషుడో దిగి వస్తాడనుకోవటం భ్రమ. చైతన్యవంతులైన ప్రజలు మాత్రమే దీన్ని అడ్డుకోగలరు. స్వదేశం కొలంబియాలోని గుస్తావో రోహాస్ పినిలా, స్పెయిన్‌లో నరమేధం జరిపిన జనరలిస్సిమో ఫ్రాన్సిస్కో ఫ్రాంకో, వెనెజులాకు చెందిన యువాన్ విన్సెంట్ గోమెజ్, సోమోజా, తునిహియో లాంటి నియంతలను స్వయంగా చూసిన మార్కెజ్, 'ది ఆటం ఆఫ్ ది పేట్రియార్క్' తర్వాత, ఇందులోనూ ప్రతీకాత్మకంగా అదే కథ చెప్పాడు. కళ్లముందే హత్య జరిగినా ఎవరూ అడ్డుపడలేదంటే ఇది 'సామూహిక ఆత్మహత్య' అంటాడు. నవలలో మరణించింది ఒక వ్యక్తి నాసర్ మాత్రమే కాదు, అతడితో పాటు వూరు ఊరంతా మరణించింది.

'వన్ హండ్రెడ్ ఇయర్స్ ఆఫ్ సాలిట్యూడ్' ఒక మహాకావ్యం. 'క్రానికల్..' ఒక గ్రీక్ ట్రాజెడీ లాంటిది. ఒక సామూహిక విషాదం. ఇందులో ఉప కథలుండవు. కథ ప్రారంభంలోనే పాఠకులకు తెలిసిన ముగింపు వైపు బాణంలా దూసుకుపోతుంది కథనం.

'కొన్నేళ్లపాటు ఆ ఊళ్లో మరే విషయమూ మాట్లాడుకోలేదు. రోజువారీ పనులేవీ ఆగిపోలేదు. అంతా సజావుగానే ఉన్నట్టనిపించింది గానీ అందరి మనసుల్నీ తొలిచివేసింది ఆ ఉదయం జరిగిన ఘోరం. అలవాటు ప్రకారం కోళ్లు 'కొక్కొరొక్కో' అంటూ ఊరి నిశ్శబ్దాన్ని భంగం చేశాయి. జరిగిన దాంట్లో రహస్యం, మిస్టరీ ఏమీ లేదు. హతుడూ, హంతకులూ అందరికీ సుపరిచితులే! అయినా అదో నాటకంలోలా.. వాళ్లు పాత్రలు, మేం ప్రేక్షకులమన్నట్టుగా ప్రవర్తించాం. కర్తవ్యం నిర్వహించనప్పుడు కలిగే నేర భావనను అధిగమించడం కష్టం'

'సమాజ పరిణామాలకు నాకేం సంబంధం?' అనుకుంటే ఆ తర్వాతి దుష్పరిణామాలకు అందరి బాధ్యతా ఉంటుంది. నేరం చేసిన వాళ్లే కాదు, దాన్ని ప్రతిఘటించని వాళ్లు పరోక్షంగా శిక్షలు అనుభవిస్తారు.

కథలో ఆ ఊళ్లోని పలువురి దినచర్యను, వారి మనస్తత్వాలను వివరంగా చెప్పటానికి కారణమిదే. నేరాన్ని వీక్షించిన మన జ్ఞాపకాలే మనకు మోయలేని భారం.

'న్యాయం, ధర్మం, సత్యం' భావనలు ఇతరు

లకే తప్ప మనకు వర్తించవనుకుం టాం. అంటే 'మనం వీటికి అతీతులం'. జీవితంలో ప్రేక్షక పాత్ర ఉండదు. ఏదోవిధంగా అందరం పాత్రధారులమే. కథలోని ఓకీలక సన్నివేశం ఇలా ఉంటుంది..

ఆరోజు ఉదయం ఐదున్నరకు నాసర్‌ను నిద్ర లేపుతుంది పనిమనిషి విక్టోరియా గజ్‌మాన్. అంతక్రితం రోజే అతడి హత్యకు ముహూర్తం నిశ్చయమైందని విన్నదామె. కానీ అదేదో తాగిన మత్తులో వాగి వుంటారనుకొని నాసర్‌కు చెప్ప లేదు. పనిమనిషి కూతురు డివినా ఫ్లోర్‌ను తన దగ్గరకు పంపాలని ఆదేశించాడు నాసర్. చిన్నపిల్లల్ని లైంగికంగా వేధించడం అతడికి సరదా. తల్లి విక్టోరియాకు కూడా నాసర్ తండ్రి చేతిలో ఇలాగే జరిగింది. అందువల్ల కూతురికి బదులు తానే వెళ్లి అతన్ని నిద్ర లేపుతుంది విక్టోరియా. ఆ తర్వాత అతడు బ్రేక్‌ఫాస్ట్ చేస్తున్నప్పుడు కుందేళ్లను చంపి, పేగుల్ని కుక్కలకు ఆహారంగా వేస్తుంది. కథ చివరన మరణించిన నాసర్ పేగుల కోసం మొరుగుతాయి అవే కుక్కలు. వాటిని తక్షణమే చంపమని ఆదేశిస్తుంది నాసర్ తల్లి. స్పష్టంగా చెప్పకపోయినా విక్టోరియా తన యజమాని చస్తే బాగుండుననుకుంటున్నదని తెలుస్తూనే ఉంటుంది. ఈ కామాంధుడి చేతిలో తన కూతురు పాడు కావడం ఆమెకిష్టం లేదు. యజమానుల స్వభావాలు మారవు. తండ్రిలాగే కొడుకు. పనిమనుషులంటే వాళ్లకు ఆటబొమ్మలు, పెంపుడు జంతువులు. పేడ్రో, పాబ్లో అతణ్ని చంపటానికి నిశ్చయించుకున్నారని తెలిసినా, నాసర్‌కీ విషయం చెప్పకపోవటానికిదే కారణం. యజమాని పట్ల ఉన్న ద్వేషమే ఆమె మౌనం వహించేలా చేసింది. అంటే అనాలోచితంగానే ఆమె హత్యను ఆమోదించింది. చేసిన పనులను సమర్థించుకోవటం మనకలవాటు. ఒకసారి ఈ వైఖరిని పునఃపరిశీలించుకొమ్మంటాడు రచయిత. తెలియకుండానే అందరం మనచుట్టూ జరుగుతున్న నేరాలలో భాగస్వాములం అవుతున్నాం.




మార్క్వెజ్ రచనల్లో అవే పాత్రలు, కథాస్థలాలు మనకు మళ్లీ మళ్లీ దర్శనమిస్తాయి. పేరు చెప్పకపోయినా 'క్రానికల్..'లోని ఊరు కూడా 'వన్ హండ్రెడ్ ఇయర్స్..'లోని 'మాకాండో' అని స్ఫురిస్తూనే ఉంటుంది. కలైడోస్కోప్ లాంటి మాజిక్ రియలిజం ఇందులోనూ పలు రంగుల్లో తళుక్కుమంటుంది. 'అసలు మార్క్వెజ్ ఒకే కావ్యం రాశాడు జీవితంలో. ఇది అందరు రచయితలకూ వర్తిస్తుంది. ఒకొక్క దశలో రాసిన దానికి ఒక్కో పేరు పెట్టాడు. అందువల్ల కథలూ, నవలలూ, వ్యాసాలూ అంటూ మనం విభజించి చూడటమే గాని అదంతా ఒకే ఆలోచన, ఒకే సృష్టి' అంటారు విమర్శకులు. ఏదేమైనా 'క్రానికల్..' ఆయన రచనాక్రమంలో ఒక ముఖ్య అధ్యాయమని మాత్రం అంగీకరించక తప్పదు.

ప్రపంచం నుండి దూరంగా విసిరేసినట్టున్న ప్రాంతాల గురించి 'వన్ హండ్రెడ్ ఇయర్స్..'లో రాశాడు మార్క్వెజ్. లాటిన్ అమెరికా ఇలాంటి ప్రాంతమే. ఆ ఆర్థిక, సాంస్కృతిక ఒంటరితనం, వెనకబాటుతనం, మూఢనమ్మకాలు, అక్కడి ప్రజల మీద జరుగుతున్న నిరంతర దోపిడీ, తిరుగుబాటు చెయ్యలేని, ప్రశ్నించలేని వాళ్ల నిరాసక్తత.. ఇవీ అతడి కథావస్తువులు. 'క్రానికల్..'లో కూడా అదే వాతావరణం కనిపిస్తుంది. ఆ ఊరి జనం కళ్ల ముందు ఏం జరిగినా ప్రేక్షకుల్లా చూస్తారే తప్ప దేనికీ స్పందించరు.

పలు ఇంటర్వ్యూల్లో తను రాసిందంతా జర్నలిజమే- సృజనాత్మక నవలలు- కథలు కావన్నాడు మార్క్వెజ్. అలాగే ఇతర దేశాలలోని పాఠకులకు ఫాంటాస్టిక్ మాజిక్ రియలిజంలాగా కనిపించింది. లాటిన్ అమెరికాలోని నిత్య వాస్తవికత- అందరికీ తెలిసిన నిజం- అని వివరణ ఇచ్చాడు. 'క్రానికల్..'ను కథగా రాయలేదు. ఒక నిజనిర్ధారణ నివేదిక లేదా దర్యాప్తు నివేదికలాగా తయారు చేశాడు.

నిజానికి కథ కేవలం గంటసేపు జరుగుతుంది. ఆ ఉదయం నాసర్ లేచి, బ్రేక్‌ఫాస్ట్ చేసి గుమ్మం దాటతాడు. అంతే.. ఆ వెంటనే హత్య జరుగుతుంది. డిటెక్టివ్, మిస్టరీ, క్రైం నవలా ప్రియులు తప్పక చదవాల్సిన నవలిక 'క్రానికల్ ఆఫ్ ఎ డెత్ ఫోర్‌టోల్డ్'. – ఎం. వసంత

# భామనే.. సత్యభామనే..!

34

## సొగసు చూడతరమా...

**నిన్నటివరకు బాలీవుడ్ ప్రపంచాన్ని ఏలిన అందాల తార రేఖ. ఆరు పదులు దాటినా తరగని అందం ఆమెది! అభినయం, అందచందాలతో మైమరిపించి నేటికీ వెలుగులు విరజిమ్ముతున్న ఆ తార వెనుక ఎన్ని చీకట్లో! తండ్రి ఆదరణకు, తల్లి లాలనకు నోచుకోని ఆమె పదమూడేళ్ల ప్రాయం లోనే సినీ రంగంలోకి అడుగు పెట్టారు! తల్లికి ఆసరాగా ఉంటూ వృత్తిలోని ఒత్తిళ్లను తట్టుకుంటూనే తన అందానికి, నటనకు మెరుగులు దిద్దుకుంటూ ఒక్కో మెట్టూ అధిరోహించారు. నేటికీ బాలీవుడ్ ఐకాన్‌గా నిలిచి తన జీవిత 'రేఖ'ను మార్చుకున్న ఆమె సౌందర్య రహస్యమేంటో చూద్దాం..**

నేటికీ తరగని పసిమి చాయకు ఆమె అవలంబించే సహజమైన పద్ధతులే కారణం. ఇప్పటికీ స్నానానికి శనగపిండిని ఉపయోగిస్తారు! క్రమం తప్పకుండా స్పా ట్రీట్‌మెంట్ తీసుకుంటారు. రాత్రి త్వరగా పడుకుని ఉదయం త్వరగా నిద్ర లేస్తారు.



పెరుగు, తేనె, కోడిగుడ్డు తెల్లని సొనల మిశ్రమాన్ని జుట్టుకు పట్టిస్తారు. షాంపూల జోలికి వెళ్లరు. తడి జుట్టును దువ్వుకోవడం, డ్రయర్ వాడడం వంటి వాటికి దూరం.

యాంటి ఆక్సిడెంట్లు, ప్రోటీన్లు పుష్కలంగా లభించే కూరగాయలతో కూడిన భోజనం తీసుకుంటారు. రాత్రి భోజనం 7.30 గంటల కల్లా ముగిస్తారు. ఆహారంలో పండ్లు, పప్పు దినుసులు తప్పనిసరి.

ప్రతిరోజూ వ్యాయామం, యోగా, ధ్యానం ఆమె ఫిట్‌నెస్‌కు ముఖ్యకారణం. డ్యాన్సంటే చాలా ఇష్టం. ఇంటిపని, తోటపని ఆవిడ ఆరోగ్య రహస్యాలు!

★ ఇప్పటికీ తన దుస్తుల ఎంపిక, మేకప్ తనే సొంతంగా చేసుకుంటారు!

★ షూటింగ్ షెడ్యూల్ సమయానికి కచ్చితంగా వస్తారని ప్రశంసలందుకునేవారు.

★ అనుకరణ కూడా చేసేవారు.

★ దుర్భర పేదరికం వల్ల తొలిరోజుల్లో సి గ్రేడ్ సినిమాల్లో నటించారు.

★ హోటల్ రామి ఇంటర్నేషనల్‌లోని జిమ్‌లో పేరు నమోదైన తొలి బాలీవుడ్ నటి రేఖ!

★ ఎయిర్ హోస్టెస్ కావాలనుకునేవారు!

# నారింజతో ఆరోగ్యం.. సౌందర్యం!

తియ్యతియ్యగా, పుల్లపుల్లగా నోరూరించే నారింజలు ఈ కాలంలో ఎటు చూసినా కనువిందు చేస్తుంటాయి. వీటిలో పోషకాలెన్నో! ఆరోగ్యానికే కాదు సౌందర్య పోషణ, చర్మ రక్షణలోనూ కీలకపాత్ర వహిస్తాయి. రోజుకో యాపిల్ పండు తింటే డాక్టరు అవసరం ఉండదని విన్నాం. అయితే రోజుకో నారింజ పండు తినడం వల్ల కూడా అంతే ఆరోగ్యం సమకూరుతుందట!

* ఒక నారింజ పండులో ఒక రోజుకు మన శరీరానికి కావలసిన దానికంటే ఎక్కువ (130 శాతం) సి విటమిన్ లభిస్తుంది.
* రోగనిరోధక శక్తి వృద్ధి చెందుతుంది.
* నారింజలో లభించే కోలిన్ అనే పదార్థం నిద్ర, కండరాల కదలిక, జ్ఞాపకశక్తికి దోహదం చేస్తుంది.
* ఫైబర్, పొటాషియం, సి విటమిన్ పుష్కలంగా లభించే నారింజ పండు గుండెపోటు, ఇతర గుండె జబ్బులను అరికడుతుంది.
* పిల్లలకు మొదటి రెండు సంవత్సరాల్లో నారింజ పండ్లు, రసం ఇస్తే లుకేమియా వ్యాధి దరిచేరదు.
* నారింజలోని సి విటమిన్ క్యాన్సర్ కారక కణజాలాన్ని నశింపజేస్తుంది.
* వీటిలోని పొటాషియం కండరాలు, ఎముకలకు పటుత్వాన్నివ్వడమే కాక కిడ్నీల్లో రాళ్లు ఏర్పడకుండా అరికడుతుంది..
* వీటిలో లభించే పీచుపదార్థం కొవ్వు పదార్థాలను క్రమపరుస్తుంది.
* టైప్ 1 డయాబెటిస్ ఉన్నవారిలో చక్కెర స్థాయిని తగ్గిస్తుంది. టైప్ 2 డయాబెటిక్ వారిలో ఇన్సులిన్ స్థాయిని వృద్ధి పరుస్తుంది.
* జీర్ణశక్తిని మెరుగుపరుస్తుంది. బరువు తగ్గడంలోనూ సహకరిస్తుంది.
* కంటి ఆరోగ్యానికీ మేలే. దీనిలో లభించే విటమిన్ ఎ రేచీకటిని తగ్గిస్తుంది. అంతే కాదు విటమిన్ సి క్యాటరాక్ట్స్ రిస్కును తగ్గిస్తుంది.
* యాంటీ ఆక్సిడెంటుగా పనిచేసే విటమిన్ సి సూర్యకిరణాలు, వాతావరణ కాలుష్యం వల్ల దెబ్బ తిన్న చర్మానికి మునుపటి మృదుత్వాన్ని చేకూరుస్తుంది.
* ముడతలను తగ్గించి చర్మం ఆరోగ్యంగా ఉండేందుకు దోహదం చేస్తుంది.
* చర్మంలో కొల్లాగన్ అనే పదార్థాన్ని వృద్ధి పరిచి తద్వారా మృతకణాలను తొలగిస్తుంది. వృద్ధాప్యఛాయలను దరిచేరనీయదు.

### ఒక నారింజలో..

* 0 శాతం కొవ్వు
* 80 కెలోరీల శక్తి
* 250 మిల్లీగ్రాముల పొటాషియం
* 14 గ్రాముల చక్కెర
* 3 గ్రాముల పీచుపదార్థం
* 1 గ్రాము ప్రోటీను

* నారింజలో పొటాషియం ఎక్కువగా ఉంటుంది కాబట్టి మోతాదును మించకూడదు. బీటా బ్లాకర్స్, కిడ్నీల్లో రాళ్లు, గ్యాస్ట్రిక్ సమస్యలున్నవాళ్లు డాక్టరు సలహా తీసుకోవడం మేలు.





ఈ నెల 1 ప్రపంచ ఎయిడ్స్ దినం

# అప్రమత్తత అవశ్యం!

**సే**ల్స్ ఎగ్జిక్యూటివ్ మోహన్‌కి హెచ్ఐవి వైరస్ సోకడంతో భార్య సీత కన్నీరుమున్నీర యింది. అతనూ కుంగిపోయాడు.

"ఎప్పుడూ క్యాంపుల్లోనే వుంటాడుగా.. కక్కుర్తి పడుంటాడు.. అందుకే ఇలాంటి రోగం" అంది పక్కింటావిడ.

"చాల్లే పిన్నీ, అలా మాట్లాడకు" సీత కసిరింది. గదిలోకొచ్చి కన్నీరు కారుస్తున్న భర్తను చూసి "అలాంటిమాటలు పట్టించుకోకు మోహన్" అంటూ ఓదార్చింది.

"నన్ను నమ్ము సీతా, నేనలాంటివాణ్ణి కాను" అన్నాడతను తనలో తాను ముడుచుకుపోతూ.

"నీమీద నాకు నమ్మకముంది"

"ఈ పక్కింటావిడ లాగే మీవాళ్ళూ నన్ను తిరుగుబోతు కింద జమకడ్తారేమో!" అన్నాడు బాధగా.

"అక్రమ సంబంధాలతో హెచ్ఐవి వస్తుందనే దొక్కటే ఎక్కువమందికి తెలుసు కనుక గబుక్కున తూలనాడ్తారు. కానీ నీగురించి నాకు తెలీదా? " అంది సీత.

"నీ నమ్మకానికి థాంక్స్ సీతా.. కానీ ఇది ప్రమాదకరమైన జబ్బు.. నాకేమన్నా అయితే ఇంత చిన్నవయసులో ఒంటరిదానివైపోతావు" అన్నాడు బేలగా.

"నిజమే, ఈ వైరస్ వ్యాధినిరోధక శక్తిని క్షీణింపచేస్తుంది. శరీరంలో యాంటీబాడీస్‌తో పోరాడే శక్తి కరువైనప్పుడు రోగాలు త్వరగా దాడిచేస్తాయి. అయినా తప్పదు, ధైర్యంగా ఎదుర్కోవాలి! అవసరమైన మందులు వాడుతూ, డాక్టర్ సలహాలు పాటిస్తూ చాలా జాగ్రత్తగా వుండాలి.."

"ఎన్ని అవమానాలెదురౌతాయో.."

"నీ తప్పేం లేనప్పుడు మనసును కష్టపెట్టుకోకు.. తోడుగా నేనున్నాను"

"నువ్వు దొరకడం నిజంగా నా అదృష్టం సీతా" అన్నాడతను ఆర్ద్రంగా.

తప్పు చేసి వ్యాధిగ్రస్తులయ్యేవారే కాకుండా ఇలా మోహన్ లాంటి అమాయకులూ హెచ్ఐవి బారినపడటం బాధాకరం కదా!

అనైతిక సంబంధాలతో ఈ వ్యాధి వస్తుందనేది ప్రాథమిక అవగాహన. సాధారణంగా అక్రమ సంబంధాలు, స్వలింగ సంపర్కాలవల్ల ఎయిడ్స్ వస్తుంది. హెచ్ఐవి వైరస్ వున్న వ్యక్తి రక్తం ఎక్కించడం లాంటి పొరపాట్లవల్లనూ, అలాగే ఆ రోగులు ఉపయోగించిన బ్లేడులు, సిరంజిలు వాడినా వచ్చే ప్రమాదముంది. కనుక ఇలాంటి విషయాల్లో అప్రమత్తంగా వుండడం తప్పనిసరి.

హెచ్ఐవి వైరస్‌పై అవగాహన పెంచి అరికట్టేందుకు ప్రభుత్వ సంస్థలు, మేధావులు కృషిచేస్తున్నారు. సెమినార్లు, ప్రకటనలద్వారా హెచ్ఐవి వైరస్ సోకకుండా తీసుకోవాల్సిన జాగ్రత్తల గురించి ప్రచారం చేస్తున్నారు. ఇదేం సాధారణ అంటువ్యాధి కాదనీ అంచేత వ్యాధిగ్రస్తులపట్ల మానవీయతతో ఉండాలని హితవు పలుకుతున్నారు. ప్రపంచవ్యాప్తంగా ఎయిడ్స్ నిర్మూలన దిశగా జరుగుతున్న విస్తృత ప్రచారాలతో ప్రజలు జాగృతమవుతున్నారు.

గర్భవతి హెచ్ఐవి పాజిటివ్‌తో బాధపడ్తున్నట్లయితే పుట్టే శిశువుకు ఆ వైరస్ సోకకుండా సంరక్షించేందుకు సైతం ప్రయత్నిస్తున్నారు. ఇలాంటి కేసుల్లో కూడా అధికశాతం సఫలమౌతున్నాయి.

ఇతర అనారోగ్యాలు బాధపెడ్తాయే తప్ప భయపెట్టవు. కానీ, వ్యాధినిరోధక శక్తిని హరించి బతుకును దుర్భరంచేసే ఎయిడ్స్ విపరీతంగా భయపెడుతుంది. తగిన మందులు వాడుతూ జాగ్రత్తలు పాటిస్తే పరిస్థితి కొంత మెరుగుగా వుంటుంది.

దీనిని దృష్టిలో పెట్టుకుని ఏయే కారణాలతో హెచ్ఐవి వస్తుందో వాటికి ప్రతిఒక్కరూ దూరంగా ఉండడం అవశ్యం.

– నాగరత్న

## చతురంగం - 68 జవాబులు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 ప్ర | 2 లో | ఖం | ■ | 3 ని | 4 వే | ద | 5 న | ■ | 6 గో |
| 7 దా | హం | ■ | 8 ఆ | వా | లు | ■ | 9 ర | 10 ప | దా |
| నం | ■ | 11 ఉ | దా | ర | ■ | 12 అ | మే | య | ము |
| ■ | 13 రా | మా | య | ణ | 14 ము | ■ | 15 ధ | నం | ■ |
| 16 వి | లా | ప | ము | ■ | 17 త | 18 ప | ము | ■ | 19 ప |
| 20 సు | ద | తి | ■ | 21 కా | క | ర | ■ | 22 నా | రి |
| 23 గు | త్త | ■ | 24 బా | లు | ■ | 25 లో | 26 హ | గు | ణం |
| ప | ■ | 27 రా | ధ | ■ | 28 టం | క | ము | ■ | మా |
| 29 ని | 30 తం | బం | ■ | 31 మే | ఘ | సం | దే | 32 శం | ■ |
| ■ | 33 వా | దు | లా | ట | ■ | ఘం | ■ | 34 క | ప్పు |

అన్నీ సరైన సమాధానాలు రాసిన వారిలో డ్రా ద్వారా ఎంపికైన ఈ విజేతకు రూ.150/- త్వరలోనే అందుతాయి.

**వాడపర్తి పాపమ్మ**

గొల్లలవలస, పోలాకి,
శ్రీకాకుళం జిల్లా
పిన్ : 532 429

## సరైన సమాధానాలు రాసిన వారు

1. గుళ్ళపూడి కల్యాణిలక్ష్మి అపురూప, మచిలీపట్నం, 2. బత్తుల యాదగిరి, ఉప్పల్, 3. ఆర్. భారతి, ఎమ్మిగనూరు, 4. టి. హేమలత, మచిలీపట్నం, 5. బి. సురేష్‌బాబు, చీరాల, 6. బోడపాటి కృష్ణవేణి, చెన్నై, 7. యు. విజయశేఖరరెడ్డి, కూకట్‌పల్లి, 8. ఎం. వసంత, బోరబండ, 9. ధరణి పద్మాసన, నల్లకుంట, 10. పసుమర్తి జయశ్రీ, హైదరాబాద్, 11. యర్రమిల్లి విజయలక్ష్మి, బెంగళూరు, 12. అల్లాడి లక్ష్మి, తిరుపతి, 13. యు.యు.యు, ఎమ్మిగనూరు, 14. అక్షింతల సంజీవశర్మ, అనంతపురం, 15. గురజాల వరలక్ష్మి, ఆత్రేయపురం, 16. కరణం శివానందరావు, కర్నూలు, 17. సిహెచ్.వి.ఎస్.వి. ప్రసాద్, రాజమహేంద్రవరం, 18. పాలకుర్తి సుధీర్ కుమార్, మాదాపూర్, 19. పేర్వేల నాగవెంకట శేషలక్ష్మి, మణికొండ, 20. పైబోయిన శ్రీలత, తాడేపల్లిగూడెం, 21. చిలుముల ప్రమీల నసీరుద్దీన్, కరీంనగర్, 22. నీలిమ సబ్బిశెట్టి, రాజానగరం, తూ.గో.జిల్లా, 23. వి. పరశురాం, మహబూబ్‌నగర్, 24. సి. భారతి, హైదరాబాద్, 25. విన్నకోట పద్మావతి, సఫిల్‌గుడ, 26. పి.బి. సీతాదేవి, నరసాపురం, 27. పి. దేవసేనమ్మ, జూబ్లీహిల్స్, 28. వి.వి. సత్యనారాయణశెట్టి, తిరుపతి, 29. వానపల్లి వెంకట గంగరాజు, విశాఖ, 30. జి. ముత్తుమారన్, చర్లపల్లి, 31. కోకా శైలజ, ఇ.సి.ఐ.ఎల్, 32. చిల్లర సీతారామారావు, వనస్థలిపురం, 33. అనసూరి సత్యవేణి, కె..పి.హెచ్.బి. కాలనీ, 34. ఆమంచర్ల సరస్వతి, హైదరాబాద్, 35. పి. శుభ, బంజారాహిల్స్, 36. చింతలపాటి శివశంకరశాస్త్రి, బి.హెచ్.ఇ.ఎల్., 37. వరయోగి రామ్ మోహన్, బొల్లారం, 38. అడపా రత్నకుమారి, కాకినాడ, 39. ఎస్.టి.పి. కృష్ణమాచార్యులు, నాగోల్, 40. రామరపు చంద్రశేఖర్ (సాగర్), మలక్‌పేట్, 41. కె.ఎ. ప్రకాష్, నంద్యాల, 42. ఎ. పూర్ణచంద్రరావు, నెల్లూరు, 43. సాలగ్రామ నారాయణరావు, నరసన్నపేట, 44. యు. భాస్కరయ్య, అడయార్, చెన్నై, 45. దోనెపూడి హనుమ అన్నపూర్ణ, కర్నూలు, 46. తిప్పావఝుల తులశమ్మ, మల్కాజ్‌గిరి, 47. ఎస్.హైమారాణి, విజయవాడ, 48. జి. విశాలి, తిరుపతి, 49. బెహరా సత్యవాణి, అంబాజీపేట, తూ.గో. జిల్లా, 50. వి.ఆర్.కె. అల్లమరాజు, కాట్రేనికోన, 51. జి. లింగయ్యగారి వేంకటేశం, చిక్కడపల్లి, 52. జి. దేవసేన, తిరుపతి, 53. నోరి శివప్రకాశం, నెల్లూరు, 54. తటవర్తి రామకృష్ణ, తాళ్ళగడ్డ, 55. కస్తూరి వెంకుబాబు, గుంటూరు, 56. డా.కె. శివభూషణం, కర్నూలు, 57. వి.వి. సుబ్బారావు, బెంగళూరు, 58. ఎ. మానస, కడప, 59. ఎస్. ప్రసాద్, చెన్నై, 60. కొల్లూరి నాయుడమ్మ, ఇంకొల్లు, 61. శ్రీనాథ్‌బాబు బందెల, ఉయ్యూరు, 62. బచ్చు సత్యనారాయణ, కొత్తగూడెం, 63. కన్నేపల్లి నారాయణమూర్తి, జీడిమెట్ల, 64. గరిమెళ్ళ నాగసాయి అలేఖ్య, కాకినాడ, 65. టి. నరేంద్రకుమార్, ఇంకొల్లు, 66. జి. జనార్దన్‌రెడ్డి, నిజామాబాద్, 67. ముహ్మద్ జఫరుల్లా ఖాన్, మహబూబ్ నగర్, 68. టి. రాంకిషన్, హైదరాబాద్, 69. ఆంధ్ర రామలక్ష్మి, తణుకు, 70. శివలెంక చంద్రశేఖర్, మాసబ్‌ట్యాంక్, 71. రేవతి రెడ్డి, బెంగళూరు, 72. కాకర్లమూడి కృష్ణ ప్రసాదు, తణుకు, 73. గోగాడ రూప్ శ్రీచరణ్, షీర్వాల్, 74. శివప్రసాద్ పండా, పాలకొండ, శ్రీకాకుళం, 75. కె. చంద్రశేఖర శర్మ, నంద్యాల, 76. భోగరాజు అంజనీ మైత్రేయి, విజయనగరం, 77. వాసా రవికిరణ్, విశాఖ, 78. ఎన్. మైథిలీ శర్మ, అనంతపురం, 79. ఎ. అరుంధతి, పుణే, మహారాష్ట్ర, 80. నండూరి కార్తికేయచార్య, కూకట్‌పల్లి, 81. ధప్పూరి సుధాదేవి, హైదరాబాద్, 82. వారణాసి విజయలక్ష్మి, ర్యాలి, తూ.గో. జిల్లా, 83. పిశిపాటి శైలజా జానకి, నవులూరు, గుంటూరు జిల్లా, 84. *(..128లో)*




# క్రిస్టమస్ కేకు



## కావలసిన పదార్థాలు

### ఘన పదార్థాలు

- మైదా - 1 1/2 కప్పులు
- బేకింగ్ పౌడర్ - 1 1/4 టీ స్పూను
- బేకింగ్ సోడా - 1/2 టీ స్పూను
- ఉప్పు - 1/4 టీ స్పూను
- దాల్చినచెక్క పొడి - 1/2 టీ స్పూను
- అల్లం పొడి - 1/2 టీ స్పూను
- జాజికాయ పొడి - 1/4 టీ స్పూను
- లవంగం పొడి - 1/4 టీ స్పూను

### ద్రవ పదార్థాలు

- పెరుగు - 1 కప్పు
- బ్రౌన్ షుగర్ - 3/4 కప్పు
- తేనె - 2 టేబుల్ స్పూన్లు
- పాలు - 6 టేబుల్ స్పూన్లు
- నూనె - 1/4 కప్పు
- వెనిల్లా ఎసెన్స్ - 1 టీ స్పూను

### నానబెట్టడానికి

- కిస్‌మిస్ - 1/4 కప్పు
- చెర్రీ పండ్లు - 1/4 కప్పు
- బొప్పాయి ముక్కలు - 1/4 కప్పు
- నిమ్మ / నారింజ ముక్కలు - 1/4 కప్పు
- తరిగిన కర్జూర - 1/4 కప్పు
- బాదం పలుకులు - 1/4 కప్పు
- జీడిపప్పు పలుకులు - 1/4 కప్పు
- నారింజ రసం - సరిపడ





## తయారుచేయు విధానం

నానబెట్టవలసిన పదార్థాలన్నీ ఒక గిన్నెలోకి తీసుకుని అవి మునిగేవరకు నారింజ రసం పోసి కనీసం రెండుగంటల పాటు ఉంచాలి. ఫ్రిజ్‌లో ఒకరోజు వరకు నానబెట్టొచ్చు. ముందుగా ఓవెన్‌ను 350 డిగ్రీల ఫారెన్‌హీట్ వరకు వేడి చేసి ఉంచాలి. కేక్ పాన్ లోపల నూనె రాసి పెట్టుకోవాలి. ఒక గిన్నెలో ఘన పదార్థాలన్నీ కలిపి పక్కన పెట్టాలి. మరో గిన్నెలో పెరుగు, పంచదార వేసి బాగా కలపాలి. తర్వాత తేనె, పాలు, నూనె, వెనిల్లా ఎసెన్స్ కూడా వేసి కలపాలి. ఇపుడు పెరుగు మిశ్రమంలో పిండి మిశ్రమం కొద్దికొద్దిగా వేసి ఉండలు లేకుండా బాగా కలపాలి. తర్వాత నారింజ రసం పూర్తిగా వంపి పండ్ల ముక్కలు, పలుకులు కూడా కేకు మిశ్రమంలో వేసి కలపాలి. తర్వాత కేకు మిశ్రమాన్ని కేకుపాన్‌లో వేసి 30 నిమిషాల సేపు ఓవెన్‌లో పెట్టాలి. తర్వాత వేడిని 325 డిగ్రీ ఫారెన్‌హీట్‌కు తగ్గించి 20 నుండి 30 నిమిషాలు వరకు ఉంచాలి. టూత్ పిక్ కేకులో గుచ్చితే అంటుకోకుండా ఉంటే కేకు తయారైనట్లే. ఓవెన్ నుంచి కేకు పాన్ తీసి ఐదు నిమిషాల పాటు చల్లారనివ్వాలి. కేకును పాన్‌లో నుంచి తీసి పూర్తిగ చల్లారాక ముక్కలుగా కోసుకుని ఆరగించేయడమే! డ్రైఫ్రూట్స్‌ను నానబెట్టేందుకు నారింజ జూస్‌కు బదులు యాపిల్ జూస్‌ను కూడా ఉపయోగించొచ్చు. అంతేకాదు, ఇంకా మనకు నచ్చిన ఇతర డ్రైఫ్రూట్స్ వేసుకోవచ్చు.

## చిట్కాలక్ష్మి



- ★ పప్పులు, రవ్వలను వేయించి ఉపయోగించడం వల్ల మంచి రుచి వస్తుంది.
- ★ అన్నం ఉడికే ముందు రెండుమూడు చుక్కలు నూనె వేస్తే అన్నం మెతుకులు జిగటగా లేకుండా ఉంటాయి.
- ★ కూరగాయలు ఉడకబెట్టిన నీటిని చపాతీ పిండి కలపడానికి, రసం చేయడానికి ఉపయోగించడం వల్ల పోషకాలు లభిస్తాయి.

# చతురంగం - 69 ఆధారాలు

## అడ్డం

1. మందార మకరంద మాధుర్య కవిత్వం రాసిన కవి (3)
3. ఆంధ్రజ్యోతి వారపత్రిక పూర్వ సంపాదకుడి ఇంటి పేరు (3)
5. 'కథ' శబ్దానికి వికృతి (2)
7. విరాటరాజు కొలువులో భీముని పేరు (4)
9. వింజామరం (3)
10. ఎక్కువ (4)
11. ఎల్లవేళలా.. సదా (3)
12. 'మీయొక్క' అనేదాన్ని గౌరవంగా ఇలా అంటారు (2)
13. మచ్చ, డాగు (3)
15. 'కొరికి చూడ నోరు చురుకు మనును' అన్నాడు వేమన దీని గురించే (3)
17. సముద్ర లంఘనం చేసినవాడు గందరగోళం అయ్యాడు (3)
18. శ్మశానం (2)
19. సముద్రం (3)
21. గత సంవత్సరం (3)
23. గుంపులు (3)
25. గడ్డికుప్ప (2)
26. పెళ్లికాని యువతిని ఇలా అంటారు (3)
28. విధి వశమున దక్కినది, పొందినది .. అటునుంచి (2)
30. సున్నం, సుద్ద (2)
32. కృష్ణార్జునులను '- - నారాయణులు' అంటారు (2)
34. క్షీరం అటునుంచి (2)
36. స్వప్నం అటునుంచి (2)
38. ఇదివరకు గ్రామాల్లో కరణాలతో పాటు వీళ్లూ ఉండేవారు (5)
39. దిండు (4)

## నిలువు

1. ఆడపిల్లను ఇలా కూడా అంటారు (2)
2. దశమికి ముందు రోజు (3)
3. రాయు, పూయు (3)
4. 'వస్తాడు' కు వ్యతిరేకం (2)
5. పొలం, సేద్యం (3)
6. 'జనరేషన్'కు తెలుగు (2)
8. తీగలు (3)
9. వాననీటి కోసం - - - పక్షి ఎదురు చూస్తుంది (3)
10. క్రమపద్ధతిలో ఉండటం, ఏర్పాటు (4)
11. దేవలోకంలో కుక్క (3)
12. వలపు, కోరిక (2)
13. నారదుని వీణ (3)
14. తడబడ్డ శ్రీమహావిష్ణువు వాహనం (4)
16. 'విజయానికి ఐదు మెట్లు' రచయిత (4)
18. తెరాస ఎన్నికల గుర్తు (2)
20. తలకిందులైన ఈ యుగం (2)
21. 'పచ్చనాకు సాక్షిగా' రచయిత శీర్షాసనం (3)
22. కొందరు ఎటు వెళ్లాలన్నా ఇది చూస్తారు (4)
24. లోపించు, కోల్పోవు (2)
27. తిక్కనగారి శిష్యుడు, మార్కండేయ పురాణ కర్త (3)
29. బియ్యం (2)
31. అతిగా పొగుడుతుంటే - - - చెట్టు ఎక్కించవద్దంటారు (3)
33. భూగోళానికి నమూనా (2)
35. కొత్త కాదు (2)
37. చివర (2)

*(125వ పేజీ తరువాయి...)*

ఆర్.వి.సి.హెచ్. నాగేశ్వరరావు, శ్రీకాకుళం, 85. బి. సీత, కాకినాడ. 86. పచ్చిపాల సింధు, విశాఖ, 87. యస్. రాజు, కర్నూలు, 88. డా.మునిగోటి సుందర రామశర్మ, మదనపల్లె, 89. పరుచూరి భవానీదేవి, గుంటూరు, 90. ప్రగల్లపాటి రాజ్‌కుమార్, హన్మకొండ, 91. తోటపల్లి శశికళ, గుంతకల్లు, 92. గరికిపాటి కృష్ణ, కాకినాడ, 93. అన్నంరాజు పూర్ణచంద్రరావు, నాయుడుతోట విలేజ్, 94. డా.సి.కె. శాస్త్రి, ఎ.టి.అగ్రహారం, 95. ఎన్.వి.రమణి, బంజారాహిల్స్, 96. పప్పు కామేశ్వరరావు, అమలాపురం, 97. సముద్రాల సంతోష్ కుమారాచార్య, కొడిమ్యాల, 98. ఎం.పి.ఆర్. కుమార్, జగిత్యాల, 99. టి.ఆర్. బాలకృష్ణారావు, రాజమహేంద్రవరం, 100. తిప్పావఝుల సుబ్రహ్మణ్యం, కొత్తూరు, నెల్లూరు జిల్లా, 101. జె. జయశ్రీ, ట్రూప్ బజార్, హైదరాబాద్, 102. గరికిపాటి కృష్ణమూర్తి, కడప, 103. కె.హెచ్. భీమేశ్వరరావు, కాకినాడ, 104. అడపా సత్యనారాయణ బాబ్జీ, హైదరాబాద్, 105. కరిపె రాజ్‌కుమార్, ఖానాపూర్, ఆదిలాబాద్ జిల్లా.

# చతురంగం - 69

రూ.150/- బహుమతి

గడువు తేదీ : డిసెంబరు 17

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | | 3 ప్ర | 4 | | | 5 | 6 |
| | | 7 | 8 | | | | 9 చా | | |
| | 10 | | | | | 11 | | | |
| 12 | | | | | 13 | | | | 14 |
| 15 | | 16 | | 17 | | | | 18 | |
| | 19 | | 20 | | | | 21 ని | | |
| 22 | | 23 | | 24 | | 25 | | | |
| 26 | 27 | | | 28 | 29 | | 30 | 31 | |
| 32 | | | 33 | | 34 | 35 | | 36 | 37 |
| 38 | | | బు | | | 39 | | | |

పంపినవారి పేరు: ------------------------------------

వయసు (     ) చిరునామా : ------------------------------

------------------------------------------------------

---------------- పిన్ : ---------- ఫోన్ : ---------------

**నిబంధనలు**

✦ చతురంగాన్ని ఇదే పేజీలో పూర్తిచేసి పంపాలి. ✦ తుడుపులు, కొట్టివేతలు ఉండరాదు. ✦ మా 'కీ'తో సరిపోలిన పూరణలనే పరిగణనలోకి తీసుకుంటాం. ✦ గడువు తర్వాత అందిన పూరణలు పరిశీలించం. ✦ ఎక్కువ మంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి విజేతను ఎంపిక చేస్తాం. ✦ ఒక్కొక్కరు ఎన్ని కూపన్లైనా పంపవచ్చు. ✦ ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు. ✦ చతురంగంతోపాటు చతుర, విపుల కూపన్లు అన్నీ ఒకే కవరులో పంపవచ్చు.

చిరునామా : చతురంగం చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజీగూడ, హైదరాబాద్- 82

ఫోన్ : 040 - 23318181, Ext : 6658, 6532

# దొరకునా ఇటువంటి సేవ!

ఆ చర్చిలో పనిచేసే బ్రదర్లందరూ తమ శక్త్యానుసారం మేరీమాతను సేవిస్తున్నారు. ఒకరు కీర్తనలు రచిస్తే, మరొకతను వాటిని శ్రావ్యంగా ఆలపిస్తాడు. వేరొకతను చక్కటి చిత్రాలు గీస్తాడు. ఇటీవల బ్రదర్‌గా మారిన నిరక్షరాస్యుడైన బార్నబీ తన అశక్తతకు చింతిస్తూ, తానెలా మేరీమాతను సేవించాలో ఆలోచించి ఓ ఉపాయం కనిపెట్టాడు. ఇంతకీ అతను మేరీమాతను కొలిచే విధానమేంటి? అది ఆమోదయోగ్యమైనదేనా? చదవండి.. **అనతోల్ ఫ్రాన్స్** ఫ్రెంచి కథ **గారడీవాడు**

"**నీ** భార్యలో ఏం డిఫెక్టు ఉందని వదిలేశావు?" అడిగాడు గిరి రామును.

"ఏమీ లేదు" అన్నాడు రాము ముభావంగా.

"ఆమె ప్రవర్తన చెడ్డదా?"

"ఆమెనలా అన్నవాళ్లు పురుగులు పడి చస్తారు"




"ఆమెకు నీ మీద ప్రేమలేదంటావా?"

"ఎప్పటికీ ఆ మాట అనను. ఆమెకు నేనంటే ప్రాణాధికం"

"మరయితే అందం చాలదా?"

"అందానికి అంతెక్కడ? నాకా పిచ్చిలేదు" అన్నాడు రాము.

అంతగా భార్యను ప్రేమించిన **అతడు ఆమెను ఎందుకు విడిచిపెట్టాడు?**

క్షణక్షణం ఉత్కంఠతో చదివించే వెయ్యి నవలల **కొవ్వలి**వారి కథ **వెర్రిప్రేమ** కథకులఫైల్ లో!

* **రింగరింగారింగరింగారే..**
* **పేరడీ బీరెడీ**

ఇంకా మరెన్నో డిసెంబరు విపులలో!

Printed, Published, Edited & Owned, by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Colorama Printers Private Limited., 15/A/1, S.V. Co.Op Industrial Estate, Jeedimetla, Medchal District, 500 055 Telengana. Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 9959021802; Rajahmundry: 2468992; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 241101; Kurnool: 252813; Kadapa: 270011; Tadepalligudem: 228881; Warangal: 9959021804; Khammam: 9959021806; Nizamabad: 245661; Mahabubnagar: 8008706125; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982498; Chennai: 28242036; Bangalore: 25599686. Toll Free Help line No. 18004258888 (Hyd.), www.eenadu.net.

# పల్లెటూరమ్మాయి పబ్బులో...




భర్త రమేష్ తనతో రమ్మంటే సినిమాకో, షికారుకో అనుకుని సంబరంగా బయల్దేరింది ధనలక్ష్మి.

తీరా పబ్బుకి తీసికెళ్ళడంతో బిత్తరపోయిందామె. అక్కడ రమేష్ తన స్నేహితుల్ని పరిచయం చేశాడు.

శీతల పానీయ మంటూ ఆమెతో మందు తాగించాడు.

తూలిపోయిన ధనలక్ష్మిని శ్రీకాంత్ గెస్ట్‌హౌజ్‌కు చేర్చాడు.

ఆ తర్వాతేమైంది? ధనలక్ష్మి జీవితం ఎన్ని మలుపులు తిరిగి ఏ గమ్యానికి చేరింది?

రొటీన్‌కు భిన్నమైన కథని విలక్షణ శైలితో ప్రతి అక్షరంలో కొత్తదనాన్ని రంగరించిన **యక్కలూరి శ్రీరాములు** నవల

**లగ్నజిత**

నూతన సంవత్సర ప్రత్యేక కానుక!

**బోనస్‌గా..**

* **నవలావలోకనం:** పంతొమ్మిదొందల డెబ్బయ్యో దశకం నాటి గ్రామ పెద్దల అరాచకాలు, నిమ్నకులాల స్థితిగతులకు అద్దం పడుతూ ఆర్ద్రంగా సాగిన **డా. కేశవరెడ్డి ఇన్‌క్రెడిబుల్ గాడెస్** పై సమీక్ష
* **కాలాతీతం:** నోబెల్ గ్రహీత **సాల్ బెల్లో** నవల **డాంగ్లింగ్‌మాన్**

కథాకమామిషు ఇంకా చతుర ప్ర.జ., చమత్'కారం'.. మరెన్నో!

